చతుర
ఏప్రిల్ 1983

సంపుటి : 6
సంచిక : 3

29/6/12

# ఈనెల సమగ్ర నవల

రాజరికాలేనాడో అంతమయ్యాయి. ఆ దర్జాలకూ రోజులు చెల్లిపోయేయి. ఆస్తులు కరిగిపోయి వైభవాలన్నీ గత స్మృతులుగా మిగిలిపోయేయి. దేవిడీలూ, దర్బార్లూ భరించలేని బరువుగామారి శిథిలాలయిపోయేయి. వేటాడేందుకు పులులూ, అడవి పందులూ లేని అడవులు మిగిలేయి.
అయినా ఆ వైభవాల్నే, ఆ దర్జాలనే నెమరేసుకుంటూ ప్రస్తుత పరిస్థితుల్ని గుర్తించలేని

# రాజుగోరు

ఈ రోజుల్లోనూ అలాగే దర్జా వెలగబెట్టజూస్తే పరిణామాలేలా ఉంటాయి? జీవిత యదార్థాన్ని గుర్తించక ఊహ జగత్తులో విహరించజూస్తే ఫలితాలెలా ఉంటాయి? పరువు కోసం ప్రాణం వదుల్తాననే పెద్దమనిషి మీద అటు దొంగతనం, ఇటు హత్యానేరం పడితే...?

## కె.ఎన్.వై. పతంజలి

అంతరించిన రాజరికాల అవశేషాల అవకాశవాద అమాయకత్వాన్ని ఎత్తిచూపుతూ రాసిన 'రాజుగోరు' ఈనెల చతుర సమగ్ర నవల.



ముఖ చిత్రం: దిలీప్ బెనర్జీ

రెండవ కవరు:
మూడవ కవరు: } బ్రహ్మదేవ్

చతుర

# ఫూల్స్ పండుగ

'ఫూల్' అవాలని ఎవరూ అనుకోరు. సరదాగా జరుపుకొనే ఏప్రిల్ ఫస్టున కూడా ఎవరన్నా ఫూల్ చేస్తే తెగ ఉడుక్కుంటాం. కాని హిప్పీలు మాత్రం ఫూల్స్ పండగని చాలా ఘనంగా జరుపుకుంటారు. ఏడాదికోసారి ప్రపంచంలోని హిప్పీలందరూ ఏదో ఓచోట చేరి పది హేనురోజులపాటు జరుపుకొనే ఈ పండుగను 'ఫూల్స్ పండగ' లేదా 'చంద్రుని పండగ' అంటారు. ఈ ఉత్సవంలో పాల్గొనేవారు ఒకర్నొకరు ఫూల్, జోకర్, బఫూన్ అని ముద్దుపేర్లతో పిల్చుకుంటారు.

ఈ పండగ గురించి ముందుగానే పోస్టర్లు, ఓల్ బోర్డుల ద్వారా ప్రపంచమంతటా ప్రకటిస్తారు. గత సంవత్సరం ఈ పండగ ఆమ్‌స్టర్ డామ్‌లో జరిగింది. ప్రపంచం నలుమూలల నుండి రంగు రంగుల దుస్తులు ధరించిన జోకర్లు, ప్రఖ్యాత పాప్‌గాయకులు, వీధి గాయకులు, తమాషాగా వుండే వాద్య పరికరాలు వాయించేవారు, తమాషాగా నృత్యంచేసేవారు, గమ్మత్తయిన జిమ్నాస్టిక్స్ చేసేవారు హిప్పీలతో కలిసి ఈ పండగను బ్రహ్మాండంగా జరుపుతారు.

ఈ హిప్పీలపండగలో ఎవరైనా పాల్గొనవచ్చు. ఈ పండగ అనేకమంది గాయకుల, డాన్సర్లలోని ప్రతిభను వెలికి తెస్తోందని హిప్పీల అభిప్రాయం. ఈ పండగ సందర్భంగా హిప్పీలు ప్రపంచంలోని అన్ని రకాల వంటకాలూ తయారు చేస్తారు. ఉత్సవంలో పాల్గొనేవారు చిత్త మొచ్చినంత తాగవచ్చు. అక్కడ ఏరకం మద్యం కావాలంటే అది దొరుకుతుంది.




# ప్రపంచం

ఈ పండగ నిర్వాహకులు ఫూల్స్ కోసం ప్రత్యేకంగా ఒక స్కూల్ నడుపుతారు. వీరికి స్వంత స్టూడియో కూడా వుంది. కేరికేచర్, జిమ్నాస్టిక్స్‌వంటి విన్యాసాలు, కళ్ళకు గంతలు కట్టుకొని చేసే ట్రిక్కులు, నిప్పును మింగడం, రకరకాల డాన్సులు, మేజిక్, హాస్యం, రోలర్ స్కేటింగ్, ఫైటింగ్, చమత్కారంగా మాట్లాడటం వగైరాలన్నీ నేర్పిస్తారు స్కూల్లో.

పండగ సందర్భంగా 'ఫూల్స్ ఎవ్వేరీ వేర్' అనే ప్రత్యేక సంచికను ప్రచురిస్తారు. ఇందులోని ప్రతి రచన మూడు భాషల్లో వుంటుంది. క్రితం సంవత్సరంలోని తమాషా అనుభవాలను గురించి హిప్పీలు రాసిన రచనలు వుంటాయి ఇందులో.

## స్టాంపు విలువ

ఒకప్పుడు హాబీగా మొదలైన స్టాంపుల సేకరణ ఇప్పుడు లాభసాటి వ్యాపారంగా మారింది. ప్రపంచంలోకెల్లా అత్యంత విలువైన స్టాంపులను సేకరించిన ఘనత కీర్తిశేషుడైన ఐదవ కింగ్‌జార్జ్‌కి దక్కుతుంది. దాదాపు మూడుకోట్ల రూపాయల విలువ చేసే స్టాంపులను సేకరించారాయన. ప్రస్తుతం ఇవన్నీ లండన్‌లోని బ్రిటిష్ మ్యూజియంలో వున్నాయి.

ఇతను సేకరించిన వాటన్నిటిలోకి అత్యంత విలువైనది రెండు స్టాంపులున్న ఒక కవరు. ఈ కవరు 1847, సెప్టెంబర్ 20న విడుదల చేయబడింది. మారిషస్ ప్రభుత్వం స్వంతంగా స్టాంపులు విడుదల చేయదలిచి బెర్నార్డ్ అనే అతనికి ఒక పెన్నీ, రెండు పెన్నీ స్టాంపులడిజైను రూపొందించే పని అప్ప

గించింది. అయితే బెర్నార్డ్ నిర్లక్ష్యం వల్లనో, పొరపాటు వల్లనో స్టాంపుల మీద 'పోస్ట్‌పెయిడ్' బదులు 'పోస్ట్ ఆఫీస్' అని రాశాడు. అలా రాసిన స్టాంపులు వాడుకలోకి వచ్చేశాయి.



ఈ విషయం అధికారుల దృష్టిలోకి వచ్చి ఆ స్టాంపుల అమ్మకాన్ని ఆపే లోపల 500 ఒక పెన్నీ స్టాంపులు, 500 రెండు పెన్నీ స్టాంపులు అమ్ముడయి పోయాయి. అలా అమ్ముడయిన స్టాంపుల విలువ అమాంతం పెరిగిపోయింది. ప్రస్తుతం ప్రపంచ స్టాంపు సేకరణ దారుల వద్ద అలా తప్పుగా ప్రింటయిన ఒక పెన్నీ స్టాంపులు 14, రెండు పెన్నీ స్టాంపులు 12 మాత్రం వున్నాయట. ఇవి ఎవరేనా అమ్మదలిస్తే అంతర్జాతీయ ఫిలటెలి కాంగ్రెస్ ముద్రవేయని ఒక పెన్నీ స్టాంపుకి మూడు లక్షల డాలర్లు, ముద్రలేని రెండు పెన్నీల స్టాంపుకి రెండు లక్షల డాలర్లు, ముద్రవేసి ఉంటే ఒక్కో దానికి 1 లక్షా 25 వేల డాలర్లు చెల్లించడానికి సిద్ధంగా వుంది.

మరో ఆసక్తికరమైన విషయం ఏమిటంటే ఒక పెన్నీ, రెండు పెన్నీల స్టాంపులుగల కవరొకటి పోస్టల్ ముద్రలతో మారిషస్ నుంచి బొంబాయి చేరింది. 1850 జనవరి 4న బాంబే అనుబంధ బైబిల్ హోమ్ సొసైటీకి వచ్చిన ఆ కవరు తర్వాత బొంబాయిలోని 'చోర్ బజార్' చేరి ఓ స్టాంపు సేకరణదారు చేతిలో పడింది. అతను దాన్ని హార్వర్డ్ అనే ఇంగ్లీష్ స్టాంప్ సేకరణదారుకి 50 డాలర్లకి అమ్మేశాడు. హార్వర్డ్ దాన్ని మరొకరికి 1600 డాలర్లకి అమ్మగా అతన్నుంచి లిక్ టైన్‌స్టైన్ అనే అతను 1947లో 2,200 డాలర్లకి కొన్నాడా కవరుని. లిక్ కూతురు ఈ కవరును వేలంలో పెట్టగా 3,80,000 డాలర్లకి అమ్ముడుపోయింది.

# తమాషా దొంగతనాలు

వేసవిలో కాశ్మీరులా అన్పించే ఉత్తర





ప్రదేశ్‌లోని నైనిటాల్ ఆమధ్య విచిత్రంగా సంభవించిన అగ్నిప్రమాదాలతో గడగడ వణికిపోయింది. కేవలం రెండు నెలల కాలంలో తొమ్మిదిఇళ్ళు కాలి బూడిదై పోయాయి. కారణం ఎవరికీ తెలీదు.

ఈ అగ్నిప్రమాదాలను చూసి నైనిటాల్ ప్రజలు భయకంపితులై పోయి ఇవన్నీ దుష్టశక్తుల పనులని భావించి పూజలూ, పునస్కారాలూ చేశారుకూడా. పోలీసులకి అగ్నిప్రమాదాలకు ఓ వ్యక్తి కారణమని తెలుసుగాని ఆ దొంగ ఎవరో, ఎందుకలా చేస్తున్నాడో మాత్రం అర్థం కాలేదు. ఈ కొత్తరకం దొంగ ఇంటికి నిప్పంటించి పారిపోయేవాడు. ఆ ఇంటి లోంచి పూచిక పుల్లకూడా ఎత్తుకుపోయే వాడు కాదు.

ఈ దొంగ ఓ లాయరుగారింటికి నిప్పంటించగా 15వేల రూపాయల ఆస్తి నాశనమయింది. లాయరుగారింట్లో ఏమీ పోలేదుగాని పచ్చళ్ళ జాడీలన్నీ మాత్రం ఖాళీగా కన్పించాయట. ఓ సరుకుల దుకాణానికి నిప్పంటించినపుడు దొంగ 30 కోడిగుడ్లు, 2 కేజీల తాజా తేనె మాత్రమే పట్టుకుపోయాడు.

పోలీసులు ఈ దొంగ ఆచూకీ చెప్పిన వారికి 500రూపాయలు బహుమతి ప్రకటించారు కూడా. చివరికి అతను ఎలాగైతేనేం రాత్రిపూట ఓ లాడ్జికి నిప్పంటిస్తుండగా పట్టుబడ్డాడు. ఆ లాడ్జి వంటవాడు ఆరోజు ఎందుకో నిద్రపట్టక బాల్కనీలో పచార్లు చేస్తోంటే ఏదో కాలిన వాసన వచ్చింది. ఏమిటా అని కిందహాల్లోకి తొంగిచూశాడు. అక్కడ కుర్చీలన్నీ తగలబడుతోంటే ఓ మనిషి ఆనందంగా డాన్స్‌చేయడం కనిపించింది. వెంటనే వంటవాడు కేకలువేసేసరికి సెక్యూరిటీ సిబ్బంది వచ్చి దొంగను పట్టుకున్నారు.




తర్వాత కేసు విచారణ సందర్భంగా అతని వింత ప్రవర్తనకి కారణం తెలిసింది. దొంగ పేరు హరీష్. అతను ఓ క్రైస్తవుల అమ్మాయిని పెళ్ళి చేసుకుందామనుకున్నాడు. కానీ అమ్మాయి తల్లిదండ్రులు ఒప్పుకోకపోవడంతో అమ్మాయి ఆత్మహత్య చేసుకుంది. ఆ రోజునుంచి హరీష్‌కి

మతిచలించి అలా తయారయ్యాడు.

# పాముల బెడద



నేలమీద వుండే పాముల్తోనే మనుషులు నానాబాధా పడుతోంటే అది చాలదన్నట్లు నీళ్ళల్లో వుండే పాములు కూడా విజృంభించి అదరగొట్టేస్తున్నాయి. సముద్రాల్లో వుండే లెక్కలేనన్ని రకాల పాముల్లో కొన్ని అత్యంత ప్రమాదకరమైనవి. సాధారణంగా సముద్రంలో అడుగున నివసించే ఈపాములు సముద్ర స్నానం చేసేవారికి, చేపలు పట్టేవారికి పెద్ద సమస్యగా మారుతున్నాయి.

భారతదేశాన్ని ఆవరించివున్న సముద్రాల్లో గల పాముల్లో పదమూడు రకాలు అత్యంత ప్రమాదకరమైనవి. ఈ పాములు ముఖ్యంగా గంగానది బంగాళాఖాతంలో కలిసే చోట ప్రమాదాల్ని సృష్టిస్తున్నాయి. వీటిలో సిస్టోసా జాతి పాములు మరీ ప్రమాదకరమైనవి. ఈ పాములు సముద్రంలో ఈదేవారి వెంటబడి కరవడానికి ప్రయత్నిస్తుంటాయి. మలేసియా కోస్తా గ్రామాల్లో ప్రతి ఏడాది దాదాపు 150 మంది వరకూ వీటి ఆగడానికి గురవుతున్నారు. వీటి ఒక చుక్క విషం ముగ్గుర్ని కైలాస యాత్రకు పంపడానికి సరిపోతుంది.

ఇవి కరిచిన అరగంటలోనే వీటి విషం కాలేయం, మూత్రపిండాలు, గుండెను వ్యాపించి మరణం సంభవిస్తుంది. కొన్ని పాములు కరిచిన కొన్ని గంటలకు తొడల్లో నొప్పి మొదలవుతుంది. తర్వాత చేతులు, మెడలో నొప్పి అన్పిస్తుంది. తర్వాత మెడ కొయ్యలా గట్టిగా బిగుసుకుపోతుంది. తనంతట తను కూర్చోలేడు. మింగడం కష్టమవుతుంది. మాట్లాడలేడు. విపరీతమైన దాహం వేస్తుంది. వాంతులవుతాయి కూడా. ఆ తర్వాత మూత్రం ఎర్రగా మారి, ఊపిరి పీల్చడం కష్టమై వెంటనే గుండె ఆగిపోతుంది. విషం ఇంకా శక్తివంతమైనదైతే పాము కరిచిన 12–24 గంటల్లోనే మరణం సంభవిసుంది. ఈ పాము కాటుకు మందును ఆస్ట్రేలియాలో తయారు చేస్తున్నారు. సముద్రస్నానాల మీద మోజున్నవారు ఇకనుంచి నదులు సముద్రంలో కలిసే ప్రాంతాలకి దూరంగా వుండటం మంచిది. *

# శుభ్రమైన తాజా శ్వాస...
# ఆరోగ్యం చిందే గట్టి పళ్ళు



## కోల్గేట్ డెంటల్ క్రీమ్ ఫలితం

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోమకుండి. కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోము కోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పని చేస్తుందంటే:



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా లోతుకుచేరి హానికరమైన ఆహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది.



ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.

కోల్గేట్‌లోని తాజా పిప్పరమెంట్ లాంటి రుచి మీ మనసుకు నచ్చుతుంది.

## నోటి దుర్వాసనను ఆపండి...
## కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో
## దంతక్షయాన్ని ఎదుర్కోండి!




DC.G.74 TL

మధ్యాహ్నం నాలుగు గంటలు.

ఉమ్మడి సావిడి ఆవరణలో ప్రహరీకి ఆన్చివేసిన రాతిపలక మీద కూర్చుని హుక్కా పీల్చుతున్నాడు పెద అప్పలరాజు. ఉమ్మడి సావిడి అలమండలో వున్న నలభై కుటుంబాల క్షత్రియులది. దాన్ని పెదసావిడి అంటారు.

పెదసావిడికి ముందు నుంచి ఆ ఊరికి ముఖ్యమైన రహదారి వుంది. సావిడికి అటూ ఇటూ, వెనుక వరసలోనూ రాజుల లోగిళ్ళన్నీ వున్నాయి. అయిదు వేల జనాభా వున్న ఆ ఊరిలో రాజుల ఇళ్ళ తరువాత వెలమల ఇళ్లు, అవి దాటిన తరువాత నాలుగయిదు బ్రాహ్మణ కుటుంబాలు. రెండో వేపున తెలగాలు, సాలీలు, కమ్మరం పనిచేసే కంసాళ్ళు, బంగారం పనిచేసే షరాబులూ, కొద్ది నాగాసపు కుటుంబాలు; అవి దాటిన తరువాత చాకలి, మంగలి పేటలూ, కాస్త దూరంగా మాలపేట, కాస్త ఇవతల కుమ్మరిపేట.

పెద అప్పలరాజుకి అరవైనాలుగు సంవత్సరాలు. పల్చటి, తెల్లటి గ్లాస్కో జుబ్బా, కాషాయి లుంగీ వేసుకున్నాడు. పాంకోళ్లు తొడుక్కున్నాడు. వెడల్పయిన నుదుటి మీద అగరు బొట్టు పెట్టుకున్నాడు. చెవులకు ఎర్రరాళ్ల తమ్మెట్లు వున్నాయి. వారి కుటుంబంలో కాషాయి పంచె కట్టిన లగాయితూ భార్యను తాకరు. కుటుంబ సంబంధమైన లావాదేవీల్లో పాలుపంచుకోరు. ఎప్పుడైనా తాబేలును తిరగేసి కొడితే చస్తుందనే సత్యాన్ని మాత్రం కావాల్సినవారికి చెప్తారంతే. అదో రకమైన వానప్రస్థం.

గాలి పీచి హుక్కాచిలుంలోని చింత నిప్పులు చిటపట మన్నాయి. దోరస్ తమ్మాకు చిక్కటి వాసన ఆ ప్రాంతాన్ని సున్నితంగా పలకరిస్తోంది. దాదాపు నలభై సంవత్సరాల నుంచి పెద అప్పలరాజు హుక్కా పీల్చుతున్నాడు. కొత్తలో కాస్త సున్నితంగా, కమ్మగా వుండే ముష్కి ఖమీరా రకం తమాకు వాడేవాడు. కానీ దాని ఘాటు చాలక 'దోరస్' రకానికి మారేడు. ఏడాది కొకసారి వారణాసినుంచి రైలు బంగీలో అతను తమాకు తెప్పించుకుంటాడు.

"బాబయ్యా!"

పిలుపు వినిపించిన వైపు దృష్టి మళ్ళించాడు పెదప్పలరాజు.

సావిటి అరుగుకు ఆనుకుని రోడ్డు మీద ఒక రైతు నిల్చున్నాడు. అతనికి నలభై సంవత్సరాల వయసుంటుంది. బాగా నల్లగా, పొడవుగా, బలంగా వున్నాడు. వంటిమీద తెగ మాసిపోయిన మల్లుబనీనుంది. పంచె కట్టి దాన్ని చిలక్కట్టు దోపాడు. కాలి వెంట కిందకు జారవలసిన రెండు కొనల్ని మోకాలి వరకూ మడిచి నడుముకు చుట్టేశాడు. చెవి ఇరుకున సగంకాల్చి ఆర్పిన చుట్టుంది. తలపాగా చుట్టుకొని వచ్చినందువల్ల జుత్తు అణిగిపోయి వుంది. పాగా విప్పిన నాగుల తువ్వాలు ఇపుడతని భుజం మీదుంది.

"ఏవోయి...."

రైతు ఇబ్బంది పడుతూ తల గోక్కున్నాడు "బాబూ! రాజుగోరి ఇల్లెక్కడండీ?"

హుక్కా గుడగుడ పీల్చి పెదప్పలరాజు నవ్వేడు "సంతకి సీటి లచ్చికి గాజుల్లాగుందోయి నీ ప్రశ్న...రాజుగారంటే ఏ రాజుగారు? మా కుటుంబంలో గోపాలరాజులున్నారు, విజయ గోపాల రాజులున్నారు, వేంకట విజయగోపాల





రాజులున్నారు, సన్యాసి వేంకట విజయ గోపాల రాజులున్నారు, రంగ రాజులున్నారు, పెదరాజుగారి చంటి బాబుగారి చినరాజులున్నారు, చినరాజుగారి తాత బాబుగారి చిట్టిరాజుగారున్నారు, పెదరాజు గారి, పెదబాబుగారి పెద అప్పలరాజు గారంటే నేను...ఇందరు రాజుల్లో నీకు ఎవరిల్లు కావాలోయ్ నాయుడూ"

ఆ రైతు ఈసారి చిరాగ్గా తల గోక్కొని వెర్రినవ్వు నవ్వేడు. "సెడ్డ సిక్కొచ్చి పడ్డాదండి. రాజుగోరంతే మందులిచ్చే రాజుగోరండి. తెల్లగా, పొడుగ్గా వుంతారండి. ఎల్లగుబ్బ గొడుగు నాగుంతారండి. మీసాలుంతాయండి. ఆ! ముక్కండి...అదండి రాజుగోరూ మూరడు ముక్కంతాదండి"

పెదప్పలరాజు మళ్ళీ గుడగుడమని హుక్కా మరోసారి పీల్చేడు.

"ఏ వూరోయి నీది?"

"మాది కలగాడండి బావుగోరూ! ఎల వోళ్ళబొప్పిడ్ని.సుక్కురోరం సంతకొచ్చి నపుడల్లా తప్పుర్నె శానా సుట్లు సూసినా నండి. కానీ వప్పుడుగోరెవరో తెలీదండి"

"ఇపుడు ఏం పనిమీద వచ్చేవోయ్?"

"మా ఇంట్లో సిమ్మళంగనేదండి రాజుగోరూ! ఎన్ని వొయిద్యాలు జేసినా తగ్గనేదండి.ఆయెనక మొన్న కొత్తవొలస సంతనాడు ఈ రాజుగారు అవుపించే రండి. నోగిటి కాడికి పొద్దారా మందిస్తా నన్నారండి. నాకసలు మీనాంటి రాజుల కాడికి రావడమంటే సీకాకండి. పేరడిగితే ఏటనుకుంతారో ఏహోనని ఆయేళ ఆ రాజుగోరి పేరు అడగనేదండి"

"మంచిపని జేశావుకానీ ఇప్పటికి కలగాడ తిరిగి వెళ్ళిపో. కొత్తవలస సంత నాడు మళ్ళీ మాటేసి ఆ రాజుగార్ని పట్టుకో. పేరు తెలీకపోతే పోల్చుకోడం కష్టం. ఇక్కడ రాజులందరూ ఎల్లగుబ్బ గొడుగుల్లాగే వుంటారు. అందరికీ వైద్యం తెలుసును. కొందరిచ్చిన ఔషధాలకు జబ్బులుపోతాయి. మరికొందరిచ్చిన ఔషధాలకు మనుషులేపోతారు. నీ వెనకాల రోడ్డుకు అటేపున్న లోగిట్లో ఫకీరని మా బావగారొకరున్నారు. గొప్ప వైద్యుడు. మందిచ్చి క్షణాలమీద మనిషిని చంపేస్తాడు. మహాపనివాడు. ఇంక ముక్కు సంగతి...ఇలా చూడవోయి. నా ముక్కు మూరెడుందా లేదా?రాచముక్కు అంటారు దీన్ని! మా కుటుంబంలో అందరికీ పెద్ద ముక్కులే. పోనీ ఒక పనిచెయ్. ఎవరికీ నీ ఇంట్లో తేడా?"

"మాయ త్తముండకండి"

"ఏం జబ్బోయి?"

"ఏదో మాయదారిరోగం మారాజా! తింటే ఆయాసం, తినకపోతే నీరసం, ఎగసోస, గుండె దడ - నచ్చాతొంబయి జబ్బులు లెక్కజెబుతాది"

"సర్లే. నా దగ్గిర మొగల్తూరు అవుషధమని జెప్పి ఓ గుళిక వున్నది. ముసిల్దాని పేరున ఏవైనా ఆస్తిపాస్తు లేవైనా వున్నాయా?"

"సితం. కుసింత ఆస్తి గట్టావున్నాది నెండి బాబయ్యా! బంగారప్పిసరకూడా జాగర్తజేసింది. అందికే ముసిల్దానికిన్ని రోగాలొచ్చినాయి. ఏ జబ్బొచ్చినా సచ్చిపోతానని మాయత్తకి మనేదండి ... మమ్మల్ని సంపుకుని తింటాదండి"

పెదప్పలరాజు హుక్కా మరో పట్టు పట్టేడు.

"నిజం చెప్పవోయి నాయుడు. నువ్వు మీయత్త పోవాలని కోరుకుంటున్నావా? బతకాలని దణ్ణం పెట్టుకుంటున్నావా?" అని

అడిగి పెదప్పలరాజు నవ్వేడు.

నాయుడు తెల్లబోయాడు.

"అదేటండి రాజుగారు అంతమాటనీసేరు"

"ఏం లేదులే. నేను జెప్పిన అవుషధం రెండు మోతాదులిస్తాను. కావలిస్తే పట్టికెళ్లు. మొదటి మోతాదు జీరకోళంలోకి వెళ్ళేసరికి జబ్బు సరైనదీ, నిజమైనదీ అయితే తకీమని తగ్గిపోతాది. నాకు ఓ మంచి సోగల కోణ్నిగానీ, డింకీ పుంజును గానీ తీసుకొచ్చి ఇచ్చే దొంగ జబ్బుగానీ అయితే రెండో మోతాదుకి ముసిల్ది రా. ఆ భూమి పుత్రా, బంగారప్పిసరూ నీకు కల్సివస్తుంది. కాబట్టి మాంచి తయారు మీదున్న పందెపు గ్రాఁపోతుని నాకు చదివించుకో" అన్నాడు పెదప్పలరాజు.

రైతుకు చాలాకోపం వచ్చింది. 'రాసోడికి మా పెద్ద ఎటకారం గున్నట్టుంది పూరుగాని పూరయిపోనాది. నేకపోతే ముక్కు కోసేసి సేతిలబెట్టేసి పోదును. ఏటీడి పోయీకాలం' అనుకున్నాడు.

"ఏవోయి కలగాడ నాయుడూ! మాటాడ్డంలేదేటి? కోడిపుంజునిచ్చుకోమన్నాననా? పోనీ ఒక పనిజెయ్యి. మా ఊర్లో గోపాత్రుడని ఒకవైద్యుడున్నాడు. మా ఫకీరు బావ శిష్యుడు. చాలా పనివాడు. బంగాతీగ చెరుకుగడ ఒకటి చదివించుకొని 'పాత్రుడుగారూ! మా యత్తని కూనీ జేయాలండి' అని చెప్పితే చాలు-ఒకేఒక మోతాదిచ్చి పని జరిపేస్తాడు. అడుగో! మా ఫకీరుబావ లోగిట్లోంచి లోకంమీడకి బయలుదేరాడు" అన్నాడు పెదప్పలరాజు.

కలగాడ నాయుడికి ఒళ్లు కుతకుతా ఉడికిపోయింది. నిరసన సూచకంగా పెదప్పలరాజుకేసి వీపు చూపించి అటు తిరిగాడు.

అలా నిలబడిన నాయుడికి ఫకీర్రాజూ, అతనివెనుకనే నడుస్తున్న గోపాత్రుడూ ఫకీర్రాజు ఇంట్లోంచి బయటకొస్తూ కనిపించారు.

'ఈడేన్రా బాబూ...కొత్తాలస సంత నాడు కనిపించినోడు ఈడే..ఈడే ఆ రాజుగోరు...దొరికినాడు' అనుకొంటూ కలగాడనాయుడు రోడ్డుదాటి ఫకీర్రాజు ప్రహరీ గుమ్మందాటి ఆవరణలో ప్రవేశించాడు. వెనుకనుంచి పెదప్పలరాజు ఏదో అంటున్నాడుగానీ నాయుడు పట్టించుకోలేదు.

ఆ పూరిలో రాజుల ఇళ్ళన్నిటికీ ఎత్తయిన, విశాలమైన ప్రహరీ గోడలున్నాయి. వాటిలో కొన్ని కూలిపోవడం ప్రారంభించాయి.

ఫకీర్రాజుకి ఎదురుగా వెళ్ళి అమాత్రం దూరంనుంచి కలగాడ నాయుడు దండం పెట్టాడు.

ఫకీర్రాజుకి నలభయి ఏళ్లు. గ్లాస్కో లాల్చీ, గ్లాస్కో పంచె, వేసుకున్న నల్లటి చదావులు పాతబడివున్నాయి. ఎర్రటి, పల్చటి మనిషి. కొట్టవచ్చినట్టు కనిపించే సూదిముక్కు. పల్చటి పొడవైన మీసాలు, చెవులకి తెల్లవెళ్ళ ఉద్దులున్నాయి. నొసట్న కనిపించని తిలకపు బొట్టు.

కలగాడ నాయుడి నమస్కారాన్ని రెప్పల అర్పుతో స్వీకరించాడు ఫకీర్రాజు. నడకఆపి తనపక్కనే నడుస్తున్న పాత్రుడివేపు తిరిగాడు.

"చూడవోయి పాత్రుడూ! అతగాడు పెదవి విప్పకముందే రోగనిదానం చేస్తాను."

"చితం..." అనికలగాడ నాయుడివేపు

పరీక్షగా చూశాడు గోపాత్రుడు. అతడికి ముప్ఫయి సంవత్సరాలుంటాయి. తెల్లగా, పుష్టిగా, పొట్టిగా వుంటాడు. లాల్చీ, షరాయి వేశాడు. ఉంగరాల జుత్తు మధ్య పాపిడితీసి సాధ్యమైనంత ఎక్కువ నూనె రాసి తలదువ్వేడు.

అవస్థపడి దండంబెట్టినా ఫకీర్రాజు ఏమీ అనకపోవటం చూసి 'రాసోడికి సుమ్మారు దండవెట్టాలి గావాల. తగ లాటకం' అనుకుని కలగాడ నాయుడు మరో రెండుసార్లు నమస్కరించేడు.

ఫకీర్రాజు కళ్లు చిట్లించి కలగాడ నాయుడికేసి చూశాడు. తరువాత తల పైకెత్తి ఆకాశాన్ని తీక్షణంగాచూసి, తల దించి కళ్లుమూసి, "నాకంతా తెలుసును. నువ్వేం మాట్లాడకు" అని, కళ్లు తెరచి కలగాడ నాయుడి వేపు చూస్తూ— "నీకు పగలూ, రేయీ ఎడతెరిపిలేని దగ్గొస్తుందా!" అని అడిగాడు.

"నాకా...?దగ్గా..?నేదండి"

"దగ్గినపుడు రక్తపు ముద్దలు కఫం లాగ పడుతున్నాదా?"

"సీ...సీ...నేదండి"

"అలాగ రక్తం పడిపోతున్నపుడు ఒళ్ళు తెలీకుండా జెరం వొస్తున్నాదా?"

"రాజుగోరండీ...తమరేటి మాటాడ తన్నారో నాకేటీ తెలీడం నేదండి. నా కసలు ఏ జబ్బూ నేదండి. మాయత్తకండి తేడాగుంది. మాది కలగాడండి. మొన్న మంగళారం సంతనాడు కొత్తవల్సలో తమరిగోరికి మనింజేసుకున్నాం గాదండీ? అంతా నాకు దెలుసంటే అవును మరి కొత్తవల్సలో జెప్పినాసుగద చూడస్తునేర పోతాదా రాజుగోరి దసుసున్నానండి" అన్నాడు కలగాడ నాయుడు.

అప్పటికి ఫకీర్రాజు సర్దుకున్నాడు.

"అదేనోయ్...నేను మీ యత్త సంగతే మాట్లాడుతున్నాను...నాకు జాపకం లేకపోవడమేమిటి...?ఇప్పుడెలా గుంది?"

"ముసల్ది సంపుకు తింటన్నాదండి... మా వూర్లో ఎంతమంది వొయిద్యులున్నారో అంతమందిరీ మందులిచ్చినారండి ... తగ్గనేదండి..."

అప్పుడు పాత్రుడందుకున్నాడు - "మా దగ్గిర నీకా అనుమానం అక్కర్లేదు. ఎలాంటి జబ్బులైనా తగ్గిపోతాయి. కాపోతే బంగారం కలిపిన ఔషధాలు వాడ వలసివుంటుంది"

"మందుల్లో గూడా బంగారం ఏస్తారే టండి...తప్పుడుగోరెప్పురో నాకు తెలీదు గానండి....మాపు నాదారోళ్ళవండి... తమరిలాగ రాజులం కాదండి. అదిగాక కరుసంటే మాయత్తకి పేణాలు పోతా యండి"

"కరుసంటే భయపడిపోయేవాళ్ళకి జబ్బులు తగ్గవోయ్..నువ్వేమంటే అనుకో గానీ..." అన్నాడు పాత్రుడు చికాగ్గా.

"పాత్రుడూ....ఓయ్ గోపాత్రుడూ! నువ్వూరుకోవోయ్" అన్నాడు ఫకీర్ రాజు.

"ఏటండి వూరుకోమంటారు. ఇదేం వైద్యమండి-ఎంతసేపూ చేతి నప్పురేనా? మీలాంటోళ్ళందరూ ఇలా అడుపు వైద్యాలు నేర్పేస్తారు. నాలాంటివాళ్ళు నిప్పుపట్టుకోవడమే..."

"గోపాత్రుడుగోరంటే తప్పురేనే టండి..."

"వినేవుంటావులే పేరు. ఇప్పుడిప్పుడే నలుగురికీ తెలుస్తోంది. ఇతగాడి తండ్రి పెదలచ్చాపాత్రుడని గొప్ప వైద్యుడు. పాపం హఠాత్తుగా చనిపోయాడు. ఇత





గాడు తండ్రి బతికున్నంత కాలవూ జులాయిగా తిరిగి చెడ్డాడు. ఆఖరికి అతడి కులవృత్తి నా దగ్గిర నేర్చుకోవలసి వచ్చింది"

"తవురిగోరి గురిచ్చీ, గోపాతుడ్ని గురిచ్చీ రాతి దిమ్మల మీద కూకుడున్న ముసలిరాజుగోరు ఇకటాలాడ్నారండి... వొయిద్యవే రాదన్నారండి. ఎదుటోడి మనసు కష్టపడతాదో ఏటో అని చూసీ చూసుకోడండి ఆ రాజుగోరు..."

ఫకీర్రాజు నవ్వేడు- "ఆయనా...? వొట్టి కొంటి మనిషి. కొత్త మనిషెవరైనా కనిపిస్తే ఆటపట్టించడానికి జూస్తారు...."

"ఎప్పుడో ఒకరోజు ఆ ముసిల్రాజుకి నేనే వసంతం మాత్ర ఇచ్చేస్తాను" అన్నాడు గోపాత్రుడు కూడా.

"సరేనోయి నాయుడూ...రాలోపలికి" అనేసి ఫకీర్రాజు మళ్ళీ తన ఇంటివైపు తిరిగాడు.

"నాయుడూ! నీ పేరేవిటోయి?"

"అప్పల నాయుడండి...గొర్రిపోతోల వండి"

"ఇంతకుముందు మీ అత్తకి ఏ వైద్యం చేయించారో చెప్పగలవా?"

"ఏం వొయిద్యాలండి. ఇంటికాడ ఆడ సంతిలు సేసీ మామూలు వొయిద్దాలే నండి. ఆకుపసర్లు, గడ్డికట్లు, బురదకట్లు, కషాయాలు, దుంపలూ ఇలాంటివేనండి. ఇందాక నాను గాబరా అయిపోన్నండి- తవురిగోరి పేరు ఆయాళ నాను అడగ నేదు గదండి ఇందాక రాజుగోరిలెక్క- డండి అననిగినానండి. ఏ రాజుగోరు, ఏం లోకవండి... ఆ యెనక ఇటు దిరిగేసరికి తవురే కనిపించినారండి"

"నా పేరు ఫకీర్రాజోయ్-ఉప్పలపాటి ఫకీర్రాజు"

"నాకు రాజుల్తో మాట్లాడ్డవంటేనే పుర్రాకులు బడిపోవలసి వస్తాదని ఇది బాబయ్యా..."

"జాగ్రత్తగా మాట్లావాలోయి. మాట తప్పుకంటే మాన మర్యాదలు ముఖ్యం" అన్నాడు ఫకీర్రాజు.

"నాకా సంగతి తెలుసు మారాజా! పరిజాలకోసవే కదండి రాసోలు భూవీ పుట్రా అమ్ముకోని సెడిపోనారు" అన్నాడు అప్పలనాయుడు.

"మర్యాదకోసం, పవురుషం కోసం ప్రాణాలైనా ధారపోసేస్తావోయ్" అన్నాడు నడుస్తున్న ఫకీర్రాజు ఆగిమరీ.

"నానెరుగుదునండి. బాబయ్యా! విజినారంలోని వొటేలు సూర్రాజు మీకేటౌతాడండి?" అని అడిగాడు అప్పల నాయుడు.

ఫకీర్రాజు ఉగుసుకుపోయాడు. అతనికి హద్దుమాలిన కోపం వొచ్చింది "అదేవిటదేవిటోయ్? ఆ ప్రశ్నేవిటి? జాగ్రత్తగా మాట్లాడు. మేం పెదరాజులం. సూర్యవంశం మాది. వొటేలు సూర్రాజు, సుర్రబ్బండీ సుబ్బరాజు, కిళ్ళీబడ్డీ సెంపరాజూ వేరేరకం. వాళ్లు కూడా రాజులే గానీ మేం వేరు. మేం పెదరాజులం- వాళ్లంతా సంసారి రాజులు...."

"తప్పు కాయండి పెదరాజుగోరూ. రాజుల్దగ్గిర మెసిలోన్ని కాదు, సదుంకున్నోడ్నిగాదు. రాజులంతే అందరూ రాజులేననుకొన్నాను. సూరియ వొంశవేవో, సంసార్రాజులంతే ఏటో నాకు ఎరికనేదు" అన్నాడు అప్పలనాయుడు.

గోపాత్రుడికి కూడా కులాభిమానం పొంగింది. "మా పాత్రుళ్ల గొప్పదనం గురించి కూడా నీకేవీ తెలీనట్టుగా వుంది. రాజుల పద్ధతులే మాయీని. గిరజాలు, పగిడీలు, గుర్రపు బగ్గీలు, సవారీబళ్లు,

మీసాలు, పౌరుషాలు, మొఖాసాలు. రాజుల్లాగే మా కుటుంబాలు కూడా సప్పుబడి పోతన్నాయనుకో"

ఫకీర్రాజు పాత్రుడి వంశగౌరవం గూర్చి వినకుండానే తూర్పు వాకిలిలో నుంచి లోగిల్లోకి దూరిపోయాడు.

తూర్పు ద్వారంలోనుంచి ప్రవేశిస్తే పెద్దపెద్ద అరుగులున్న వాకిలి వుంది. ఆ వాకిటిలోనుంచి నాలుగిళ్ళ వాకిటకు ద్వారం వుంది. ఆ ద్వారం దాటిన వెంటనే పెద్ద గది వుంది. దాన్ని సావిడి గది



అంటారు. అందులో ఫకీర్రాజు కచేరీ చేస్తాడు. పెద్ద అద్దాల బీరువాలో ఔషధాలున్నాయి. గోడవారగ రెండు పెద్ద పెద్ద కల్వాలున్నాయి. ఓ రెండు క్రీ కుర్చీలూ, రెండు మడత కుర్చీలూ కూడా ఆ గదిలో వున్నాయి. ఓ మూల వేదెని మీద ఖాళీ పంజరాలున్నాయి. గదంతా ఔషధాల వాసనతో వుంది.

అప్పల నాయుడ్ని తూర్పు వాకిట్లోనే వదిలిపెట్టి గోపాత్రుడు ఆ గదిలో ప్రవేశించి ఔషధాల బీర్వాలో మందు

కోసం వెదుకుతున్న ఫకీర్రాజు పక్కకి చేరేడు. ఫకీర్రాజు ఓ అట్టపెట్టెలో ఎర్ర కాగితం చుట్టివున్న ఓ గోధుమ రంగు గుళిక తీశాడు.

"అదీ..." అన్నాడు చినపాత్రుడు.

"నువ్వు పదిహేనో పాతంలో వున్నావు. ఇది పద్దెనిమిదో పాతానికి సంబంధించిన ఔషధం...." అని ఫకీర్రాజు కఠినంగా చెప్పి తూర్పు వాకిట్లో చేతులు కట్టుకొని నిలబడిన అప్పలనాయుడి దగ్గరకొచ్చి–

"చూడవోయి.... ఈ గుళిక రెండు మోతాదులు. వెళ్లగానే జీలకర్ర రసంతో ఓ మోతాదిచ్చి, రాత్రి రెండోజాపు సమయంలో మరో మోతాదు వెయ్యి రేపు ఉదయం నేనే స్వయంగా వొచ్చి పేషెంట్ నిచూస్తాను"

"సితంబాబూ! రెండు మోతాదులు. ఎల్లగానే తొలి మోతాదు జీలకర్రరసంతో ఇవ్వాలి. రెండో జాపున రెండో మోతాదు. మొత్తం రెండు మోతాదులు. తొలి మోతాదు జీలకర్ర రసంలోటి. బాబయ్యా! మరి 'రెండో మోతాదో – అది దేనితోటి ఇవ్వాలో?"

"రెండో మోతాదు అదపంతో వెయ్యాలోయి..." అన్నాడు అప్పుడే అక్కడికి వచ్చిన గోపాత్రుడు.

"అనుపానం ఏదో తెలీకుండా అనుపానం ఏమిటో చెప్పవచ్చునటోయి గోపాత్రుడూ?" అని ప్రశ్నించాడు ఫకీర్రాజు.

గోపాత్రుడు నవ్వేడు — "లేకపోతే తొలిమోతాదుకొకటి అనుపానవు, రెండో మోతాదుకొకటి అనుపానవూ వుంటా యేటండి"

"సర్లే నాయుడూ! రెండు మోతాదులూ జీలకర్ర రసంతోనే ఇచ్చి. రేపొద్దున నేనొచ్చి మీయత్తని చూస్తాను"

"చితం కలగాద మొగదల్నేనండి. గొరిపోతోళ్ళ దొడ్డంతే ఎవ్వులన్నా చెపుతారు. కర్రప్పల్నాయుడంతారండి నన్ను మా వూర్లో. నాను పోతానండి రాజుగోరూ.. చెలవు"

"మంచిదోయ్ వెళ్ళిరా. పోతానన కూడదు. పోయివస్తాననాలి"

అప్పలనాయుడు వెళ్ళిపోయిన తరవాత–

"ఫకీరు బాబూ..ఆ ఔషధం పేరేటో చెప్పరా?" అని గోపాత్రుడడిగాడు.

ఫకీర్రాజు అంతకు ముందు విప్పేసిన చెడాపులు మళ్ళీ వేసుకుంటూ "నేను చెప్పనోయి. వైద్య విద్య అనేది అంచలంచలుగా నేర్వాలి" అన్నాడు.

"ఇప్పుడొకటీ, అప్పుడొకటీ చెపితె అంచలు మీద చెప్పటం కిందకి రాదేటండి? మా నాయిన మీకు ఎన్ని చిట్కాలో జెప్పేడని తవరే సానా సుట్లు నాలో అన్నారు. బాబ్బాబు చెప్పండురా" బతిమాలేడు పాత్రుడు.

తూర్పు గుమ్మం మెట్లు దిగుతూ ఫకీర్రాజు నిట్టూర్చాడు "నిజవేనోయి. మీ నాయిన ఎంత యోగ్యుడు! నాకెన్ని రహస్యాలు జెప్పేడు! అవన్నీ నీకు చెబుతాను. ఈ మందు మాత్రం నే చెప్పలేను. ఇది మా పెదబావగారిచ్చింది. దీని పేరు ఆయనకు కూడా తెలీదు. జబ్బేదిటో నాకు తెలీకపోతే ఈ ఔషధంవాడమని ఆయన సలహా జెప్పేడు. ఏదో దివ్యౌషధం"

"పోనీలెండి. బతిమాల్నా చెప్పడం లేదు"

"ఒద్దోయి నిజంగానే నాకుతెలీదు" ఫకీర్రాజు దివ్యౌషధం గురించి చెబు

 

తున్నపుడు గోపాత్రుడుకి తన ఇంటిలో వున్న ఒక ఇంజక్షన్ సీసా జ్ఞాపకం వచ్చింది.

"మా ఇంట్లోనూ ఒక దివ్యౌషధం వుందండోయ్. ఇంగ్లీషు మందనుకోండి" అన్నాడు పాత్రుడు.

"ఏం పేరో?"

"పేరు తెలీదండి"

ఫకీర్రాజు నవ్వేడు. మీసాలు సరిజేసుకుంటూ–"ఇంగ్లీషు వైద్యంలో దివ్యౌషధాలుండవోయి. వాళ్ళదంతా వెధవ వైద్యం"

"అలాగనీకండి.ఇంగ్లీషులోనూ కొన్ని మంచి మందులుంటాయి. ఎందుకూ మా ఇంట్లో మందు తెస్తాను చూద్దురుగాని" అన్నాడు చినపాత్రుడు.



కలగాడ ఊరు శివార్లు చేరుకునేసరికి మరునటిరోజు ఉదయం తొమ్మిదిన్నరయింది. పొలాలగట్లమ్మట, చెరువు కట్ట వెంబడీ గంటన్నర నడక.

ఊరి ముందు రెండు ఫర్లాంగుల దూరం గోర్జివుంది. వంకరటింకర గోర్జిలో గరుకు ఇసుకుంది. ఇటూ, అటూ తాటి చెట్లున్నాయి. బ్రహ్మజెముడు, నాగజెముడు డొంకలున్నాయి. పాసి, కానుగు, వేప, టేకుచెట్లు అక్కడక్కడావున్నాయి. వర్షం వచ్చినపుడు ఆ గోర్జిగుండా ఒక కొండ గెడ్డ పారుతుంది. గోర్జికి ఇటూ అటూ మెట్ట పొలాలున్నాయి. వాటిలో పచ్చపచ్చగా వేరుశనగ చేలున్నాయి.

ఒక మలుపు తిరుగుతూ ఫకీర్రాజు చటుక్కున ఆగిపోయాడు. గోపాత్రుడు కూడా ఆగిపోయి ఫకీర్రాజు వంక చూశాడు. ఆ మలుపులో నుంచి చూస్తే వూరినుంచి గోర్జివైపు నడుస్తూ ఒక వూరేగింపు కనిపించింది. ఏదో శవాన్ని వూరేగిస్తూ వస్తున్నట్టు కనిపిస్తోంది.

ఫకీర్రాజు గుండెలో గుబులయింది.

"ఏటండి ఫకీరు బాబూ..ఏటలాగ నిలబడిపోయారు?"

ఫకీర్రాజు మాట్లాడకుండా ఆ వూరేగింపు వైపు వేలు చూపించాడు.

"చూసేనండి. ఎవుడో సచ్చినట్టుంది. స్మసానానికి తీసికెల్తున్నారు"

"నాకేవిటో అనుమానంగా, భయంగా వుందోయి పాత్రుడూ! రాత్రి మనం ఔషధం ఇచ్చిన మనిషేనేవిటో?"

గోపాత్రుడు చిన్నగా నవ్వేడు. "మీ పెద బావాజీగారి దివ్యౌషధంమీద మీకంత నమ్మకంగుంటే మనం ఇక్కడింక నిలబడ్డం అనవసరంఅండి. ఇది మన దివ్యౌషధం దెబ్బేగాని అయితే మన ఆబోరు దక్కదు. మోటు మనుషులుగదండీ రాజుల మర్యాదలు తెలీవు. చేతికి ఏది దొరికితే దాన్తోనే కొడతారు" అన్నాడు పాత్రుడు వొచ్చిన దారినే తిరుగుతూ.

ఫకీర్రాజు ఏమీఅనలేదు. అక్కడే నిలబడి పంచె సర్దుకుని, మీసాలు సరిజేసుకున్నాడు. లేనిపోని భయాలతో వెనక్కి పారిపోవటానికి గానీ, దుస్సాహసంతో ముందుకు నడవటానికి గానీ అతనికి మనస్కరించలేదు.

"ఫకీరుబాబూ! ఔషధం ఎంత అద్భుతంగా పనిచేస్తుందో రుజువు అయిపో



యిందిగదా! ఇప్పుడయినా దానిపేరు చెప్పండి" అన్నాడు పాత్రుడు.

"ఇలా జరగటానికి వీలులేదోయి. ఇదివరకు ఒకటి రెండుసార్లు ఆ ఔషధం వాడానోయి, ఏమీకాలేదు. జబ్బు తగ్గలేదు, మనిషీ పోలేదు. అందువల్లనే ప్రమాద రహితమైన ఔషధమని దాన్ని ఇచ్చేను"

"ఇప్పుడీ కేసుతో ప్రమాదకరమైన ఔషధం అని తేలిపోయింది కదండీ! ఇక దాన్ని వాడొద్దు" అన్నాడు గోపాత్రుడు.

ఆ ఊరేగింపు వాళ్ళకు మరికాస్త దగ్గిరయింది.

ఫకీర్రాజుకు కంగారెక్కువయింది.

"ఏం చేద్దావోయి పాత్రుడూ?" అని అడిగాడు.

"పదండి అలమండపోదాం"

"ఒకవేళ ఆయొక్క మనిషి మన పేషెంట్ కాకపోతే నామోషీ కద టోయి".

"పదండయితే ఎదరకే వెళ్దాం. అంతా రేమోనని జంకుతున్నానుగానీ దివాణానికి లేని జెరుకు నాకేవిటి?"

"ఎదరకుగానీ వెళ్ళావనుకో – మన దురదృష్టవశాత్తూ నువు భయపడినంతా జరిగితే ఎంత నామోషీ, సిగ్గు సిగ్గోయి..."

ఆ ఊరేగింపులో ఎవరో పెద్దగా ఏడుస్తున్నట్టు వినిపిస్తోంది.

"ఏదైనా ఉపాయం చెప్పవోయ్" అనడిగాడు ఫకీర్రాజు.

"నాకు ఉపాయాలు జెప్పేపాటి తెలివి తేటలే వుంటే ఈ ఔషధాల గొడవలో ఎందుకుపడతానండీ"

"ఒకవేళ మనం నువ్వుజెప్పినట్లు పరిగెడితే మన వేషాలొకటి దొరికిపోతాయోయి. ఈ గ్లాస్కో కమీజు, పంచెకట్టు మైలుదూరం నుంచి మనం ఎవరవో తెలిసిపోతాయి. చెడ్డ చిక్కొచ్చిపడిందే" ఫకీర్రాజు చికాకు పడిపోయాడు.

ఊరేగింపు మరో మలుపు తిరిగి గోర్జిలో ప్రవేశించింది.

"ఫకీరుబాబూ! నా మాట వినండి. నేను ముందు పరిగెడతాను, మీరు నా వెనక పరిగెత్తండి. అరగంటలో ఆలమందలో వుంటాం. ఎందుకొచ్చిన సంత"

ఫకీర్రాజు అటూ ఇటూ చూసేడు.

"ఒక పన్జేద్దామోయ్! తాటి పెండి దాటేసి అవతలున్న పొలాల్లో దాగుందాం. గట్టొకటి ఎత్తుగా వుంది గనకా, కిత్తలనార మొక్కలు అడ్డుగా వున్నాయి గనకా మనం గోర్జిలో పోయేవాళ్ళకు కనిపించం. పైగా చాట్నుంచి మనపై పోయిన పని షెవరో తెలుసుకోవచ్చును"

"నాకిలాగ గట్లూ, గోతులూ దూకడం చాతకాదు ఫకీర్రాజుగారూ! పరువుగా, మర్యాదగా బతుకుతున్నవాణ్ని" అన్నాడు పాత్రుడు చిరాగ్గా.

"పరాయివాడెవడూ మనం జేస్తున్న పని చూడనంతవరకూ మన మర్యాదకు భంగమేవిటోయి. పదపద... గట్టెక్కడం బ్రహ్మవిద్యకాదు. తాటికమ్మ పట్టుకుని గట్టుమీద కాలువేసి ఒక్క ఎగురు ఎగిరే అవతలిపక్కకి పడిపోవచ్చును. పదపద" అని చెబుతూనే ఫకీర్రాజు ఒక్క వుదుట్న గట్టెక్కి తాటిచెట్ల మధ్యనుంచి దూరేసి అవతలి పక్కకి దూకేడు. పాత్రుడు కొంచెం శ్రమపడి ఫకీర్రాజు దూకిన చోటునుంచే అవతలివైపు దూకాడు. అప్పటికి ఫకీర్రాజు గట్టువెంబడివున్న లేత తాటిమొక్కల గుబురులో దూరేసి గోపాత్రుడి కంటికి కనిపించలేదు.

"బాబూ...ఫకీరుబాబూ...ఏవండోయి ఫకీర్రాజుగారూ... ఎటెళ్ళిపోయారండీ" అని అడిగాడు గోపాత్రుడు కంగారుగా.

"హుష్ నెమ్మది నెమ్మది. పీకలు తెగిపోతాయి" అన్నాడు ఫకీర్రాజు గాభరా పడిపోయి తాటి కమ్మల మధ్యనుంచి చేయి వూపుతూ.

గోపాత్రుడు బాగా వంగి పరిగెత్తి ఫకీర్రాజు పక్కకిచేరి మునగదీసుకొని ఆ తాటాకుల గుబురుల్లో కూచున్నాడు.

"గురువుగారూ! వైద్య విద్యలో ఇది ఎన్నో పాఠమండి... ఆఖరిదా?" అని పాత్రుడు ఫకీర్రాజు చెవిలో నోరుపెట్టి అడిగాడు.

ఫకీర్రాజు మోచేత్తో గోపాత్రుడి డొక్కలోపొడిచి "మాట్లాడకయ్యామహానుభావా" అన్నాడు.

అప్పటికి ఊరేగింపు గోర్జిలో మరో మలుపు తిరిగింది. కమ్మలు కాస్త తప్పించి చూస్తే ఊరేగింపులో ముందుగా కుండతో

నిప్పులు పట్టుకున్న మనిషి కనిపిస్తున్నాడు.

పాత్రుడి మోచేతులు మండుతుంటే చూసుకున్నాడు. ఏ కొక్కిరిమట్టలో, కంబంద ముళ్ళో తగిలి అతని చేతులు గీరుకుపోయాయి.

"సారాతోటే బతికాడు, సారాతోటే సచ్చినాడు. సితిమీద సారాకాయెట్టి తాగరా సింహాచలం అంటే నెగిసి, తాగేసి మరో సుట్టు సచ్చిపోతాడు" అని ఎవరో గట్టిగా అన్నారు.

పాడెమీద మనిషి ఫక్కీరాజు కంటికి కనిపించాడు. ఊపిరి బిగపట్టి చూస్తున్నవాడు హఠాత్తుగా తేలికపడ్డాడు.

పాడెమీదున్నది ఎవరో మీసాల ముసిలిమనిషి శవం.

"ఇది మనదెబ్బకాదోయి పాత్రుడూ! చచ్చినవాడు ఎవరో మగమనిషి... మన పేషంట్ కాదు" అన్నాడు ఫక్కీరాజు చాలా నెమ్మదిగా.

"మన పేషంట్ కాకపోయినా ఇంకోడి పేషంట్ అయివుంటాడులెండి. వైద్యుడి చేయూత లేకుండా గట్టెక్కిపోవటం కష్టంగదా" అన్నాడు పాత్రుడు.

ఫక్కీరాజు మాటాడలేదు. గొంతుక కూచునే అతను మీసాలు సర్దుకొన్నాడు. గోపాత్రుడికి నవ్వొచ్చింది- "ఎక్కడున్నా, ఏంచేస్తున్నా రాజుగారు రాజుగారే" అన్నాడు.

"ఒకచో నేలను బవ్వళించు అన్నాడోయి భర్తృహరి"

"ఇంక లేచిపోదావా?"

"తొందరపడకు.... తొందరపడకు. వాళ్ళిగోర్జి దాటిపోతే మంచిది.... మనమీ రీతిగా దాక్కున్నావని తెలిస్తే నగుబాటు"

కాసేపు తర్వాత- "సరె..లే లే.."

అంటూనే ఫక్కీరాజు లేచినిల్చున్నాడు. పంచె సరిగ్గా దోపుకొని, ఇటూ అటూ చూసి మళ్ళీ ఆ తాటిపెండిదాటి గోర్జిలో కొచ్చాడు.

వెనక పాత్రుడూ వచ్చాడు.

"గోపాత్రుడూ... పీకబోయినా ఈ సంగతి మరోప్రాణికి తెలికూడదు. తెలిసిందా?"

"చితం...తమకా బెంగ అక్కరలేదు! వైద్యుడనేవాడికి ఆపద ఎదురయితే ఎంత సమయస్ఫూర్తితో వ్యవహరించాలో మీరిపుడు నాకు ఆర్యాక్షంగా బోధ పరిచారు. ఏం శెలవు....?"

"యుక్తి, ఇంగితం వుంటే వైద్యం రాకపోయినా చెలామణీ అయిపోవచ్చోయి"

"చితం. ఆ ధయిర్యంతోనే మీదగ్గిర నేర్చుకుంటున్నాను"

"తొందరగా నడవోయ్. ఎండ ముదరకముందే తిరిగి మనూరు వెళ్ళిపోవాలి" అన్నాడు ఫక్కీరాజు దారితీస్తూ.

"తమరిచ్చిన మందు ఆ పేషంట్ వేసుకోలేదని నా అనుమానం" అన్నాడు గోపాత్రుడు ఫక్కీరాజు వెనుకనడుస్తూ.

"నీకా అనుమానం ఎందుకొచ్చిందోయి?"

"ఏంలేదండి. ఆ ఔషధం ఆ పేషంట్ వేసుకొంటుంటే ఇందాక మన అంచనా తప్పివుండేది కాదని నా అనుమానం"

"ఏ అంచనా సంగతి మాట్లాడుతున్నావు?" అన్నాడు ఫక్కీరాజు నడక ఆపి వెనక్కి తిరక్కుండానే.

"ఏంలేదండి. సరదాకన్నాను. పదండి పదండి...." అన్నాడు గోపాత్రుడు.

అప్పుడు వెనుదిరిగాడు ఫక్కీరాజు.

చూపుడువేలు రెండుమూడుసార్లు ఆడించి "జాగర్తోయి పాత్రుడూ...మంచోణ్ని కాను సుమా. ఆపోర దక్కదు" అని ఒక హెచ్చరిక చేశాడు.

"అదేమిటండి ఫకీరు బాబుగారు అలాగ వుడుక్కుంటున్నారు? దసు వున్నారని హాస్యమాడేనుగాని మీ మీద గౌరవం లేకా?"



"ఇదేం హాస్యమోయి. ఇదెక్కడి హాస్యం" అని గొణిగి మళ్ళీనడక మొదలు పెట్టేడు ఫక్రీరాజు.

పది అడుగులు వేసేవరకూ ఎవరూ మాట్లావలేదు. తరవాత గోపాత్రుడు గొంతుసర్దుకొన్నాడు "ఫకీరు బాబుగారూ! నీన్ను చెప్పిన ఇండీషను తెచ్చానండి. సిరంజీ, సూదీకూడా తెచ్చాను"

ఫక్రీరాజు మాట్లావలేదు.

"మన కలగాడ పేషంట్‌కి అది ఇద్దా వండి. ఇండీషన్ తవరే చేద్దురుగాని" అన్నాడు మళ్ళీ గోపాత్రుడే.

ఫకీర్రాజు మళ్ళీ నడకఆపి గోపాత్రుడి వేపుతిరిగి —"చూడు పాత్రుడూ! మా ఇంట్లోని దివ్యౌషధం ఇచ్చి అవస్థపడ్డాం. అది చాలదా ఎందుకొచ్చిన గొడవ? ఇండీషనొద్దు, గిండీషనొద్దు. మనకి తెలిసిన మందులేవో ఇద్దాం చాల్లెద్దూ...."

"తెలిసిన జబ్బు తగ్గటానికి తెలిసిన ఔషధాలిస్తామా లేదా? మరి అలాంటపుడు తెలీని జబ్బుకు తెలీని ఔషధం ఇవ్వాలాలేదా? తమరే కొంచెం ఆలోచించి చెప్పండి"

"ఒకవేళ బెడిసికొడితేనో?"

గోపాత్రుడు నవ్వేడు "ఫకీరు బాబూ! నేనంటన్నానని కోప్పడకండి గానీ ఆయుష్షు తీరిపోయినవాడికి మందిచ్చి మీరుగానీ, నేనుగానీ,మరో మహ వైద్యుడు గానీ బతికించగలమా? పోనీ ఆయుష్షున్నవాడిని మనం మన దివ్యౌషధాలతో ఏవైనా చెయ్యగలమా? శుద్ధ కల్ల. ఈ ఇండీషన్ మా నాయిన చాలా మందికి తరుచూ ఇవ్వడం నేను చూసేను. ఈయాళ ఇండీషన్ జేయించుకున్నవాళ్ళు మరుసటి రోజు కూడా వొచ్చేవారు. అంటే మందు డేంజరసు రకం కానట్టే గదండి. ఈ సుట్టు నా వైద్యం చెయ్యండి. మీ హస్తవాసి మంచిది కాబట్టి మీరే ఆ ఇంజిషన్ జెయ్యండి"

"నేనింతకు ముందు ఎన్నడూ ఇంజిషన్ ఇవ్వలేదోయి. అదేం బ్రహ్మవిద్య కాదని తెలుసుననుకో. ఏదీ ఆ మందు ఇలాగివ్వు చూస్తాను...."

పాత్రుడు అయిష్టంగానే లాల్చీ పక్కజేబులోంచి ఓ ఇంజక్షన్ సీసా తీసి ఫకీర్రాజుకి ఇచ్చాడు.

దానిమీద ఆ ఇంజక్షన్ పేరు ఎర్రటి అక్షరాల్తో ఇంగ్లీషులో రాసివుంది. కానీ ఫకీర్రాజుకు 'తెనుగు' తప్ప మరో భాష రాదు. అందువల్ల సీసా కంటి ముందు పెట్టి చూశాడు. లోపల కొంచెం తెల్లగా, పచ్చగా గుండగా కొంత ముద్దగా ఏదో వుంది.

"గోపాత్రుడూ!మందు బాగానే వుంది గానీ దీంట్లోకి నీరులాంటిది ఎక్కించి, గిలకొట్టి అప్పుడు గదా ఇంజిషన్ ఇవ్వాలి. డిస్టిలు వాటరు అంటారు దాన్ని. మరా నీరు లేదా?"

"ఎందుకండీ ? వేణ్ణీలు చల్లారబెట్టి కొట్టిపారీవచ్చును. మా నాయిన కని పెట్టాడండి ఆ సులువు. సిరింజీ, సూదీ పట్టుకొచ్చానండి. సీసా ఇలాగివ్వండి నా కాడ వుంచుతాను"

సీసా తీసుకొని జేబులో పెట్టుకొన్నాడు పాత్రుడు. నాలుగయిదు నిమిషాలు నడిచి వాళ్ళిద్దరూ కలగాడ గ్రామంలో కాలు పెట్టారు.

తోవకు ఎదురుగా సలభై ఇళ్ళ వరుస వుంది. తాటాకుతోనేసిన ఆ మట్టి ఇళ్ళన్నిటికీ ఒకటే వెన్నుకుప్ప వుంటుంది.

"బహుశా ఇదే గొర్రిపోతోళ్ళ దొడ్డి కావాలాండి" అన్నాడు గోపాత్రుడు పక్క జేబులో చెయ్యి పెట్టి ఇంజక్షన్ సీసాని తడుముతూ.

నెత్తిమీద గడ్డి బుంగతో ఒక వ్యక్తి ఊరికి వుత్తరపు దిక్కునుంచి నడిచివచ్చి, "దండాలండి రాజుగోరు! ఏటండి మావూరొచ్చినారు" అని పలకరిస్తూ ఆగేడు.

"మరీ గొరిపోతోళ్ళ అప్పల్నాయుడి ఇల్లెక్కడో చెప్పాలోయి" అని ఫకీర్రాజు అడిగాడు.

"ఎవుడండీ కర్రప్పల్నాయుగోడా? సీ..సెటకారినంజికొడుకు. ఆడిమాట నా





దగ్గర ఎత్తకండి రాజుగోరూ. ఆడార్నంజి కొడుకు. మొన్న సోవారం సంతనాడు ఆడికీ, నాకూ పెద్ద రాద్ధాంతవైపోనాది.దెప్ప నంజికొడుకు – సెప్పుచ్చుకు కొట్టిబోన్నూ. ఊరందరూ అడ్డీనారు. ఈపాలెప్పుడైన నోరు జారినాడంతే చఫా ఆడిపని... బీజాలు కొట్టేస్తాను" అని ఆ వ్యక్తి ఛాతీ విరిచి గర్జించాడు.

"వీడెవడోయి వొట్టి సోది మనిషి తగిలాడు" అని ఫక్కీరాజు గొణిగాడు.

"ఆ... ఆడారోడి ఇల్లెక్కడోయి నాయుడూ?" అని గోపాత్రుడు అడిగాడు. ఆ నాయుడు మళ్లీ పళ్ళన్నీ బైట పెట్టి అదుగోండి ఆ నాసలో అట్నుంచి ఎనిమిదో ఇల్లండి.కోలగూడున్న దిగదండి అదేనండి ఆ సంజికొడుకుఇల్లు. నాసుంచుకొన్న మనిసికి మరిగినాడండి. గుండెల్దీసిననంజి కొడుకు. నాసూరుకుంటానేటండి ... మిదతాడ్లోళ్ల మేనళ్ళున్న సలే..." అని కథ ప్రారంభించాడు నాయుడు.

ఫక్కీరాజు, గోపాత్రుడూ అది వినకుండా అక్కణ్నించి కదిలారు.

"బాబుగోరూ...." అని ఆ నాయుడు పిలిచాడు.

ఫక్కీరాజు వెనుదిరగలేదు కాని గోపాత్రుడు తిరిగి ఆగాడు.

"మాటండి... ఇసుంట రండి"

"ఏటయ్యా చంపుకుతింటున్నావు" అంటూనే పాత్రుడు ఆ నాయుడి దగ్గిరకు వెళ్లాడు.

"ఆ సంజికొడుకు దగ్గిరికి ఎల్తన్నారు గావాల.... మళ్ళీగాని సూకాలంపుత్తెనెత్తిట్టుకున్నట్టు తెల్సిందో పేణాలు తీసేస్తానని జెప్పండి. కాపునాయుడు సెప్పమన్నాడని సెప్పండి.మరేటిబయ్యాం నేదు. సంజికొడుకు పెళ్లాన్ని ఏలుకోనేదుగానీ ఈడికి నా ముంతగావాల్చొచ్చింది....నరికేస్తానని చెప్పండి బాబూ! బయ్యంనేదు" అన్నాడు కాపునాయుడు కోపంగా.

పాత్రుడు అతనికేసి రెప్పవాల్చకుండా చూసి, ఏమీ అనకుండా వెనుదిరిగి ఫకీరు రాజును కలిసాడు. ఇద్దరూ గొర్రిపోతు అప్పలనాయుడి ఇంటిచూరుముందు నిల్చున్నారు.

"పిలవోయి గోపాత్రుడూ..." అని బెత్తాయించాడు ఫక్కీరాజు.

"అప్పల్నాయుడూ... ఓయ్ కర్రెప్పలనాయుడూ...." అని పిలిచాడు గోపాత్రుడు.

"ఎవడ్రా అదీ.. అప్పలనాయుడు గోడు యింట్లోనేడు..." అని లోపలి నుంచి ఓ ముసలి మనిషి గొంతు వినిపించింది.

"అప్పలనాయుడి అత్త అయివుంటుంది.. కనుక్కో నాయుడెక్కడికెళ్లాడో"

"దండాలు బాబయ్యా... దండాలు" అని వెనుకనుంచి అప్పలనాయుడి గొంతు వినిపించింది.

ఫక్కీరాజూ, గోపాత్రుడూ వెనక్కి తిరిగారు– "బైటే వున్నావటోయ్! నీ కోసం లోపల వాకబుచేస్తున్నాం. వూ.... ఎలావుంది మీ అత్త" అని ఫక్కీరాజు అడిగాడు.

"సితం.. తవురొస్తానన్నారు గదా అని ఇంటికాడే వుండిపోనానండి. వుప్పుడిపుడే టీ నీళ్ళకని జంగపోడి కల్చుకెళ్లి వొత్తన్నానండి... ముసల్ది అలాగే వుండండి. పొద్దున సల్దిగెంజి మూసక్కా తాగింపండి. మిరపకాయ కాల్చుకుని సంజుకున్నాది. తవురిచ్చిన



దగ్గర ఎత్తకండి రాజుగోరూ. ఆడార్నంజి కొడుకు. మొన్న సోవారం సంతనాడు ఆడికీ, నాకూ పెద్ద రాద్ధాంతమైపోనాది. దెష్ట నంజికొడుకు – సెప్పుచ్చుకు కొట్టిబోన్ను. ఊరందరూ అడ్డినారు. ఈపాలెప్పు డెన నోరు జారినాడంతే చఫా ఆడిపని... బీజాలు కొట్టేస్తాను" అని ఆ వ్యక్తి ఛాతీ విరిచి గర్జించాడు.

"పీడెవడోయి వొట్టి సోది మనిషి తగిలాడు" అని ఫక్కీరాజు గొణిగాడు.

"ఆ... ఆడారోడి ఇల్లెక్కడోయి నాయుడూ?" అని గోపాత్రుడు అడిగాడు. ఆ నాయుడు మళ్లీ పళ్ళన్నీ బైట పెట్టి అదుగోండి ఆ వాసలో అట్నించి ఎనిమిదో ఇల్లండి. కోలగూడున్న దిగదండీ అదేనండీ ఆ సంజికొడుకుఇల్లు. నాసుంచుకొన్న మనిసికి మరిగినాడండి. గుండెల్దీసినసంజి కొడుకు. నాసూరుసుంటానేటండి ... మిడతాడోళ్ల మేనళ్ళున్నసలే..." అని కథ ప్రారంభించాడు నాయుడు.

ఫక్కీరాజు, గోపాత్రుడూ అది విన కుండా అక్కణ్నించి కదిలారు.

"బాబుగోరూ...." అని ఆ నాయుడు పిలిచాడు.

ఫక్కీరాజు వెనుదిరగలేదు కాని గోపాత్రుడు తిరిగి ఆగాడు.

"మాటండి... ఇసుంట రండి"

"ఏటయ్యా చంపుకుతింటన్నావు" అంటూనే పాత్రుడు ఆ నాయుడి దగ్గిరకు వెళ్లాడు.

"ఆ సంజికొడుకు దగ్గిరికి ఎల్తన్నారు గావాల.... మళ్లీగాని సూకాలమ్మ సెయ్యెట్టుకున్నట్టు తెల్సిందో పేణాలు తీసేసానని జెప్పండి. కారునాయుడు సెప్పమన్నాడని సెప్పండి. మరేటిబయ్యం నేదు. సంజికొడుకు పెళ్లాన్ని ఏలుకో నేడుగానీ ఈడికి నా ముంతగావాల్సొ చ్చింది.... నరికేస్తానని చెప్పండి బాబూ! బయ్యంనేదు" అన్నాడు కారునాయుడు కోపంగా.

పాత్రుడు అతనికేసి రెప్పవాల్చకుండా చూసి, ఏమీ అనకుండా వెనుదిరిగి ఫకీరు రాజును కలిసాడు. ఇద్దరూ గ్రొరిపోతు అప్పలనాయుడి ఇంటిచూరుముందు నిల్చున్నారు.

"పిలవోయ్యి గోపాత్రుడూ..." అని బెత్తాయించాడు ఫక్కీరాజు.

"అప్పల్నాయుడూ... ఓయ్ క్రరప్పలనాయుడూ...." అని పిలిచాడు గోపాత్రుడు.

"ఎవడ్రా అదీ.. అప్పలనాయుడు గోడు యింట్లోనేడు..." అని లోపలి నుంచి ఓ ముసలి మనిషి గొంతు విని పించింది.

"అప్పలనాయుడి అత్త అయివుం టుంది.. కనుక్కో నాయుడెక్కడి కెళ్లాడో"

"దండాలు బాబయ్యా... దండాలు" అని వెనుకనుంచి అప్పలనాయుడి గొంతు వినిపించింది.

ఫక్కీరాజూ, గోపాత్రుడూ వెనక్కి తిరిగారు– "బైపే వున్నావటోయ్! నీ కోసం లోపల వాకబుచేస్తున్నాం. పూ.... ఎలావుంది మీ అత్త" అని ఫక్కీరాజు అడిగాడు.

"సితం.. తప్పురాస్తాసన్నారు గదా అని ఇంటికాడే వుండిపోనాసండి. ఇప్పుడిపుడే టీ నీళ్ళకని జంగపోడి కల్చుకెళ్లి హొత్తన్నానండి... ముసల్ది అలాగే వుందండి. పొద్దున సల్దిగెంజి మాసక్కా తాగింపండి. మిరపకాయ కాల్చుకుని సంజుకున్నాది. తప్పురిచ్చిన

మందు మా యాడమనిషికి ఇచ్చేనండి. ఏసిందో లేదో కనుక్కోవాలండి. 'ఇదిగో.. సిన్నమ్మా.. సిన్నమ్మా వొకపాలిలాగరా.." అని వంగి కేకపెశాడు అప్పలనాయుడు గట్టిగా.

"ఓరొస్తున్నానుండ్రా! ఆ కేకలేటి.. ముసిల్దానికి గుండెదడొచ్చేస్తాది...." అంటూ కొప్పుముడి చూరుకు తగలకుండా బాగా వంగి బైటకు వచ్చింది అప్పలనాయుడి భార్య చిన్నమ్మ.

ఆమెకు ముప్పయి అయిదేళ్లుంటాయి. పచ్చగా ఆరోగ్యంగా కనిపిస్తోంది. ఆకుపచ్చరంగు నేతచీర కట్టింది. రవిక వేసుకోలేదుగానీ ఆరు గజాల చీర పైట భుజం చుట్టూ కప్పింది. నుదుట్న పచ్చ బొట్టుంది. దానిపై ఇంతకుంకుమ బొట్టు పెట్టింది. చేతులకీ, కాళ్ళకీ లావాటి కడియాలున్నాయి. చెవులకి పోగులున్నాయి. ముక్కున బంగారపు సత్తుంది. ఫకీర్రాజునీ, గోపాత్రుణ్నీ చూసి ఆవిడ తడబడి పైట సర్దుకుంది.

"రాజులొచ్చినారు మంచం వోల్చు. ముసిల్దానికి ఆ మందులేసినావా?"

"ఏసుకోనేదు. వెంతబెట్టి ఆ మందులు కొనుక్కొచ్చి నారో సెప్పకపోతే ఆ మందులు మింగనని బిగుసుకుని కూకుంది మాయమ్మ. 'ఓలమ్మ కొనుక్కురానేదే, అలమందరాజుగోరు ఉత్తినిచ్చినాడే' అని చెప్పితే నమ్మింది కాదు. బతిమాల్నాను, శోకాలెట్టినాను, కేకలేసినాను... దాని పట్టు దాందే... వొయిజ్జం జేసినందుకు రాసోడికి ఏటిస్తాన్నావో జెప్పితేగాని మందు మింగదట..."

"అదండి ఫకీరు బాబూగారూ... ముసిల్ది మన మందు వేసుకోలేదు. నేను అన్లేదూ" అన్నాడు పాత్రుడు.

"అదేవిటోయ్... అదేవిటోయ్? ఈ వాలకం ఏవిటోయ్ అప్పలనాయుడూ.. ఈ వరసేవిటోయ్..." అని ఫకీర్రాజు పేర్లాలుతీస్తూ ఆశ్చర్యంగా అడిగాడు.

అప్పలనాయుడు అరచేతితో నుదుట్న కొట్టుకుని—"ఏటంటే ఏటని చెప్పమంటారు మారాజుతండ్రీ..మాకరమ్మం" అన్నాడు.

"మంచవోలుస్తానుండండి..." అనేసి చిన్నమ్మ మళ్ళీ సునాయాసంగా వంగి చూరుదాటి ఇంట్లోకి వెళ్ళిపోయింది.

"మాయత్తకి నచ్చజెప్పటం నాతరం అవడంనేదండి...మా సెడ్డ తిక్కండి.. కన్నం కాణీ కరుసవకూడదు. జబ్బులన్నీ తగ్గిపోవాల. ఈ కలికాలంలో డబ్బులుచ్చుకోకుండా ఎవులండి మందులిచ్చేది. తవురు గోరంటే దర్మాత్ములుగాని.. డబ్బులుచ్చుకోకుండా మందులిచ్చేవోణ్ని పట్టుకురాడం నా తరవా బాబయ్యా..? మా మావ ఎన్ని పుర్రాకులు పడినాడో పడీపడీ దాటిపోనాడు. సుకపడిపోనాడు"

"యినిపిస్తన్నాయిరోరి యినిపిస్తున్నాయిరా అల్లుడోడ. నీ కూతలన్నీ సెక్కగా యినిపిస్తన్నాయి. యినివాసగాతకుడు మీ గొర్రెపోతోలి కాతంత యినివాత ఘాతుకులు.... అత్త నీ కంటికంత కటికిదానిలాగ కనిపిస్తన్నాదన్న మాట. నానెప్పుడైనా నిన్నంత కవుకులు బెట్టేసినాను. సెపుతున్నాను జేగర్తగా ఇనుకో. మనసులోబెట్టుకో! ఏటో అనుకుంటున్నావు గాని నానిప్పుడప్పుడే సావను..నువు దమ్మిడీ గానవు. పొలంపుట్రా అమ్మేసి వైద్యులకు బెట్టేస్తాను. బంగారప్పిసరమ్మేసి వూరిలోని కుక్కలకి బెట్టేస్తాను. అప్పుడు గాని సావను. అత్తంటే ఏటో అనుకొంటున్న

ట్టుంది. జేగర్త" అన్నది అప్పల్నాయుడి అత్త దేవుడమ్మ లోపల్నించి.

అప్పలనాయుడు మరోసారి నెత్తికొట్టుకున్నాడు గానీ ఏమీ అనలేదు. ఫకీర్రాజు నిటారుగా నిలబడి మీసాలు సర్దుకున్నాడు.

గోపాత్రుడికి మాత్రం ముసిలావిడను చూడాలనిపించింది. వంగి, మోకాళ్ళమీద చేతులు ఆన్చి, కాళ్లు కూడా కొద్దిగా వంచి చూరు లోపలికి చూశాడతను.

అతడి కళ్లు తీక్షణంగా చూస్తున్న దేవుడమ్మ కళ్ళతో కలిశాయి.

"ఎవురా దొంగ మెకవోడు?" అని ముసలామె కఠినంగా ప్రశ్నించింది.

గతుక్కుమన్న గోపాత్రుడు ఠక్కుమని నిటారుగా నిల్చుండిపోయాడు.

అదే సమయానికి అప్పలనాయుడి భార్య లోపల మంచం వాల్చి, దానిపై బొంత కప్పి "రండి మారాజా. నోపలి కొచ్చి కూకుడొండి..." అని పిలిచింది.

అప్పలనాయుడు, ఆ వెనుక ఫకీర్రాజు ముంజూరు దగ్గిర వొంగి లోపలికివెళ్ళేరు. గోపాత్రుడు పెనుసందేహంలో పడిపోయాడు.

'ముసిల్ది మా కాన్దాని లాగుంది. మొగంమీద పేడనీళ్లు జల్లినట్లు మాట్లాడుతున్నాది. మనం లోపలికెల్తే ఇంకా ఏటంటాదో! తంటా వొచ్చిపడింది' అనుకుని అక్కడే నిలబడ్డాడు పాత్రుడు.

"బైటే నిలబడి పోయావేమోయ్. లోపలికి రా" అని ఫకీర్రాజు పిలిచాడు.

"రండి బాబూ...రండి" అని అప్పలనాయుడు కూడా పిలిచేడు.

తప్పుతాదా-అనుకుంటూ గోపాత్రుడు అవసరమైనదానికంటె బాగా వొంగి, చూరులోంచి దూరి, పేడతో అలికి ముగ్గు వేసిన గచ్చునే చూస్తూ ఫకీర్రాజు పక్కనే కూచున్నాడు. కూచున్న తరువాత గుండెలు ఒితుకుఒితుకుమంటుండగా ఓరకంట ముసిలావిడకేసి చూశాడు.

"ఈ దొంగమొగవోడెవుడని అడుగుతున్నాను" అప్పటికి దేవుడమ్మ నులక మంచం మీద కూచునుంది.

గోపాత్రుడు చూపుడువేలు ఫకీర్రాజు వేపు చూపించి "ఈయనా.. ఈయన ఫకీర్రాజుగారు. అలమండరాజుగారు" అన్నాడు.

"ఎవుల్నోలమ్మ నువు దొంగమొకవోడంతన్నావు" అని చిన్నమ్మ ఆశ్చర్యంగా అడిగింది.

దేవుడమ్మ తాపీగా వేలు గోపాత్రుడికేసి చూపించి - "నిన్నే అడుగుతున్నాన్రా అల్లుడోడా! ఈదొంగమొకవోడెవురు" అని అడిగింది.

"చిత్తగించేరా ఫకీరుబాబుగారూ..? ఇది కూడా బబ్బు లక్షణవే...." అని గోపాత్రుడు అంటుండగానే అల్లుడు అత్తగారి మీద కయ్యమని లేచాడు.

"నోరు మూసుకో.. ఎవుళ్ళనుకొంతన్నావు. కలగాడ నాయుళ్ళకాడా, నాకాడా పేలినట్టు పేల్తే దవడపళ్లన్నీ రాలిపోగలవు. ఈయన ఫకీరుబాబుగోరు. అలమండరాజుగోరు. ఈయనగోరు గోపాత్రుడు...నీకు మందిచ్చి నిను కాపాడ్డానికి వొచ్చినారు"

చిన్నమ్మ పాత్రుడివైపు తిరిగి "ఏటనుకోకండిబాబయ్యా....ముసిల్దిజబ్బు సేత మతి సెడి పేలింది కానీ మాయమ్మ శానా మంచిది. తవురేటీ అనుకోకండి" అని బతిమాలింది.

దేవుడమ్మ ఏమాత్రం తొట్రుపాటు లేకుండా కూచుంది. ఆవిడకు అరవై




ఆరేళ్ళు. తెల్లటి మనిషి. మొహం నిండా ముడతలున్నాయి. జుత్తు పల్చబడి అక్కడక్కడ నెరిసింది. నుదుట చుట్టతో కాల్చిన మచ్చ వుంది. చెవులకు పోగులున్నాయి. ముక్కున నత్తు వుండవలసిన చోట పొగాకు కాడ దూర్చింది. చిన్న కళ్ళు తీక్షణంగా వున్నాయి. నీలపు రంగు 'అంచున్న తెల్లని నేత చీర కట్టింది. మెడలో పగడాల దండుంది. చేతికి వెండి కడియాలున్నాయి. భుజాల దగ్గర్నించి చేతి మండవరకూ రెండు చేతులపైనా చిక్కగా పొడిచిన పచ్చబొట్టులో పాములున్నాయి. పాదాలు పగుళ్ళు ఇచ్చి, మురికిదేరి వున్నాయి.

కూతురు గోపాత్రుడ్ని బతిమాలటం గమనించి "నానేవి తప్పుడు మాటన్నేదు. మతి నీకు సెడింది, నీ మొగుడికి సెడింది. వున్న మాటన్నాను. ఆ సూపులు జూడు. దొంగ సూపులోణ్ని దొంగ మొకవో డండం తప్పేటి" అన్నది.

"కొంచెం సరింగ మాటాడితే నీ సొమ్మేటి పోతాదోలమ్మ" అని కూతురు తల్లికి బోధజేసింది.

"ఈళ్ళిద్దరి వాలకం జూస్తుంటే నాకాడ ఏదో బంగారం మూటుంది, వొట్టికెళ్ళి పంచీసుకుందామని కూడబలుక్కుని వొచ్చినట్టుంది. ముందేజెపుతున్నాను. నాకు మందిచ్చినా, అదుకిచ్చినా వొక్క దమ్మిడీ ఇవ్వను" అనిదేవుడమ్మ స్పష్టంగా చెప్పింది.

ముసిలావిడ వాలకం చూసి ఫక్కీరాజుకు ముందు కొంచెం కోపం వచ్చినా ఆవిడ కరకుతనం, మొండితనం, జాగ్రత్త చూసి అతనికి నవ్వొచ్చింది. అప్పల నాయుడి వంక తిరిగి-

"మీయత్త జగమొండిలాగుందోయి. జాగర్త మనిషిలాగుంది. ముక్కున మొగమాటం లేనట్టుంది. ఢిల్లీ తీసుకెళ్ళి నెహ్రూగార్ని కొంచెం సేపు పక్కన కూచోమని మీయత్తని దర్బార్లో సింహాసనంమీద కూచోబెడితే ఏలేస్తుందోయి. జంకదు. డబ్బులకోసం మేంవైద్యం చేయనంలేదనీ, మేం రాజులమనీ, మాకు మర్యాద ముఖ్యమనీ మీయత్తకి చెప్పు" అన్నాడు ఫక్కీరాజు.

దేవుడమ్మ అసమ్మతి సూచకంగా తల తీడుగా వూపింది "నాను పీకబోయినా రాసోడనీ వోడ్ని నమ్మను... దొంగకళ్ళు ఉన్నోడ్నీ నమ్మను"

ఫక్కీరాజుకి కోపమొచ్చింది. "అప్పను. రాసోడిమీద నమ్మకం పోబట్టే మూడు రూపాయలమ్మె బియ్యంబస్తా ఇవ్వాళింత అయింది. రాసోడిమీద నమ్మకంపోబట్టే నెలమూడు వానలుపడే చోటివ్వాళ ఆకాశం కేసి నోరెళ్ళబెట్టి చూడవలసివస్తుంది..."

"రాజులు సెడిపోతున్నారుగాని ఊర్లు సెడిపోవడంలేదు"

"ఇదంతా జబ్బు లక్షణవేనండి.... నేన్తెచ్చిన ఔషధం ఇద్దావండి" అన్నాడు పాత్రుడు.

"మొదట్నించి ముసల్దాని వోలకవే అంతండి"

ఫక్కీరాజు లేచి నిలబడ్డాడు "నేను ఈవిడకి వైద్యంచెయ్యనోయి. వైద్యుడి మీద విశ్వాసంలేదు. క్షత్రియుడి మీద గౌరవంలేదు" అన్నాడు.

"బాబ్బాబు....కోపమైపోకండి. రాజుల కాడ ఎలాగ మసులుకోవాలో దానికి తెలీదండి. నానూ ఎరగను. సత్తికాలపు మనిసండి. కడుపులోవున్నది పైకి కక్కీనీ రకవండి. మాయమ్మ మంచిదేనండి. తప్పు కాయండి" అని చిన్నమ్మ ఫక్కీరాజుచేతులు

పట్టుకుని అర్థించింది.

"అవునండి. కలగాడ్లో రాజుల్లేరండి. అంచేత ఆ మనిషికి మన మర్యాదలుతెలీక పోవచ్చండి. అదే మనూరిలో అయితే కడుపులో ఎంతున్నా పైకి సిత్తంబత్తెం అంటారు కదండీ. ఆ మర్యాదలు ఈ వూరిలో తెలీకపోవచ్చండి" అని పాత్రుడు కూడా అన్నాడు.

"వోలత్తా ... ఇదే ఆకరిసుట్టు సెపుతున్నాను. నీకు జబ్బుతగ్గాలంటే నోరు మూసుకోసుండు. నీకాడ డబ్బులొట్టుకు పోవాలనా రాజుగోరు ఇక్కడికొచ్చినారు? నేన్నిన్న ఆ రాజుగోరి నోగిటికిఎల్లినాను. ఓలమ్మ ఎంతనోగిలి....! ప్రహరీగోడ లోపలే నాలుగ్గరిసెలు గింజలు పండించుకోవచ్చు. మన పొలంపుట్రా అంతా కలిపి రాజుగోరి పెరడంతనేవు. అంత మారాజు మన డబ్బులకు ఆశపడతారా? కుసింత ఆలోసిసుండాలి మనిసికి. ఇంగితం వుండాలి. ఆలు మనింటికి రాడవేసాలు" అని అప్పలనాయుడు అత్తకి చెప్పేడు.



దేవుడమ్మ అంతావిని ఏమీ మాట్లాడకుండా వూరుకొంది. "తప్పుడు కూకొండి బాబూ. తప్పు కాయండి"

"సర్లే ... నాకందుకు కోపంరాలేదు. నా వైద్యానికి, నా మంచితనానికి విలువెవరు కట్టగల్రు? తాళ్ళపాలెం మొఖసామారి హరించుకుపోయింది. అలమండ కాకర్లపూడివారిది. ఇరవైఒక్క గ్రామాల మొఖసా...ఏవీ అవన్నీ? ఏవైపోయాయి? పోయినందుకు చింతలేదు. దైవఘటన అలాగుంది. అంతలేసి మొఖసాలు మేం నాశనం చేసుకుని మీయత్త దాసుకున్న ముష్టి బేడా పరకకోసం ఇంతదూరం వొస్తామా? తప్పుడు మాటలు. తప్పుతప్పు" అన్నాడు ఫక్కీరాజు తిరిగి కూచుంటూ.

"తప్పయిపోనాది...తప్పయిపోనాది" అంది చిన్నమ్మ సంగిరిగా. ఫక్కీరాజు గోపాత్రుడికేసి చూసి "పాత్రుడూ! ముసిల్దాని నాడి నిదానించవోయి" అన్నాడు.

'దూరంనుంచి తిట్టిన మనిషి దగ్గరకెళ్తే కరిచినా కరవొచ్చు. ఎవడు చూడొచ్చాడు' అనుకున్న పాత్రుడు తల అడ్డంగా వూపాడు. "నాడినిదానించడం అనవసరం అండి. మా ఇంటిదగ్గర్నుంచి తెచ్చిన ఇంజెక్షన్ చేసెయ్యండి" అన్నాడు.

"ఇంజెక్సనా..." అని అనుమానంగా చూసింది దేవుడమ్మ. ఒక్క క్షణంఆగి "ఎన్ని జేసినా నాను పండెడికూడా ఇచ్చుకోలేను" అన్నది.

"నువ్వు నోరు మూసుకుంటావా, నన్ను కొంపనుంచి పొమ్మంటావా?" అని చాలా కోపంగానూ, విసుగ్గానూ, గట్టిగానూ తల్లినిఅడిగింది చిన్నమ్మ.

ఫక్కీరాజు లేచి వెళ్ళి దేవుడమ్మ నాడి పట్టుకొనిచూశాడు. తరువాత ఆమెచేతిని వొదిలి "నాయుడూ వేణ్ణీళ్లుకావాలోయి" అన్నాడు.

"పొయిమీదున్నాయి ఉడుకునీళ్లు" అన్నది దేవుడమ్మ.

"గళాసులోకి తీసి వొట్టుకురమ్మని చెలవా?" అని చిన్నమ్మ ఫక్కీరాజుని అడిగింది.

"వెడల్పున్న మూసీవెండి తపాలా గానీ, వెండిగిన్నె కానీ ఉంటే మంచిది" అన్నాడు ఫక్కీరాజు.

"గళాస్తోతెచ్చినా సరిపోతాది" అన్నాడు పాత్రుడు జేబులోనుంచి సిరంజి వున్న ఇత్తడిపెట్టె, ఇంజక్షన్‌సీసా తీసి ఫకీర్‌రాజుకి అందిస్తూ.

ఫక్కీరాజు ఆ పెట్టె తెరిచి సిరంజీ, సూదీ చేతోతీసి పెట్టెను మంచం పందిమీద పెట్టేడు. సూదితగిలించి సిరంజ్‌లో ఉండే పిష్టన్ని ఇటూ అటూ కదిల్చాడు.

"సుబ్బరంగా వేణ్ణీళ్లో మరగబెట్టి మరీ తెచ్చానండి" అన్నాడు గోపాత్రుడు.

ఈ లోపున చిన్నమ్మ కంచుగ్లాసులో వేణ్ణీళ్లుపోసి, ఓ మసిపాతతో గ్లాసుపట్టుకుని తెచ్చింది. ఫక్కీరాజు సిరెంజీ, సూది మళ్ళీ పెట్టెలో పెట్టి ఇంజక్షన్‌సీసా అందుకుని చూశాడు. తరువాత దాన్ని కిందబెట్టి సిరెంజ్ తీసుకొని దానిలోకి వేణ్ణీళ్లు తీసి, ఎడంచేతితో మందుసీసా అందుకుని దానికున్న రబ్బరుమూతగుండా సిరెంజ్ నీడిల్ గుచ్చి కొంచెం వేణ్నీళ్లు సీసాలోకిఇంజక్టు చేసి, సిరెంజ్ కిందపెట్టి సీసాను బాగా గిలకొట్టాడు.

పాత్రుడు జేబులోనుంచి కొంచెందూది తీసిఇచ్చాడు. ఫక్కీరాజు ఆ దూది తడిపాడు. తొలిసారిగా ఇంగ్లీషువైద్యం చేస్తున్నాను. ఈ ఇంజెక్షన్‌గానీ గుణంఇస్తే ఓ వంద సూదులూ, పాతిక సిరంజీలు కొనేస్తాను. తెనుగువైద్యం, యునానీ వైద్యం,

 

ఇంగ్లీషు వైద్యం... తుని వెళ్ళి ఓ పక్షం రోజులు ఉంటే బుల్లిబాబుగారి దగ్గర ఉమాపతి నేర్చుకోవచ్చు. అప్పుడు ఓహో ఫకీర్రాజూ...నీవల్ల ఉప్పులపాటి వంశాం భోది పులకించపోతుందోయి.

ఓ చేతితో సిరెంజీ, మరోచేత్తో సీసా పట్టుకుని సిరెంజ్‌లోకి కొంచెం మందు తీసి, మందుసీసా కిందబెట్టి తడిదూది అందుకుని దేవుడమ్మ దగ్గరకెళ్ళి నిల్చు న్నాడు. "దండకి ఇండిషన్ ఇవ్వాలి. సెంగు చేతి మీదనుంచి తప్పించి భుజం మీద వేసుకో"

ముసలామె అలాగే చేసింది. ఫకీ ర్రాజు తడి దూదితో ఆవిడ భుజంమీద ఇంజక్షన్ ఇవ్వడానికి ప్రథం చేస్తుంటే కళ్ళు గట్టిగా మూసేసుకొంది.

ఫకీర్రాజు ముసలామె దండను తుడి చిన దూదికేసి చూశాడు. అది నల్లగా మురికిగా అయిపోయింది "తాన్నంచేసి ఎన్నాళ్ళయిందమ్మా?" అని నెమ్మదిగా అడిగాడు.

"మాయమ్మ తాన్నం జెయ్యదండి. తాన్నం జేస్తే సచ్చిపోతానని మాయమ్మకి బయ్యెమండి. నాకు యాదస్తొచ్చినాక మాయమ్మ తాన్నం చెయ్యలేదండి బాబు. ఓ సుట్టు నీళ్ళట్టుకు రాడానికి కోనేటికెళ్ళి కాల్జారి కడవతో పాటు నీట్లో పడిపోనా దండి. అదేనండి నాకు తెలిసి మాయమ్మ తాన్నం జెయిడం" అని చిన్నమ్మ నవ్వుతూనే చెప్పింది.

దేవుడమ్మ సూదినొప్పిని తట్టుకో వడం కోసం వూపిరి బిగబట్టింది. పళ్ళు కరిచి పట్టుకుంది. మనిషంతా బిగుసుకు పోయింది.

"రోజుకి రెండు సార్లు సున్ను పిండితో వొళ్ళు రుద్దించుకొని వేగ్నట స్నానం చేస్తేగాని నాకు జీవంతో వున్న ట్టుండదు. మీయత్త ఎలాగుంటుందో ఏటోగాని సగం రోగాలన్నీ అందు గురించే వొచ్చుంటాయోయి" అని మాటాడుతునే ఫకీర్రాజు దేవుడమ్మకు ఇంజక్షన్ ఇచ్చాడు.

అతను సిరెంజిలోని మందంతా ఎక్కించేసి,సూది తీసేసింతరువాత "తేలు కుట్టినట్టుందోలమ్మి" అని దేవుడమ్మ కూతురితో చెప్పింది. ఫకీర్రాజు వెనక్కి తిరిగాడు.

"ఆ–ఆ–ఆ–ఆ" అంటూ అరిచి దేవు డమ్మ ఒక్కసారిలేచి మంచంమీద అడ్డంగా విరుచుకు పడిపోయింది.




"శెభాషోయి శెభాషు! తక్కువని గుణం జూపించింది" అని కేకవేశాడు ఫకీర్రాజు.

గోపాత్రుడు మాత్రం బిగుసుకు పోయాడు.

అప్పలనాయుడు ఏమీ తోచక అలాగే నిల్చుండిపోయాడు.

చిన్నమ్మ మాత్రం 'వోలమ్మో' అని ఓ పెద్దకేకవేసి మంచంమీద అడ్డంగా పడిపోయివున్న తల్లిమీద పడిపోయింది.

"ఓలమ్మోలమ్మ... రాసోడు మా యమ్మని సంపేసినాడర్రోయ్. ఒరే, ఓరి గారిపోతోళ్ళ నంజికొడకా–నువ్వే ఆడిచేత

ఇంతపని జేయించినావురోయ్. ఆస్తికోసం మాయమ్మనినీఏదానబెట్టుకొన్నావురోయ్" అని చిన్నమ్మ గావుకేకలతో, ఏడుపుతో ఇల్లు అదరగొట్టింది.

సమయానికి యుక్తిగా ఆమాటేదో అన్నాడు గానీ ఫకీర్రాజుకి ప్రాణాలు కడగట్టి పోయాయి. దేవుడమ్మ కేకవేస్తూ విరుచుకు పడిపోయినపుడే అతను మన సొదిలీసేడు. 'ఎంతపని జేసావయ్యా పాత్రుడూ. నాచేత ఖూనీ జేయించేవు గదయ్యా' అనుకొన్నాడతను. ముసిలమ్మ 'కేసి భయంభయంగా చూసేడు.

గోపాత్రుడు మంచం మీద నుంచి లేచి నిల్చున్నాడు. చూస్తుండగానే ఒక ఖూనీ జరిగిపోయిందని అతను నిర్ణయించుకొన్నాడు. యవ్వారం ముదిరిపోక ముందే ఇక్కడ్నించి దాటీయాలి. ఫకీర్రాజెలాగా బొక్కలోకి బోతాడు. మన పన్నా బైటుంటే క్యారేజీ పట్టికెళ్ళొచ్చు- అనుకొన్నాడతను.

"ఓలమ్మో ఓలమ్మో" అని చిన్నమ్మ ఏడుస్తూనే వుంది.

అప్పలనాయుడు ఫకీర్రాజునీ, గోపాత్రుడ్నీ, చిన్నమ్మనీ చూసేడు. మంచం మీద అడ్డంగా చలనం లేకుండా పడున్న అత్తను చూసేడు.

ముసిల్దిగాని కునికిసిందేవో – అనే అనుమానం కలిగిందతనికి. గబగబావెళ్ళి మంచం దండె మీద నుంచి వేలాడుతున్న దేవుడమ్మ చెయ్యిబట్టుకొని ఆత్రంగా చూసేడు.

నాడి కొట్టుకుంటూనే వుంది.

దేవుడమ్మ చేతిని వొదిలీసేడు.

చిన్నమ్మ ఏడుస్తోంది.

అప్పలనాయుడు భార్య కొప్పుబట్టి కొని "నెగు...నంజిముండనెగు. నిన్నూ' నీయమ్మనీ ఎవుడు తగులుకుపోనేదు నెగు. ఏడుపుగాని ఇనిపించిందంతే పీక సులివేస్తాను. వొయిద్యం జరిగే కాడికి ఆడనంజిల్ని రానీకూడదదంతారు ఇందికే" అని హెచ్చరించాడు.

చిన్నమ్మ కిక్కురుమనకుండా ఏడుపు ఆపేసి తల్లి మంచం పక్కన కాళ్లురెండూ బారచాపి కూచుండిపోయింది.

"రాజుగారూ! నాకు కొంచెం అర్జెంటు పనుందండి నేను బయల్దేరుతాను. తమరీ చికిత్స పూర్తి చేసుకొని తాపీగా రండి" అన్నాడు గోపాత్రుడు ఫకీర్రాజ నెమ్మదిగా.

ఫకీర్రాజు పాత్రుడి దండపట్టుకొని దగ్గిరగా లాగి, వేళ్లు పట్టుబిగించి "ముంజూరు దాటి బైటకు కదిలావంటే గుండేసి కొట్టేస్తాను ఖబడ్దార్! వీడెవడనుకున్నావు? సన్నాసిరాజుకాదు. వీడు ఫకీర్ రాజు" అని చాలా తీవ్రంగా హెచ్చరించాడు.

గోపాత్రుడు మొహం గంటు పెట్టుకున్నాడు. "ఇందులో నా బాధ్యతేదీలేదు. నేనిచ్చిన మందు మంచిదే. బంగారం లాంటిది. మీకే చాతావాత కాకపోయినా తయారయిపోయి ఇండీషనిచ్చారు. ఆ మందు ఏ నరంలోకో ఎక్కించీసుంటారు. ఖూనీ కేసయితే కోర్టుకొచ్చి ఈ ముక్కే సాచ్చికంలో సెప్తాను" అన్నాడతను కూడా కోపంగా.

అప్పలనాయుడు అనుమానంగా చూసి – "ఏటండిద్దరు గుసగుసలాడుకుంతన్నారు?" అని భయంగా అడిగాడు.

గోపాత్రుడు ఎందుకైనా మంచిదని ముసిల్దాని నాడి పట్టుకు చూసి పెదవి విరిచాడు. తరువాత ఆవిడ భుజాలు పట్టుకుని బలంగా ఎత్తి నులక మంచంమీద





సరిగా పడుకోబెట్టాడు.

ఇదంతా గమనించిన చిన్నమ్మ గుండెలు జారిపోయాయి. 'ఓలమ్మో'ని ఓ కేక వేసి జుత్తు పీక్కుంటూ తల్లి మీదపడి ఏడుపు మొదలుబెట్టింది. ఆ ఏడుపు కొంతసేపువచనంలాసాగిచివరకు రాగయుక్తంగా ప్రవహించటం మొదలు బెట్టింది.

"ఎంతపనెంతపనిజేసినావే ఓయమ్మా!
నన్నింత అద్దోసం జేసినావే ఓలమ్మా!
నన్నెంత అన్నేయం జేసినావే
ఓలమ్మా!
నన్ని అడివి నొగ్గిసినావే మాయమ్మా!
మాటైనా జెప్పలేదే మాయమ్మా!
నాకింక దిక్కెవర్రోయ్ బగమంతుడా!
నాకింక తోడెవ్వర్రోయ్ బగమంతుడా!
నానింకా నీళ్ళోసుకోనేదని ఏడిసీదానివే
మాయమ్మ దేవుడమ్మా!
నాను అంబలి తాక్కపోయినా ఏడిసీ
దానివే అమ్మా దేవుడమ్మా!
నీయల్లుడు దెచ్చిన దర్మారం కోక
కట్టకుంతానే పోనావేటే అమ్మ!
మరింక నీయల్లుడికి పుట్టకొక్కుల
కూరెవులొండుతారే అమ్మ మాయమ్మా!
ఓయమ్మా మాయమ్మా...అమ్మ
మాయమ్మ దేవుడమ్మా నాకింక
దిక్కెవరే"

అంతవరకూ ముసిలావిడ నాడి చూడటంకూడా మరిచిపోయిన ఫక్కీరాజు టుటుట చెమటబట్టింది.

నెమ్మదిగావెళ్ళి ముసలావిడ నాడి చూశాడు.

బతికేవుంది.

కానీ ఏదోతేడాగా వుంది.

ఏం చెయ్యటం?

ఏది దారి?

చేతులమీదుగా ఒక ప్రాణి దాటి పోకుండా చూడలేమా?

ఓరి దేవుడ!

ఓరి దేవుడ...అని మధనపడిపోతున్న ఫక్కీరాజుకి చటుక్కున తన రొండిన సదా మూటకట్టివుండే కలికం కుప్పె జ్ఞాపకం వచ్చింది.

శోకాలెడుతున్న చిన్నమ్మని ఒక్క కసురు కసిరాడు.

"నోరు ముయ్...ముయ్‌నోరు. మీ అమ్మకేమీ ప్రమాదంలేదు. లేచి బైటకెళ్లు. అప్పలనాయుడూ-నేను వైద్యం చేయాలా అక్కరలేదా? ఏవిటీ సంతగోలేమిటి? శోకాలేమిటి?" అని గట్టిగా కేకలేస్తూనే రొంటినవున్న కలికం తీశాడు ఫక్కీరాజు.

తరువాత అటూఇటూ చూసి చూరు కింద వున్న సన్నికల్లును గమనించి మంచం దగ్గిర నున్న గ్లాసు తీసుకెళ్ళి సన్నికల్లు ఓ మూలకడిగి గబగబ కలికం అరగదీసి చూపుడువేలుతో ఆ అరిగిన కలికపుగంధాన్ని తీసి దేవుడమ్మ కనురెప్పలు ఎడమచేతితో తెరిచి చక చకమని ఓ కలికం వేశాడు.

ఈలోపున చిన్నమ్మ ఏడుపువిని ఇరుగు పొరుగువాళ్ళంతా అప్పలనాయుడి ఇంటిముందు చేరారు.

దేవుడమ్మలో చలనంలేదు.

ఊపిరి చాలా స్వల్పంగా పీల్చివదులు తున్నది.

ఫక్కీరాజులో కంగారు ఎక్కువయింది. ముడుకులమీద చేతులు ఆన్చి వంగి దేవు డమ్మ మొఖంలోకి చూశాడు.

మూసివున్న ఆమె కళ్ళనుంచి నీరు కారటం మొదలయింది. బయట ఎక్కడో కారు హారన్ వినిపించింది.

'ఏటోలమ్మ దేవుడమ్మ అలాగయి



చదువరి ... 46

అదృష్టవశాత్తు తునినుంచి మా బావ కారొచ్చింది" అని చెప్పాడు ఫక్కీరాజు.

అప్పలనాయుడికి భయమేసింది "ఏటండి రాజుగోరూ ఏటండిదీ ? తవురు మందిచ్చేదాకా ముసిల్ది నిమ్మళంగానే వుంది. ఇప్పుడేటండి ఇజీనారం బైలెల్లమంతన్నారు"

ఫక్కీరాజు అప్పలనాయుడి భుజం మీద చేయివేసి గట్టిగా నొక్కాడు "మీ అత్తకొచ్చిన ప్రమాదం ఏమీ లేదోయ్. ఇంగ్లీషు వైద్యం చేసేం కదా - ఒక్కొక్కపుడది మన ప్రాంతంవారికి పడదు. వికటించే ప్రమాదం కద్దు. కారుందిగదా- నాకు తెలిసిన వొక పెద్ద డాక్టరున్నాడు. కాణీ పుచ్చుకోకుండా వైద్యం చేసి పెడతాడు. మనం మీయత్తని విజయనగరం తీసుకెళ్ళకుండా నేనే చికిత్స చేయగలననుకో కానీ తేరుకోవడానికి ఎక్కువకాలం పట్టవచ్చు. మీ ఆడమనిషి ఇప్పటికే శోకాలెట్టి నానా హంగమా చేస్తున్నాది. విజయనగరం తీసుకెళ్ళావనుకో సాయంత్రాని కల్లా వొచ్చేవచ్చు"

"ఇజీనారంఅంటేమాటలేటి మారాజా - శానా డబ్బులయిపోతాయి. మాకాడ డబ్బు లెక్కడయి బాబయ్యా. అప్పోసప్పోజేసి కచ్చు పెట్టానని తెలిస్తే మాయత్తనంజ పేణాలొగ్గేస్తాది..." అన్నాడు అప్పలనాయుడు.

"విజీనగరం తీసుకెళ్ళకపోతే ఇక్కడే ప్రాణాలొగ్గేస్తాది. అది చూసుకో..." అన్నాడు గోపాత్రుడు.

"నేరక బుద్ధిగడ్డితిని మీకాడికొచ్చినాను. రాజులారా-సెడ్డ కవుకులు పెట్టేస్తున్నారు. నానేటి జెయ్యాటం బగమంతుడా! సొమ్ములు కరుసుపెట్టానని తెలిస్తే ముసిల్ది సచ్చిపోతాది. ఇజీనారం తీసుకెళ్ళకపోతే ఇక్కడే ప్రాణాలొగ్గేస్తాది. సెడ్డసంకటం తెచ్చిపెట్టారు. పీకబోయినా నాను రాసోడ్ని నమ్మనని ముసిల్ది అందికే అంతాది" అని గుండపిండయిపోయాడు అప్పలనాయుడు.

ఫక్కీరాజుకు కక్కాలేని మింగాలేని పరిస్థితి దాపురించింది "డబ్బులు గురించి నువ్వేం కంగారుపడకోయి" అన్నాడు నెమ్మదిగా.

"సొమ్ములు గురించి కంగారు మాయత్తకండి.. ముడిసిగురించి కంగారు నాదండి..ఏ కంగారు లేనోరు తవరే నండి" అన్నాడు అప్పలనాయుడు కసిగా.

అప్పలనాయుడి భార్య ఈలోపున గుండెలు బాదుకుంటూ గుడిసెలోనుంచి బయటకి పెద్దగా ఏడుస్తూ వచ్చింది. "అమ్మలారో-నానేం జేతునా అమ్మలాలో-నానేం జేతునరోయ్... ఓ అమ్మ దేవుడమ్మా నాకేటి దిక్కే"

ఆమె అలా రాగాలు తీస్తోనే భర్త దగ్గరికి వచ్చింది.

అప్పలనాయుడికి ఎక్కడలేనిచిరాకూ, కోపమూ ముంచుకొచ్చాయి. పెను కోపంతో ఎడమచేత్తో చిన్నమ్మ దవడ మీద 'ఫాట్'మని ఒక్కటి కొట్టాడు.

"చిత్తగించారా అప్పలనాయుడి దెబ్బ ఎంత గట్టిగా వుంటుందో! నా మాటవిని కారుంది-ఎక్కీసి ఇంటికి పోదాం పదండి. ఎందుకయినా మంచిది" అన్నాడు గోపాత్రుడు చిన్నగా.

"మనం క్షణాలమీద బయలుదేరాలి" అన్నాడు ఫక్కీరాజు-ఎందుకయినామంచిదని అప్పలనాయుడికి కాస్తసుమారంగా జరుగుతూ.

అప్పలనాయుడు భార్యవేపు తిరిగి



"మీయమ్మని విజీనారం తీసుకెళ్ళాలి డాక్టరుకాడికి. బయటెల్లు. మరోసుట్టుగాని ఏడిసినావా కొడవలెట్టి కొప్పు కోసేత్తాను"

ఏడవటం మానేసిన చిన్నమ్మ పెంటిమీద తాటాకుమంటలాగ గుప్పుమని లేచింది. "నీజిమ్మడిపోను, నీ సేతులడిపోను, నీ బుగ్గితిరిపొయ్య. ఏటోరె నీకంత కావరంగున్నాది. మళ్లా నావొంటిమీద

సెయ్యేసేసూడు. నీ గొంతుముడి కొరికేసి, నీ రగతం తాక్కపోతే నాను కసిరెడ్డి ఎర్రినాయుడి కూతుర్నిగాను పోగాలవేట్ర నీకు. దిక్కుమాలిన సచ్చినోడ, దొంగ సచ్చినోడ, బోషిడీకీ, నమిడీకొడక'' అని కాసేపుతిట్టి, భర్త ఏమీ అనకుండా నిశ్శబ్దంగా వుండిపోవటంతో తగ్గింది.

"తమరు విజీనారం వెళ్లొచ్చండి. నేను సింతలకోనేటిదగ్గర కారు ఊగేస్తాను" అన్నాడు పాత్రుడు.

"పీక దీసేస్తాను సుమా" అని హెచ్చరించాడు ఫకీర్రాజు.

*　　*　　*

అల్లుడు రాజబాబు నడుపుతున్న ఆ కారు జొన్నవలస అడ్డరోడ్డు దాటేసరికి దేవు

దమ్మకు మెలకువ వచ్చింది.

కారువెనుక సీట్లో ఆమె పడుకొని వుంది. ఆమె తల చిన్నమ్మ ఒడిలోవుంది. ముందుసీట్లో గోపాత్రుడు, ఫకీర్రాజు, అప్పలనాయుడు కూర్చున్నారు.

వంటిమీద తెలివొచ్చిన దేవుడమ్మ మూలిగి, ఒకసారి కళ్లుతెరచి అయోమయంగా చూసి మళ్ళీ కళ్లుమూసుకుంది. "నోరెండిపోతున్నాదర్రా..దాకంగున్నాది. అమ్మోలమ్మ ఇదేటిది ఇలాగ్గ కదుల్తున్నాది. బస్సులోగాని ఒడిసేసినారేట్రా? కొంపదీస్సి వొసలాసలక్కాని మోసేస్తన్నారేట్రా..." అని మళ్ళీ కంగారుగా ఆమె కళ్లు తెరచి చేతులు సీటుమీద ఆన్చి, కాళ్లు కూడదీసుకుని లేవబోయింది.

చిన్నమ్మ ఆమె తలను నొక్కిపట్టి "నేదోలమ్మ నీకేటి బయ్యం నేదు.. బెగిలిపోకు. తొంగుండో. ఇజీనారం డాక్టరుకాడికి ఎలన్నాం. నీకేటి బయ్యం నేదు. జోడు కోనేర్లకాడికి ఒచ్చీసినాం. నీకేటి బయ్యం నేదు. నాన్నీకాడే వున్నాను. నీయల్లుడున్నాడు. సింవాచలం అప్పన్న దేవుడున్నాడు" అని చాలా ప్రేమగా చెప్పి, తల్లి తల నిమిరింది.

దేవుడమ్మ మళ్ళీ కళ్లు మూసుకుంది. ఆమె కన్నుతుదలనుంచి నీళ్ళుకారి చెక్కిళ్ల మీదుగాపారి చెవిపక్కనుంచి జుత్తులో కలిసిపోతున్నాయి.

ఆరిపోయి, పగిలిపోయిన పెదవుల్ని దేవుడమ్మ పొడారిపోయిన నాలుకతోనే తడుపుకొని "నాను సచ్చిపోతన్నానే కూతురా.. నాను సచ్చిపోతన్నాను. ఊరంతా తిరిగి పోతన్నాదోలమ్మ. ఓలమ్మ గుండికాయలు తిరగబడి పోతున్నాయె...." అని గొణిగింది.





చిన్నమ్మ కళ్ళనీళ్లు పెట్టుకుని అసహాయంగా తల్లికేసి చూసింది. ఏమీ మాటాడలేకపోయింది.

ఒకటి రెండు నిమిషాలు ఎవరూ ఏమీ మాట్లాడలేదు. కారు కిటికీలనుంచి రివ్వున గాలి దూసుకొస్తోంది.

"రాసోడో-విండీసనిచ్చిన రాసోడో. అమ్మీ...రాసోడేమైనాడే.ఆడితోటొచ్చిన దొంగమెకవోడేడీ... ఓలమ్మ నోరంతా యిసంగున్నాదే. కసిన్ని నీళ్లు కావాలే. గుండికాయలు తెగిపోతున్నాయే! సచ్చిపోతానేటో. నీ సేతులిలాగియ్యే కూతరా! నా తల్లి, నా బంగారకొండ.నీ సేతులిలాగ నా గుండెమీద పెట్టే తల్లి మాయమ్మ! గట్టిగా నొక్కిపట్టుకోయే-నన్నాగ్గికే మాయమ్మ. నా తల్లి సచ్చిపోతానే. సందుగుపెట్టి కింద మాయమ్మ నాకిచ్చిన నానూ, పట్టెడా, మీ నాయన సంపాదించిన నాగశిరం, పాపిడి సేరూ ముంతలోబెట్టి పాతినానే. కసిన్ని వెండిరూపాయ బిళ్లలు కూడా అందలేసినాన్నే. అయన్నీ నీకేనోలమ్మ నాకూతురా..నాతల్లి. అయ్యన్నీ నువ్వే దీసుకోయమ్మ. ఆల్లుడోడ్ని మా తరం ఆటిమీద సెయ్యిబెట్నీకు తల్లీ...గారిపోతోళ్ళ సొంతం అంతనోలమ్మ..జాగ రగుండే. నాను జచ్చిపోతే... ఓలమ్మ సచ్చిపోతానే....నాను జచ్చిపోతే ఏడిసిగూకోకు.నా మెడలున్న పగడాల్దండ దీసేసుకోతల్లీ. సెవుల పోగులు మరిసిపోకుండా తీసేయమ్మ. కాటికాపవారికి సచ్చినోడయినాతడివీసుకొంతాడు నీపెనివిటయినా అయ్యేట్టికెళ్లి ముందకిచ్చేత్తాడు. దొంగసచ్చినోడమ్మా నీ మొగుడు. సత్తిగాలపోల్లాగ కాపిస్తాడు గాని ఆడ్ని నమ్మి నీవు నీ సొమ్ము, బంగారం, పొలం, పుట్ర ఆడి సేతిలబెట్టొద్దు.కిడియాలు కూడ తీయించేమోలమ్మ. నీ మొగుడికి పుట్ట

కొక్కుల కూరంతే బెవత. దొరికినపుడల్లా జేసిపెట్టమ్మ. నానిపుడే జెపుతున్నాను. దినవారాలకని, దినానికని ఇల్లుగుల్ల జేసీ వొద్దమ్మ. అల్లుడోడికేటి అత్త సొమ్మే గప. అలమంత రాసోడినాగ తగలేస్తాడు. జాగర్తోలమ్మి నాను సచ్చిపోతాను. నా గుండెలమీద నీ తలకాయపెట్టమ్మ. మా యమ్మని బోల్నావు నువు. నినుజూస్తే మాయమ్మని జూసినట్టుంటాదే కూతరా... నా కూతరా...బిడ్డా...''

'సందిపేలాపన..దగ్గిరపడిందన్న మాట, అనుకొన్నాడు ఫకీర్రాజు ''రాజబాబూ! బేగాపోనీవోయి కారు'' అన్నాడు.

అప్పలనాయుడు వెనక్కి తిరిగి ''ఇజె నారవొచ్చీసింది. డాక్టరుకాడికి ఎల్లీ ఎల్లగానే సోడాకాయ ఒట్టుకొసాను'' అని అత్తకి చెప్పాడు.

పాత్రుడు అప్పలనాయుడి భుజంమీద చూపుడువేలితోతట్టి ''మీ యత్త బంగారం, సొమ్ము సందుగుపెట్టెకింప కప్పెట్టించిం.పాపం చెప్పీసిందిగదా. కారు వెనక్కి లిప్పీమందానా?'' అని వెకిలిగా అడిగాడు

''ఒల్లకోవయ్యా పాతుర్డా'' అని కసిరాడు అప్పలనాయుడు. అయిదు నిమిషాల్లో కారు పెద్దాసుపత్రి ముందు ఆగింది.

కారు తలుపు తీసుకొని ఫకీర్రాజు దిగాడు. చిలకట్టు సరిగ్గా దోపుకొన్నాడు. జుత్తు సరిచేసుకొని రెండుచేతుల్తోసి మీసాలు సర్దుకొన్నాడు.

''ఆస్పత్రికాడికి ఒచ్చీసినాం. నెగమ్మ. కళ్లుతెరిసి కూకో'' అన్నది చిన్నమ్మ.

''మీరందరు వుండండి. పాత్రుడూ, నేనూ డాక్టరుగారితో మాట్లాడివస్తాం''

పాత్రుడుకూడా దిగి ఉంగరాలజుత్తుని సర్దుకొన్నాడు. కారులో గాలికి రేగిన ఆ జుత్తు సర్దిన తర్వాతకూడా అలాగే చిందరవందరగా వుంది.

అందరూ సొమ్ముల డాక్టరని పిలిచే పెద్ద డాక్టరు పేరు లక్ష్మీపతిరాజు. అతనూ రాజేగాని పడమటిరాజు. తూర్పురాజులు పడమటి రాజుల్ని చిన్నచూపు చూస్తారు కాబట్టి లక్ష్మీపతి రాజుకు తూర్పుదద్దయ్యలంటే ప్రత్యేకమైనకోపం.

అతను బక్కగా, నల్లగా, బట్టతలతో, ఎర్రకళ్ళతో ధుమధుమలాడుతూ ఉంటాడు. 'డబ్బు కక్కుర్తి మనిసిగాని మారాజు చేతిచలవ మంచిది'అనుకొంటారు జనం.

'నమస్తండి' అన్నాడు ఫకీర్రాజు - సొమ్ములడాక్టరికి నమస్కరిస్తూ. డాక్టరు తలపంకించి నమస్కారాన్ని స్వీకరించాడు.

''నన్ను ఫకీర్రాజంటారు. అలమండ గ్రామంమాది.ఉప్పలపాటివారం.ఇదివరలో ఓసారి తమ దర్శనం చేసుకొన్నాను. తమకి గుర్తువుండే వుంటుంది''అన్నాడు ఫకీర్రాజు కాస్త చనువుగా మాట్లాడటానికి ప్రయత్నిస్తూ.

ఫకీర్రాజు తన శత్రువర్గంలోవాడని లక్ష్మీపతిరాజుకు తెలిపోయింది. ''అయితే ఏమంటారు?'' అని చాలా కటువుగా అడిగాడు టేబుల్ కింద కాలు మీద కాలు వేస్తూ.

''చిత్తం. ఒక పేషెంట్ని తీసుకొని వచ్చామండి. సీరియస్ మీదుందండి''

''ఓ.పి.లో చూపించండి''

''చిత్తం. కానీ కేసు ప్రాణాపాయ స్థితిలో వున్నాదండి. అందువల్లనే తమ దర్శనం చేసుకున్నాం''

లక్ష్మీపతిరాజు మాట్లాడలేదు.

ఫకీర్రాజు పెదవి విప్పాడు ''నేను

క్షత్రియోచితంగా తెనుగు వైద్యం చేస్తూ వుంటానండి. ఈయొక్క పేషెంట్ నాయొక్క పేషంటేనండి. ప్రస్తుత స్థితి చూసి ఆందోళనచెంది మనయొక్క అధీనంలోని కేసు కాదని గ్రహించి తమ వద్దకు తీసుకొచ్చాను"

"ఫకీరుబాబుగారి వల్లే ఆ యాద మనిషికి పీకల మీదికి వొచ్చిందండి.అందు కని ఆయన బావగారి కారు తీసుకుని పేషంట్ని అఘమేఘాల మీద తీసుకొని వచ్చారండి" అని పాత్రుడు చెప్పాడు.

ఈతడెవడోయ్ అన్నట్టుగా డాక్టరు గోపాత్రుడి వంక చూశాడు.

"చితం. నేను గోపాలపాత్రుడినండి. గోపాత్రుడుగారు అంటారండి అలమండలో అందరూ. రాజవైద్యుడినండి. అలమంద దివాణాలకు అదినుంచీ మేం కుటుంబ వైద్యులమండి" అన్నాడు గోపాత్రుడు.

చితం, తమరు, దివాణాలు మొదలైన పదాలంటేనూ, దీర్ఘాలు తీస్తూ దర్జాలు పోతూ మాట్లాడటమంటేనూ సౌమ్యుల డాక్టరుకి చిరాకు. పాత్రుడి ఉచ్చారణ ఫక్కీరాజు ఉచ్చారణకు అనుకరణగా వుండటంతో అతనికి ఒళ్ళు మండి పోయింది.

"ఏమిటా భాషేమిటి? మామూలుగా మాటాడకూడదూ ప్రాణాలు తీయక పోతే" అని పశ్చిమ గోదావరి దీర్ఘాలతో కోపంగా, చిరాకుగా అడిగాడు.

"చితం. ఇది మా కుటుంబాల్లో ఆది నుంచీ అలవాటైన భాషండి. తమరు గోదావరి జిల్లాను తెనుగు, ఆ యొక్క నది పారిన రీతిలో మాట్లాడుతున్నట్టే మేం మా సంప్రదాయాలకు అనుగుణమైన భాష మాట్లాడుతున్నామండి" అని చాలా ఓర్పుగా చెప్పాడు ఫక్కీరాజు.

"అసలు విషయం చెప్పండి"

"చితం. వెలమదండి....ముసిల్దండి... ఎకరాన్నర పొలం వుందండి. గదిలో సందుగుపెట్టి కింద ముంతలో ఖానా బంగారం, సొమ్ములూ దాసిందండి. చావు బతుకుల మీద వుందండి" అని గోపాత్రుడు చెబుతుంటే

"అవన్నీ ఎందుకోయి ఏ కరువు పెడతావు!" అని ఫక్కీరాజు కసిరాడు.

"తమకు అవసరం లేదుగానీ వైద్యుడనేవోడికి పేషెంట్ తాహతేమిటో తెలియాలి. దాన్నిబట్టి కదండీ వైద్యం చేసేది" అన్నాడు గోపాత్రుడు.

"చితం. నేను చెపుతానండి ముసిల్దా నికి టి.పి అని నా అనుమానమండి రోగం ఆలాగున నిదానించానండి. సరేనని జెప్పి చికిత్స ప్రారంభించానండి"

"టి.పి. కాదు టి.బి." అని అరిచి వివరించాడు లక్ష్మీపతిరాజు.

"చితం....దాన్ని మేం రాజయక్ష్మం అంటాము. అందుమీద ఈరోజుఉదయం పదిగంటలవేళ ఇండిషన్ ఇచ్చామండి. ఆ మీదట మా పేషెంట్ ఎందువలనో కానీ కొంచెం మొహం తిరిగి పడిపోయిం దండి. శరీరం అంతటా ఎర్రని దద్దర్లు లేచిపోయాయండి. మనిషి మాత్రం బతికే వుందండి"

"ఏం ఇంజెక్షనిచ్చారో?"

"చితం. దాని పేరండీ...మా గోపా త్రుడు చెబుతాడండి"

"నాకు తెలీదండి. నాకూ డా ఇంగ్లీషు రాదండి. నేను రాజుగారి శిష్యుడి నండి"

లక్ష్మీపతిరాజు ఎర్రటికళ్ళు పెద్దవిచేసి, కనుబొమ్మలు ఆశ్చర్యంగా పైకి ఎత్తాడు.

"అయ్‌బాబోయ్! పేరు తెలీకుండా




ఇంజక్షనిచ్చారా?"

ఫకీర్రాజు వెర్రిసవ్వు నవ్వేడు "చితం. నేను అసలు ఇంగ్లీషు వైద్యం జోలికి పోనండి. ఆయుర్వేదం, యునాని,ఉమాపతి అంటే పులైపోతాను. ఈ పాత్రుడే ఆయొక్క ఇండిషన్ సీసా తెచ్చాడండి. ఏ జబ్బుకైనా ఉత్తమంగా పనిచేస్తుందని చెప్పాడు. ఇతడి తండ్రి మీద గౌరవం కొద్దీ నేనామాట విశ్వసించానండి. అది వాడేసరికి ఇలాజరిగిపోయిందండి. వైద్యుడి దగ్గిర ఎలాంటి విషయమైనా దాయకూడ దంటారుగదండి. ఇంతేనండి జరిగింది. ఇపుడా పేషంట్ బైట కారులోవుందండి"

"ఆ మందులో ఎట్టి దోషంలేదండి. ఆ మందుగానీ ఇపుడు దొరికే చెత్తడా మందుల్లాంటిదనుకొన్నా రేవిటి? అయిదేళ్ళ కిందటిది. దాన్నిబట్టి ఎంత శ్రేష్ఠమైనదో తమరే గ్రహించాలి. మందులో ఏం దోషంలేదు" అన్నాడు గోపాత్రుడు.

సొమ్ముల డాక్టరు నోరు ఆశ్చ ర్యంగా తెరిచి కొయ్యబారిపోయాడు.

"అయిదేళ్ళ కిందటి ఇంజక్షనా?"

"మరేనండి. ఇపుడొస్తున్న మందులన్నీ కల్తీ మందులుగదండీ. పాతకాలపు మందులెంత మంచియో ఫకీర్రాజుగారికి తెలీకపోవచ్చుగానీ పెద్ద డాక్టరుగారు తమకు చెప్పాలా?"

సొమ్ముల డాక్టరుకు విపరీతమైనకోపం వచ్చింది. కుర్చీలోనుంచి చివాలున లేచిపోయి చూపుడువేలు ఆడిస్తూ "మిమ్మల్ని...మిమ్మల్ని జైల్లో బెట్టాలి" అన్నాడు.

"నన్నేనాండీ ?" అని ఫకీర్రాజు అడిగాడు.

"అవును. మిమ్మల్నేకాదు మొత్తం, మీ తూర్పురాజులందర్నీ జైల్లో పెట్టాలి. పెట్టి లాఠీల్తో చితక్కొట్టించేయాలి" అన్నాడా డాక్టరు.

"చితం. వాటి గురించి మనం తర్వాత ఎప్పుడైనా ముచ్చటించుకుందాం. పేషెంట్ కారులోవుంది. లోపలికి తీసుకు రమ్మని శెలవా?" అని ఫకీర్రాజు కోపాన్ని అదుపులో పెట్టుకుని అడిగాడు.

"ఇంతకీ అదేం ఇంజక్షను" అని దాదాపు అరిచినట్టు అడిగాడు లక్ష్మీపతి రాజు. పాత్రుడు ఏమీ మాట్లాడకుండా ఇంజక్షన్ సీసా జేబులో నుంచి తీసి అందించాడు.

దానిమీది పేరూ, ఎక్స్పైయిరీ డేటు చదివి "ముసిల్ది ఇంకా ప్రాణాల్తోనే వుందా?" అని ఆశ్చర్యంగా అడిగాడు డాక్టరు.

"చితం. బతికేవుందండి. ఒంటిమీద జ్ఞాపకం కూడా వుందండి. మూడు పట్లు కలికం వేశానండి. గుణం కనిపించిందండీ. కానీ ఎందుకైనా మంచిదని తమ దర్శనం చేసుకున్నాం" అన్నాడు ఫకీర్రాజు మీసాలు సర్దుకుంటూ

"ముందు మీరు బైటకి పొండి. మొహం చూపించకండి. మళ్ళీ ఎప్పుడైనా మీ యిద్దర్లో ఎవరైనాగాని సిరెంజి పట్టు కొన్నట్టుగానీ తెలిసిందా జెయిల్లో పెట్టి స్తాను" అని అరిచాడు సొమ్ముల డాక్టరు.

"సాటి క్షత్రియుడితో తమరీ భాషలో మాట్లాడ్డం ధర్మంకాదు" అన్నాడు ఫకీ ర్రాజు చిన్నబుచ్చుకుని.

"సాటి క్షత్రియులెందుకయ్యారు? మీరు అలమండవారుగదా! ఉప్పలపాటి వారు..నేను పడవటోణ్ని..గాదిరాజోణ్ని. మీరు మాకంటె పెదరాజులుగదా" అన్నాడు లక్ష్మీపతిరాజు.

'అదా కడుపులోమంట.అదటోయి నీ ఏడుపు. నువు నాకంటే పెద్ద డాక్టరు వైనావుగాని జన్మలో పెదరాజువు కాలేవు గదా' అనుకున్నాడు ఫకీర్రాజు మాట్లాడకుండా కారు దగ్గరకు బయలుదేరుతూ.

"అన్నట్టు డబ్బులో..?డబ్బులెవరిచ్చుకొంటారండీ అలమండరాజావారూ?"అని వెటకారంగా, అనుమానంగా అడిగాడు వెనకనుంచి డాక్టరు.

"ఖర్చులన్నీ అలమండ దివాణమే. భరిస్తుందని చెప్పవోయి పాత్రుడూ"




రాజా మీర్జా సల్లపరాజ సత్య సూర్య నారాయణ రాజు తోబుట్టువు అప్పల సరసియ్యమ్మ ఫకీర్రాజు భార్య.

అన్నగారు చేవదేలిన తాటిచెట్టులాగుంటే చెల్లెలు ఉల్లికాడలాగ వుంటుంది. అన్నగార్ని మీర్జా పెదబాబని పిలుస్తారు. చెల్లెల్ని చిట్టమ్మ అంటారు. మీర్జా పెదబాబు పందిరి మంచవంత పాతకాలపు పడక కుర్చీలో కూచుని హుక్కా పీలుస్తుంటే చెల్లెలు నాలుగిళ్ళ వాకిట స్తంభానికి చేరబడి చెబుతోంది-

"ఎలాగ్గావాలంటే అలాగుంది పెద నాన్నా మా కుటుంబం. అయితే వైద్యం.. లేకపోతేవేట, పెదచావిట్లోకి వెళ్తే పేకాట. ఆమధ్య...ఆమధ్య కొన్నాళ్ళు పిట్టల పిచ్చి. పికిలిపిట్టలు, మైనగోరాలు, భరత పిట్టలు, అరేబియా పిట్టలు-ఇక్కణ్నించి వందలకు వందలు బోసి మనిషిని పమ్మించటం, ఆ పిట్టల్ని తెప్పించటం. తీతికను పెంచితే తప్పేపిటోయి అంటున్నారు ఈమధ్య. ఆ పిట్టలకి పంజరాలు...రోజుకూలీకి మనుషల్ని బెట్టి పంజరాలు తయారు చేయించారు. పిట్టలకోసవని విజయనగరం మనిషిని పంపి రెండుబస్తాల గంటెలు తెప్పించారంటే మీ బావ ఎంత జాగర్తయిన సంసారో ఊహించుకోండి. మొన్నటివరకూ ఇంటి నిండా, చివరకు ఆయన భుజాలమీదా, నెత్తిమీదా కూడా పావురాలే. అదృష్టవశాత్తూ ఏదో రోగ వొచ్చి వారం రోజుల తేడాతో పిట్టలన్నీ చచ్చాయి. ఆ శనొదిలింది.కొన్నాళ్ళు కోడి పుంజుల సరదా. అవేమిటో సోగలకోళ్ళు. పుంజుకి రెండు కోసుల పొడవైన తోకలుంచాలిట. అయిదో ఆరో సంపా పెంచారు. గోదావరి అవతల ఏదో దిక్కుమాలిన వూరిలో ఎపడో ఈయనలాంటి సోగల పిచ్చోడున్నాట్ట. అక్కడికి అల్లుడు రాజుబాబుని పంపి రెండు పుంజులు తెప్పించారు. ఎనిమిది వందలు ఖర్చయిందిట. డింకీపుంజుల చెవులకు బంగారపు తమ్మెట్లు, వెండి లోలక్కులూ కుట్టించారు. ప్రస్తుతం తమరు చూసేరు గదా-ఆరుకుక్కలున్నాయి ఇంట్లో. మూడు పూట్ల వాటికి ఎంతెంతబుక్కడాలుండాలో చూసుకోండి. పోనీ మానెడు కూడు బుక్కి అవి ఏవైనా ఖాయిదా చేస్తాయా అంటే అదీలేదు. పట్టపగలు దొంగలు బడి ఇంటి మొత్తం దోచేసినా అవి కదలవు. ఇందాక తమరొచ్చినపుడు ఒక్క కుక్కయినా అరిచిందా ? సుబ్బరంగా తినేసి, ఇస్తే తాంబూలాలు కూడా




తీసుకుని పడుకొంటాయి అలాంటి కుక్కలు.. ఎక్కడ సంపాదించారో, ఎంత ఖర్చుపెట్టారో తెలీదు. ఈయన సరదాల పుణ్యమా అని బావిలీలు, దండవంకలు విజయనగరం వైష్ణవుల కొట్లకి చేరిపోయాయి. మిగిలిన జవహరీ కూడా అమ్మేస్తారు. 'ఆ' అంటానికి వీల్లేదు...కోపం. ఏమీ బేహద్బీ అంటారు. మొన్నటి వర్షానికి పడవటి గోడ కూలి పోయింది. ఇల్లంతా కురిసేస్తుంది..."

మీర్జా పెదబాబు హుక్కా గుడగుడ మని పీలుస్తూ అరమోడ్పుకళ్లతో వింటు న్నాడు. చిట్టమ్మ ఒక్కక్షణం అలుపు తీర్చుకుని మళ్ళీ మొదలు పెట్టింది...

"సరిగ్గా ఈయనకి తగిన శిష్యు డొకడు దొరికేడు. గోపాత్రుడని తమరు ఎక్కడకు వెళ్ళినా హుక్కా తీసుకు వెళ్ళినట్టు ఈయన ఎక్కడకు వెళ్ళినా వెంట వాడు వుండాల్సిందే. వాడికోసం వెనుకాముందూ చూడకుండా ఖర్చుపెడ తారు. ఏమిటో వాడంటే అంత అపేక్ష నాకు అర్థంకాదు. వారం అయింది. రెండువీసెల చిత్రకాటి, పైత్యాంతక రసం జేయించి వాడికి ఇచ్చారు. ఆమధ్య తుని నుంచి తమరు నేరకి పమ్మించిన పొస్తకాలు ముందేసుకుని బంగారపు రేకుతో ఏవో దివ్యమైన ఔషధాలు తయారుచేయిస్తా నని కూర్చున్నారు. ఆ రోజుమాత్రం నేను నూతిలో గెంతేస్తానని భీష్మించుకు కూచుంటే వూరుకున్నారు. పులిపొట్ల, చిరతపులి కొవ్వట, సెవరకాకి గుడ్లట, జరదకట్టట, నెమలి వెంట్రుకలట - అవన్నీ పురమాయించి తెప్పిస్తే పుటం పెట్టి వాత నొప్పులకు ఒకటోరకం ఔషధం తయారు చెయ్యొచ్చుట. ఇలాగ ఎన్నని? బయటకు వెళ్ళొచ్చారంటే మళ్ళీ ఏ కొత్తపిచ్చి పట్టు కొంటుందోనని భయం. పిల్లలిద్దరికీ పెళ్లిళ్లుచేసి పమ్మించీసేం. గనక సరిపో యింది. ఏం జరుగుతే అదే జరిగిందని గుండె రాయిచేసుకొన్నాను" పొడికళ్ళను పొడి పైటతో తుడుచుకొంది చిట్టెమ్మ.

మీర్జా పెదబాబు కళ్లుతెరిచి పడక కుర్చీ దండెలపై వేసిన కాళ్ళను కిందబెట్టి హుక్కాచిలుంలో నుసిబట్టిన బొగ్గులను వొంగి వూదేడు. నిప్పులపై నుసి ఎగిరి పాలగచ్చుమీద పడింది. నిప్పులు ఆ గాలికి కణకణమని మండేయి. చిలుంలో బొగ్గుల అడుగున సెగకు వేడెక్కి పొగలు చిమ్ముతున్న ముష్కీఖమీరా పరిమళం నాలుగిళ్ళ వాకిలంతా అల్లుకుంటోంది.

చిట్టెమ్మకి హుక్కా పరిచయమైనదే. పెళ్ళికాకముందు తండ్రిగారికీ, అన్నగారికీ కూడా ఆమె హుక్కాలో తమ్మాకువేసి, కుందులో నీళ్లుపోసి, చిలుంలో నిప్పులు వేసి పొగబాగా వచ్చేవరకూ పీల్చి అప్పుడు ఇచ్చేది.

మళ్ళీ కుర్చీదండెలపై కాళ్లు పెట్టు కొంటూ "పికిలిపిట్టలకోసం చేయించిన పంజరాలున్నాయా? ఎవరికేనా ఇచ్చే సిరా" అని అడిగాడు మీర్జాపెదబాబు.

ఆ ప్రశ్నకు సమాధానం చెప్పకుండా చెల్లెలు 'హు' అని మూలిగింది. "ఆయన గురించి మీకు చెప్పుకోవటం బుద్ధిమాలిన పని ఆ సరదాలన్నీ తమకూ ఉన్నయ్యే కద? చూడండి అన్నా! మీ బావచేసిన బుద్ధిమాలినపని అని నేను ఏకరువు పెట్టుకుంటే మీరొక్కమాటయినా అన్నారూ? ఎవరికి చెప్పుకోవటం? బావాజీ లేనేలేరు. అమ్మయ్య వినేపరిస్థితిలో లేరు. తమరు ఇలాగ..నా ఖర్మ" అని చిట్టెమ్మ కన్నీళ్లు పెట్టుకుంది.

దీపాలు పెట్టే వేళయింది.



"ఏమమా బావగారూ! ఎప్పుడు దయ చేశారు? తునిలో బుల్లి బావజ్జీ, చిట్టినాన్న, రాజా పెదబావజ్జీ క్షేమమేకదా?" అని పలకరిస్తూ దుంపలదత్తుడు నాలుగిళ్ళ వాకిట అడుగుబెట్టేడు.

దుంపలదత్తుడిక్కూడా మీర్జా పెద బాబు వయస్సే వుంటుంది. అయితే మీర్జా పెదబాబు చాలా ఎత్తుగా, బలంగా కొంచెం చామనఛాయగా వుంటే-దుంపల దత్తుడు పొట్టిగా పుష్టిగా తెల్లగా ఉంటాడు. చిన్నప్పుడు అతను మరీ పొట్టిగా, మరీ పుష్టిగా వుండటంతో బడిలో సహాధ్యాయులెవరో దుంపలరాజు అని పేరు పెట్టారు. అతని పేరు వరాహనర సింహ గోపాలరాజు అయినప్పటికీ అత న్నందరూ దుంపలరాజనే అనేవారు. తర వాత అతను పిల్లల్లేని పినతండ్రిగారికి దత్తువెళ్లాడు. అప్పుడతని పేరు దత్తు డయింది. కానీ దుంపలదత్తుడయింది.



దుంపలదత్తుణ్ని చూసి మీర్జా పెదబాబు లేచినిల్చున్నాడు. చిట్టమ్మ లోపలికి వెళ్ళిపోయి నౌకరుచేత కుర్చీ పంపించింది.

"కుర్చీలు రెండూ పెళ్ళరుగుమీద వెయ్యవోయి. నీ పేరేంటోగాని" అన్నాడు మీర్జా పెదబాబు.

"నా పేరు అరసవిల్లండి. ఉద్దారుణ్ని" అన్నాడు అరసవిల్లి కుర్చీలు రెండూ పెళ్ళి అరుగు అని పిలవబడే రాతి అరుగు మీద వేస్తూ. తూరుపు రాజుల లోగిళ్ళన్నీ నాలుగిళ్ల వాకిళ్ళే. నాలుగు పక్కలా సమానమైన పెంకుటింటి వసారా లుంటాయి. వాటిమధ్య పెళ్లిళ్లకోసం, సాయంత్రంపూట కూర్చోవటంకోసం శాశ్వతంగా నిర్మించిన రాతి అరుగులు ఎత్తుగా వుంటాయి. మామూలు రోజుల్లో వాటిమీద ఓ మూల తులసికోట పెడతారు. పెళ్ళరుగునూ, పెంకుటింటి వసారాలనూ నాలుగువేపులా కలుపుతూ సున్నపు గచ్చు వుంటుంది. పెంకుటింటి వరండాల్లోనూ, గదుల్లోనూ అద్భుతమైన పాలగచ్చు ఉంటుంది. చక్కగా వాడే గచ్చు అయితే దానిమీద మనిషి నీడ కనిపిస్తుంది.

రాజులిద్దరూ కుర్చీల్లో కూచున్నారు.

"ఫకీరుబావ ఇంకా వొచ్చినట్టులేదు" అన్నాడు దుంపలదత్తుడు కుర్చీలో వెనక్కివాలి బీడీ వెలిగిస్తూ. అతను కాకర్లపూడి కుటుంబానికి చెందినవాడు. వారికి నల్లపరాజువారు బావలు అవుతారు. ఉప్పలపాటివారు కూడా బావలే అవుతారు. ఉప్పలపాటివారి గోత్రం అటు వారితోనూ, ఇటు వీరితోనూ వియ్యమందడానికి వీలయినది. అందువల్లనే ఆ బావ మరదులిద్దర్నీ అలమండలో చాలామంది బావా అనే పిలుస్తారు.

"వైద్యం" అన్నాడు మీర్జా పెదబాబు.

"నా బొందవైద్యం. ఫకీరు బావకి బుద్ధి లేకగాని ఎందుకొచ్చిన వైద్యం. ఆ వైద్యానికిపెట్టిన మదుపుబెట్టి, దానిమీద చూపించిన శ్రద్ధ మామిడితోటమీద చూపిస్తే ఆ తోట బంగారం కాదా బావా? మొన్న పోలుగుల వేటకు వెళ్ళినపుడు చూసేను. తోటంతా పుల్లవిడిచిపోయింది. చెట్లకింద మీ ఎత్తున తుప్పా, డొంకా పెరిగిపోయింది. దానికితోడు చెట్లన్నీ బదనికతో చచ్చిపోతున్నాయి. మేం చేయకూడని పొరబాటుచేయనేదే సేసీం. నా తండ్రి ఇచ్చిన ఆస్తి హరించుకుపోయింది. జనకతండ్రిగారి ఆస్తిలో తొంభయిపాళ్ళు ఆరిపోయింది. కాకర్లపూడివారికి వుండే అవలక్షణాలన్నీ ఉప్పలపాటివారికి కూడా ఎందుకుండాలి? తమరేమంటారు?" అనడిగాడు దుంపలదత్తుడు.

హుక్కా గుడగుడమన్నది తప్పించి మీర్జాపెదబాబు ఏమీ అనలేదు. దుంపలదత్తుడి మాటల్ని అతను నమ్మలేదు. 'ఏరాత్రి పన్నెండు గంటలకో, తెల్లవారి రెండుగంటలకో - మెలకువ వచ్చి కోడి మాంసం తినాలనిపిస్తే వెంటనే భార్యని కూడా నిద్రలేపి అప్పటికప్పుడు కోళ్ళ గూటిలోంచి మాంఛి పుంజునుదీసి కోసి, పొయ్యి వెలిగించి, పెళ్ళానికి సాయంగా ఉల్లి చుల్లి దగ్గిరుండి కోడిని వేయించుకుని దాన్ని అక్కడే, ఆ రాత్రివేళ..ఆ పొయ్యి దగ్గిరే తినేసి వెళ్ళి మళ్ళీ నిద్రపోయే దుంపల దత్తుడేవిటి, ఇతరులకు జాగ్రత్త జెప్పడవేమిటి....చోద్యం చోద్యం' అనుకున్నాడతను.

మీర్జా పెదబాబు చిరునవ్వు నవ్వేడు.

"మీ జట్టుతోకలిసి సేరీవేట జెయ్యాలనే సరదాతో వొచ్చేను బావా! మొన్న




పదిరోజుల క్రితం పేష్ఠ ఒంటి పందిని పొడిచేరటగదా — ఇందాక కుమందాస్ వొచ్చాడు. చెప్పేడు ... అతడేసటకదా పొడిచింది. సరే. రేపు కొత్తపలస బంజరికి రెండు మూడు రోజుల క్యాంపు పెడతాం అన్నారు. మీరూ వస్తున్నట్టేనా?"

"నేను రాకపోతె అలమండలో సేరీ ఏసేది బావా? గాలికూన ఎంత ముఖ్యమో నేనంత ముఖ్యం" అన్నాడు దుంపల దతుడు.

నోట్లోంచి హుక్కా పైపు తీసి పకపక నవ్వేడు మీర్జా పెదబాబు.

"అదేవిటి దత్తుడు బావా ? అదేమి సాపత్యం?"

దుంపల దతుడు నవ్వలేదు. "నా అభిప్రాయం ఏమిటంటే – గాలికూన నాదిబావా చింతలపల్లి చినసూర్య నారాయణ నాన్న దగ్గిరికి మనిషిని పమ్మించి రప్పించాను. బంగారం లాంటి కూన.... వేటలో కూడా నేను నడిపించాలిదాన్ని. మరొకరి మాట వినదు. ఇంకోమనిషి దాని మెడ పట్టిలో తాడేసినా, గొలుసుపట్టు కొన్నా అది సహించదు. అందువల్లను నేను వేటకు వెళ్ళకపోతే ఆరోజు గాలి కూన వుండదు"

అరసవిల్లి హరికెన్ లాంతరొకటి వెలిగించి పెళ్ళరుగు మీద పెట్టి ఒత్తి సర్దాడు.

"ఎవరక్కడ? ఈ హుక్కా తీసుకు వెళ్ళి బొగ్గులు ఆర్పేవోయ్. నా సంచీలో తమ్మాకు సీసావుంది. దాన్లోంచి ఈ మాత్రం తమ్మాకు తీసిపేసి మళ్ళీ కొత్త బొగ్గులు వేసి, కుండులో నీళ్ళు మార్చి పెట్టు" అని పురమాయించాడు మీర్జా పెదబాబు.

'చితం' అనుకుంటూ అరసవిల్లి హుక్కా జాగ్రత్తగా తీసి దక్షిణపు నడకలోంచి పెరటిలోని నూతి పళ్లెం దగ్గరికి తీసుకువెళ్ళాడు.

పెరడంతా చీకటి పొసుపుతోంది. నూతి పళ్లెం మీద హుక్కా పెట్టి చిలుం లోని నుసిబారిన బొగ్గులను ఉఫ్‌న ఊదేడు అరసవిల్లి. అది ఇంకా ఎర్రగా వేడిగానే వున్నాయి. నుసంతా గాలిలో వచ్చి అరసవిల్లి మొహం మీదా, జుత్తు నిండా పడింది. నూతిగట్టుకు చేరబడి కూచుని హుక్కా గొట్టం కొన నోటిలో బెట్టి పీల్చాడు.

గుడగుడమని శబ్దం చేస్తూ హుక్కా పొగ వెచ్చగా అరసవిల్లి ఊపిరితిత్తుల లోకి చేరింది.

పొగ పైకి వొదిలాడు.

"ఓలమ్మ ఎంతపుగొచ్చిందో" అన్నాడు అరసవిల్లి ఆశ్చర్యంగా. మళ్ళీ పీల్చాడు.

'రాసోళ్ళు పందిమాంసాలూ, పిట్ట మాంసాలూ, పీకలమొయ్యా దొబ్బితిని అరగడానికి ఇలాటియి కాలుస్తారు. సెద్ద మజాగుంది ఈ వుక్కా' అనుకొన్నాడు అరసవిల్లి గుడగుడమని పీలుస్తూ.

"అరసవిల్లీ ఒరే ... అరసవిల్లీ... ఎక్కడ చచ్చేవురా సంజికొడక" అంటూ అక్కడికి కొండరాజు అనే రాసకొడుకొచ్చాడు.

రాజుల లోగిళ్ళలో వంటచేసే రాజుల్ని రాసకొడుకంటారు. స్త్రీలైతే రాసకూతు రంటారు.

కొండరాజు దగ్గిరకి వచ్చేదాకా అరసవిల్లి గుడగుడమని హుక్కా గట్టిగా పీల్చి నోరంతా తెరిచి పొగ వదిలి "ఏటండి కొండ్రాజుగోరు అలాగ కేకలేస్తన్నారు. గడిసేపు కూకుంటే సూడనీక పోతన్నారు గదా...! వొంగా పనేనేటండి" అన్నాడు నిష్ఠూరంగా.

కొండరాజు ఖాకీనిక్కరేసుకొన్నాడు. తెల్లటి జుబ్బా తొడుక్కున్నాడు. ఎత్తుగా, బలంగావున్నాడు. హుక్కా పీలుస్తున్న అరసవిల్లిని జూసి అతను నడుంమీద రెండు చేతులూ వేసుకొని—"చూసేనొరే చూసేను. నువ్వేటి జేస్తున్నావో కళ్ళార చూసేను. రాజుగారి హుక్కా నోట్లో పెట్టి, ఎంగిలిజేసిమరీ కాలుస్తున్నావు... రాజులు నీ ఎంగిలి కాల్చాలన్నమాట"

అరసవిల్లి మళ్ళీ గుడగుడమని హుక్కా పీల్చి నవ్వేడు. "నా ఎంగిలి కాల్చినా, కాల్చపోయినా ఈ నోగిట్లో మీ ఎంగిలి కూడు తినకుండా ఎవులు తిండి తినగ్గలండి కొండ్రాజుగోరూ" అని వెటకారంగా అన్నాడు.

"పళ్ళు రాలగొట్టేగల్నరే" అన్నాడు కొండరాజు హెచ్చరిగ్గా.

"నానిందాక కుడిటి గోలెంకాడ నిలబడి కందా ఇంటి కిటికీలోనుంచి చూసేనండి. టరికీ కోడి కూరలోని మెత్తటి ముక్కలన్నీ మీరే నవిలీసేరు. మరి రాజులకేటి బెట్నారండి? నాకూ, కుక్కలకీ ఎప్పుడూ దుమ్ములే ఒడేస్తారు. రాజులకైనా మెత్తటి ముక్కలెట్టరాదా" అన్నాడు అరసవిల్లి.

"సల్దివన్నం, దుమ్ము పిసరా తినీ సరికే నువ్వింత పోతరించి పోయి రాజులు గాల్చే హుక్కా పీల్చేస్తున్నావుగదా. నీకు కక్కా ముక్కా వాడసీసి బుక్కడం బెడితే నువ్వు నేలమీదుంటావురా ఏడు మనువుల నంజికొడకా" అన్నాడు కొండరాజు.

"వంట్రాజుగోరికి సెడ్డకోపం వచ్చింది" అన్నాడు అరసవిల్లి వుడికింపుగా.

"ఒరే" లేని మీసం దువ్వేడు కొండరాజు "ఒరే! సింహాసనం మీదున్నా, పొయ్యి మీదున్నా రాజు రాజేరా నంజికొడక. అలమండ దివాణాలంటే మాకున్న అభిమానాలవల్ల కానీ నువు కుంచెడు బంగారం బెట్టి, నా కాళ్ళకు మొక్కినా నీ ఇంటికాడ నేను వొండుతానేట్రా? పడవట్నున్నారు మా ఇంటి పేరుగల రాజులు. దారికచ్చులిస్తాను— అక్కడికెళ్ళి జూడు ఎంత దరిజాగుంటారో? ఎంత హోషగ్గుంటారో? వంట్రాజు గింట్రాజన్నావంటే జుత్తట్టుకు తంతాన్రా ఎబ్రాసి నంజికొడకా"

కొండరాజు చేతి వంటతో ఎంత పరిచయం వుందో, చేతి దెబ్బతో కూడా అరసవిల్లికి అంత పరిచయమూ వుంది. అందువల్ల మాటాడకుండా లేచి హుక్కా చిలుంలోని బొగ్గులు నూతి పళ్ళెంమీద బోసి, కొండులోని నీళ్ళతో వాటిని ఆర్పేడు.

"మంచి సీటి గూనలోకి నీళ్ళుతోడు. సాయంత్రంవరకు పోస్తావు పోస్తావు గదా అని ఊరుకున్నాను. రాజులు భోజనాలకొస్తే తాగడానికి మంచి నీళ్ళు చుక్క కూడాలేవు. ఫకీర్‌బాబు కూడావచ్చేసేడు. తొందరగాతెవులు" అన్నాడు కొండరాజు.

"నీళ్ళు తోడుతానుగానీ... గిన్నీ కోడి కూరయినా సక్కగబెట్టండి. నాలుగు గిన్నీ కోళ్ళు బట్టుకొని ఆటి పీగ్గోసింది నాను. పాపవంతా నాకు, మాంసవంతా మీకు. అన్నాయవండి. తెల్లారి లెగిసిందగ్గర నుంచి గాడిదసాకిరి చేస్తున్నాను గదా... మబ్బరంగా తిండిబెడితే మరింత సెక్కగా పన్జెయ్యవా?"

"సేత్తావు సేత్తావు..." అని గొణుగుతూ అక్కడ్నించి కదిలాడు కొండరాజు. అరసవిల్లి అనేసిన ఆ ఒక్కమాటతోనూ అతని మనసు మళ్ళీ




వికలం అయిపోయింది.

వొం(టాజు....

వం(టాజు...

"బావా...లోగిట్లోమానేసి నాదగ్గరి కొచ్చీ. ఇంకా మనం రాజుల దగ్గిర సాకిరిజేసి సిన్నబతుకు బతకాలా? మనం రాజులవే. ఆళ్లూ రాజులే! కాకపోతే ఆళ్ళకు మొఖాసాలు దక్కి పెదరాజులైనారు. మనం సెడిపోయి గరిటపట్టేం. మనకు మర్యాదలొద్దా?... నామాట విని నాదగ్గిర కొచ్చీ. మీ చెల్లెమ్మ నీ గురించి తల్చు కున్నపుడల్లా ఏడుస్తుంది. మనకేటిఖర్మం" అన్నాడు నీలాద్రి రాజు రెండురోజుల క్రితం.

నీలాద్రిరాజుదీ అలమండ పక్కనున్న బంగారు రాజపురమే. అయితే పది సంవత్సరాల క్రితమే అతను రాజులలోగిళ్లలో వంటపని మానేసి ఊర్నించి వెళ్ళిపోయి, వున్న అరెకరా అమ్మేసి ఓ చిన్న భోజన హోటలుపెట్టేడు. ఆ 'రాజుల మిల్ట్రీ భోజనహోటలు'కు సంవత్సర కాలంలోనే దశ ఎత్తుకుంది. కమ్మల పాక గుడిస అయింది. గుడిసె పెంకుటిళ్ళయింది. అదీ మారి డాబా అయింది. ఈమధ్యనే డాబామీద మేడ వెలిసింది.హోటలుపెట్టిన తొలిరోజుల్లోనే అతను కొండరాజు చెల్లెలు నీలయమ్మను పెళ్లాడాడు.

"బావా! లోగిట్లో కొలువుమానేసి నాదగ్గిరకొచ్చి వుండిపో" అని నీలాద్రి అయిదు సంవత్సరాలనుంచి అడుగుతూనే ఉన్నాడు.

మొదట్లో కొండరాజు నవ్వేసి వూరు కునేవాడు.

తరువాత్తరువాత, ''చూద్దాం లేరా...'' అనేవాడు.

రెండురోజుల క్రితం చెల్లెలూ, బావా వచ్చివెళ్లారు. అప్పుడుకూడా నీలాద్రి అదే విధంగా కదిపాడు.

"వొద్దులే బావా... ఈపని ఇవాల్టిది కాదు. నీ దగ్గరకొచ్చినా నువు చెప్పినట్టు చెయ్యాలి. అక్కడికొచ్చినా నేను వంటే చెయ్యాలి. మరోటి చాతకాదు. లోగిళ్ళలో అయితే రాసకొడుకంటారు. వొంటేళ్ళలో వంటోడే అంటారు. రాజుగారయినా నన్ను 'ఏమండీ కొండ్రాజూ'అంటారు. పెద్దయ్య గారయినా, పిల్లలయినా 'ఏవండీ' అనే పిలుస్తారు. ఈ విషయం మరి మాటాడొద్దు. ఇక నా పిల్లలంటావా? వాళ్ళెలాగా ఈ పనిలోకి దిగరు. చదువుకొంటున్నారు. పెద్ద చదువులకోసం దయుంటే నువు తీసుకెళ్లు"

నీలాద్రిరాజుకు చాలా కోపంవచ్చింది.

"నువు నాకాడికొస్తే నాకేటీ వొరిగి పోయిందిలేదు. పది సంవత్సరాల నుంచి నేను ఒక్కణ్ణే హోటల్ నడుపుకొస్తు న్నాను. దేవుడిదయుంటే మరో ఇరవై యేళ్ళు ఎవరిసాయం లేకుండా బిజినెస్ చెయ్యగల్ను. నీ బాగుకోరే రమ్మన్నాను. నువు నా హోటల్కొచ్చి పొయ్యి అంటిం చక్కర్లేదు.పులావు కలపక్కర్లేదు.నాకు సాయంగా ఉండమంటున్నాను. కర్రబట్టు కొని పెత్తనం చెయ్యమంటున్నాను గానీ గరిట పట్టుకోమండంలేదు. రోజులెలాగ మారిపోతున్నాయో నీకు తెలీడంలేదు. కొండ్రాజుగారంటారట ఆ మర్యాదచాలట- పొద్దున్న అలమండ వెళ్ళేనా? పెదచావిటి దగ్గిర దుంపల దత్తుడు కనిపించాడు. మర్యాదగా'బాగున్నారా బాబూ'అని పలక రించాను. ఈ రోజున దుంపలదత్తుడి పరి స్థితి ఏటి? అంతా అయిపోయిందిగద... ఖాళీ జోబీలు మిగిలాయి. నా పరిస్థేమిటి? ఏడెనిమిదిలక్షల రూపాయలు సంపాదించా

న్నేను. అలాంటి నన్ను పట్టుకుని ఆ దుంపలదత్తుడేటన్నాడో తెలుసా? 'ఏందోయినీలాద్రి. ఎప్పుడ్రార' అన్నాడు. 'నువు మానేసి వెళ్ళిపోయింతరవాత నీపాటి వంటదెలిసిన తొత్తుకొడుకు ఎఫుడూ దొరకలేదురా' అన్నాడు. బావనిచూడ్డానికి వొచ్చావేటన్నాడు. అవునన్నాను. ఎన్ని రోజులుంటావన్నాడు. ఈపెళ రేపుంటానన్నాను. 'వెళ్ళేలోపుల లోగిటిలోకి ఓసారొచ్చి రొయ్యలపులావు చెయ్యరా, నీలాద్రి... నీచేతి వంట తినాలనుందిరా అన్నాడు. మహా నిగ్రహంతో ఉండిపోయాను. నిజంగా ఆ దత్తుడికి పులావు తినాలని ఉందనుకొన్నావేటి? లేదు. నన్ను చిన్నబుచ్చడానికీ, నువ్వు ఇప్పుడు ఎన్ని లక్షలు సంపాదించినా ఒకప్పుడు నువ్వు నా లోగిట్లో గంటతిప్పినోడివేరా అని జ్ఞాపకం చెయ్యండానికి దత్తుడా మాటన్నాడు. ఇలాంటి బుద్ధులున్న అలమండ రాజుల గోడలన్నీ కూలిపోక ఏటౌతాయి? కళ్ళుపెట్టుకుని సరింగజూడు. ఇరవైఏళ్ళు అయింది. అలమండలో కొత్తగా కొన్ని పెంకలఇళ్లు గట్టారు. అందులో ఒక్కటైనా రాజుల ఇల్లున్నదా? లేదు.. ఉండదు. ఇప్పుడే చెబుతున్నాను బావా. నువు లోగిట్లోకి వెళ్ళటం మానీకపోతే నీకూ, నాకూ ఈరోజుతో సరి..." అని చాలా కోపంగా, చాలా ఖచ్చితంగా, చాలాగట్టిగా చెప్పేడు నీలాద్రిరాజు.

బావ మాటలన్నీ కొండ్రాజు ఓపికగా విన్నాడు. అతను ప్రశాంతంగానే వున్నాడు. నీలాద్రి మాటలు అయిపోయాక–

"చెట్టు జచ్చిముందు కుక్క మూతి పిందెలు పుడతాయి. అందుకే ఈ దత్తుడు బుట్టాడు. మరో పదేళ్ళకి గోడలుండవు. మొఖాసాలుండవు. కానీ ఆ లోగిళ్ళలో మనుషులుంటారు. ఆళ్లు మామూలుగా వుంటారు. భూమిన్నమ్ముకున్నోడు నిలబడతాడు, అమ్ముకున్నోడు సెడతాడు. మరో పదేళ్లు పోయినాక మన పిల్లలు వంట చెయ్యరు. లోగిళ్లలో వాళ్ల వాళ్ల వంటలు వాళ్లే చేసుకుంటారు. ఇరవై ఏళ్ల కితం ఈ వూర్లో రాజులుండేవోరు, రైతు కూలీలుండేవోరు. ఇపుడు రాజులున్నారు, రైతులున్నారు, రైతు కూలీలు కూడా వున్నారు. ఊరు మారుతున్నాది. పాత చెట్లు అలాగే జచ్చిపోతాయి. వాటి వంకలు తీరవు. కానీ ఆటికి పిలకలు పుడతాయి. ఆటికి యిత్తనాలుంటాయి. అవి చక్కగా పెరుగుతాయి. నేను ఓ మునిలి చెట్టును... ఈ చెట్టును తీసికెళ్ళి ఇంకో దగ్గిర పాత్తే వేళ్లు పాతుకోవు ఎండిపోతాను''అని చాలా ప్రశాంతంగా చెప్పేడు కొండ్రాజు.

నీలాద్రిరాజు వినుకున్నాడు.తిట్టేడు. చివరకు అలిగి కొండ్రాజు పెద్ద కొడుకుని తీసుకొని ఆ సాయంత్రమే వెళ్లిపోయాడు.

కందా యింటిలో పిడకల పొయ్యి మీద పాలు ప్రశాంతంగా కాగుతున్నాయి. గదంతా మసాలా వాసన ఘుమాయించిపోతున్నది. వండి వార్చిన అన్నం ఒక పెద్ద తపాలలోకి ఎత్తాడు కొండ్రాజు. హరికేన్ లాంతరు వెలుగులో ఆ తెల్లని అన్నం సందివర్ధనం పువ్వుల గుట్టలాగున్నది.

గిన్నికోడి కూర–

ఘుమఘుమ.

బంగాళదుంప కవాబు–

కమ్మ నివాసనతో.

కట్టు.

ఒక్కొక్కటి భోజనాల గదిలోకి




చేర్చాడు కొండ్రాజు.

బరువైన పెద్ద పెద్ద పీటలు రెండు వాల్చేడు.

కందా ఇంటిలోని మంచినీళ్ళగూనలో నీళ్లు పోసిన చప్పుడు వినిపించింది.

అన్నగారి గౌరవార్థం జడ్జీ పెట్టిలో నుంచి వెండి పళ్లాలు, వెండి గ్లాసులూ తీసి సిద్ధంగా వుంచింది చిట్టమ్మ.

మంచినీళ్ళతో సహా అన్నం సిద్ధంచేసి పెళ్ళపడుగుమీద కూచున్న రాజులతో 'వడ్డన్లయ్యాయి' అనిచెప్పడానికివెళ్ళాడు కొండ్రాజు.

అప్పటికి దుంపల దత్తుడు వెళ్ళి పోయాడు

ఫక్కీరాజు, మీర్జా పెదబాబు మాత్రమే వున్నారు.

''బొబ్బిలీ... బొబ్బిలీ'' అని గట్టిగా పిలిచాడు ఫక్కీరాజు. తూర్పు వాకిటనుంచి భారీ కుక్క ఒకటి తోక ఊపుకుంటూ ఉరుకులు పరుగుల మీద వచ్చింది. పెళ్ళ పుగు దగ్గరకు వచ్చేసరికి యజమాని పక్కనే కొత్తమనిషి వుండటాన్ని చూసిం తరువాత బొబ్బిలి తోక వూపటం మానేసింది. సాధ్యమైనంత గంభీరంగా నడుస్తూ అది సింహగమనంతో పెళ్ళరుగు ఎక్కింది.

''బాగుందోయి బావా కూన. ఇలాంటి దాన్ని ఇంకోటి సంపాదించు'' అన్నాడు మీర్జా పెదబాబు.

''ఇలాంటిదా ? ఇంకొకటా ? ఈ ఘూప్రపంచకంలో దొరకదు''

ఆ మాటలువిని బొబ్బిలి సంతోషిం చింది. కుడికన్ను పైకిలేపి ఓరగంట మీర్జా పెదబాబుకేసి చూసింది. తెలిసిందా నా ప్రత్యేకత అన్నట్టుగా చూసి, బోరవిరుచు కుని నిలబడింది. కొంచెం గుర్రుమని కోరలు చూపించి మీర్జా పెదబాబును జడిపిద్దామనుకున్నదిగానీ పక్కనున్న ఫక్కీరాజుని చూసి జంకి వూరుకొంది.

''ఇంత బ్రహ్మాండమైన కుక్కగాదు గానీ తుంపాల జోగులు నాన్నదగ్గరో కుక్క వుంది. రమారమి ఇంత కుక్క వుంటుంది. మెల్లిగా అడిగి తెచ్చేయాలి'' అన్నాడు ఫక్కీరాజు బొబ్బిలి తలమీద చేయివేసి దువ్వుతూ.

"జరుగురుగా సంపాదించవోయి బావా...దాన్నీ, దీన్నీ కలిపి సవారి బండికి పూని, నువు మొత్తాల్లో కూచుని తుని వచ్చూ గాని. పొలిమేర దగ్గిరకి నేను మేళతాళాలతో ఎదురొచ్చి తీసుకెళ్తాను'' అని మీర్జా పెదబాబు హాస్యమాడేడు.

'వడ్డన్లయ్యాయి' అని కొండ్రాజు చెప్పాడు.

"నీకు వేళాకోలంగా వుందిగానీ బావా! పేటపొలం మీద దీని దర్జా చూడాలి.. చెవులు రిక్కించుకుని, తోక నిగిడించి, బోర విరుచుకుని బొబ్బిలి నడుస్తుంటే చూసి తీరాలోయి! నల్లపులోయి...!! ఏనుగైనా అలాగ నిలబడిపోయి బయ్యం బయ్యంగా చూడవలసిందే! కానీ చిన్న లోపముందోయి. విగ్రహానికి తగినంత పెంకితనం లేదు. కొంచెం గుండె ధైర్యం తక్కువనుకుంటానోయి'' అన్నాడు ఫక్కీరాజు కుర్చీలోంచి లేచి నిల్చుంటూ.

"ధైర్యం లేని కుక్క ఏం కుక్కోయి! తిండి దండగ'' అన్నాడు మీర్జా పెదబాబు కూడా లేస్తూ.

బొబ్బిలికి ఆ బావమరదులిద్దరి మీదా చాలా కోపం వచ్చింది. మొహం చిట్లించి నిరసన సూచకంగా తోక సాధ్యమయి నంత ఎత్తున లేపి పెళ్ళరుగు దిగిపో యింది.

అరసపిల్లి హుక్కా వెలిగించి పెళ్ళరుగు మీద జాగ్రత్తగా పెట్టాడు. "పాందాన్‌లో తమలపాకులూ, సున్నం ఉప్పు చెక్కా వున్నాయో లేవో చూడరా అరసవిల్లీ" అన్నాడు ఫకీర్రాజు భోజనానికి కదుల్తూ.

గంటసేపు పట్టింది భోజనాలు పూర్తి అయ్యేసరికి.

ఏడెనిమిది మంది రాజులు విలవిలా దిగారు.



"బావగారి చికిత్సా విధానం, రోగ నిదాన మహత్యం వినడానికి వచ్చేరా మావయ్యా..." అని చిరంజీవి అనే యువకుడు అడిగాడు.

ఫక్రీరాజు గుండెల్లో రాయిపడింది.

"అదేవిటదేవిటీ?ఆ వింతలేమిటి?" అని మీర్జాల ధోరణిలో అడిగాడు మీర్జా పెద బాబు.

"ఆ...ఏంలేదు.. కాకర్ల పూడి బాంచెత్ లకు మరేం పనిలేదు..." అన్నాడు ఫక్రీరాజు.



"పని చెయ్యక సొల్లు కబుర్లు చెప్పినా ఫరవాలేదు గానీ మావయ్యా... ఈ వైద్యం వున్నది చూశారూ.. ఏది? కలగాడ మహత్యం...అది మా కుటుంబానికి చేతగాదు...ఏది? తమరా ఇండిష నివ్వడం. ఆ ముసిల్ది తక్కున పడిపోవడం.. గోపాత్రుడే చెప్పాలి. మన తరవా..?" అన్నాడు కుమందాస్ అనే మరో యువకుడు.

ద్రోహీ...ఎంత పని చేసేవురా గురుద్రోహీ...? అసలే జులాయి జట్టు. ఆ జట్టుకి మన జుత్తు దొరికిపోయింది. కాకర్లపూడి బాంచెత్‌లు ఓ వారం పది రోజుల పాటు మన్నింక బతకనివ్వరు. కుతకుత వుడికిపోయాడు ఫకీర్రాజు.

"ఇప్పటికి నాకు చేతనైనంత బాగా నేను చెపుతాను. రేపు పరిదేశమ్మ పండుక్కి గానీ మీర్బాబావ వచ్చినట్లయితే ఫకీరు మావయ్యగారి కలగాడ వైద్య కథాక్రమాన్ని వాలకాల్లో చూడవచ్చును. మావూర్లో సాలోళ్ళ వీరభద్రుడునున్నాడు. వాలకాలు కట్టి అనుకరించడంలో ప్రథముడు. వాడిచేత నేను ఈ వాలకం గట్టిస్తాను" అని చిరంజీవి అన్నాడు.

'ఈరాత్రి నా పాలిట శివరాత్రే' అనుకున్నాడు ఫకీర్రాజు దిగులుగా.




మర్నాడు ఉదయం ఫకీర్రాజు లోగిటి ముందు కుక్కలతో కొలువుతీరి కూర్చున్నవేళ గోపాత్రుడొచ్చాడు.

గోపాత్రుడి నవ్వు చూస్తేనే ఒళ్ళు మండిపోతోంది ఫకీర్రాజుకు.

"ఇంక నీ మొహం చూపించకు. నీకీ రోజునుంచి దేవిడిమన్నా చెప్పుతున్నాను" అని చాలా కోపంగా అన్నాడు.

రాజుగారి గర్జన విని బొబ్బిలితోసహా మిగిలిన కుక్కలన్నీ బెదిరిపోయి ఒక్క అడుగు వెనక్కిపోయాయి. అంతవరకూ విలాసంగా, చనువుగా, ఇష్టంవచ్చినట్టు ఆడించిన తోకల్ని అవి జాగ్రత్తగా కాళ్ల మధ్య పెట్టేసుకున్నాయి.

"ఏటి దివాణం అలాగా అగ్గిఫైరయిపోతన్నారు?"

"ఏంలేదులే. నీకూ, నాకూ మరి కుదరదు. వెళ్ళిపో. నేను కాబట్టి బతికిపోయావు. ఇంకో మనిషయితే గుండేసి కొట్టేసును!"

"అదేటండీ ఏటయిందసలు?"

"మీ నాన్న, మీ తాతా ఎంత పెద్ద మనుషులోయి..ఎంత యోగ్యులు. నువ్వు ఒట్టి కొకారీ మనిషివి బుట్టేవు అపర్దిష్ట. వాళ్ళమీద సద్భావంతోగానీ లేకపోతే నీతోటి నాకు సావాసమేవిటోయి. చాలు చాలు. కలగాడ ముసల్ది దొంగమొగం సచ్చినోడని వూరికే అన్లేదోయి. నీ గుణాన్ని గ్రహించే అన్నాదామాట అయ్యయ్యయ్యయ్యయ్యో ... ఏం బేహద్బీ! నాతో తప్పుడుపని చేయించడవేమి? చేయించి మళ్లా పెదచావిట్లోకెళ్లి దండోరావేయడవేమి? పళ్లికిలిస్తూ నా దగ్గిరకు ఏ మొహం పెట్టుకుని వొచ్చావోయి?"

గోపాత్రుడికి చిరాకేసింది.

"ఏటండీ! నేను దండోరా వేయించడవేమిటండీ. మీతోబాటు నేనుగూడా నవ్వుల




పాలయ్యాను. అల్లుడు రాజబాబులేడూ... మజ్జివలసరాజు. మనం నిన్న ఆళ్లందర్నీ కార్లోపంచి డాక్టరు దగ్గిరకెల్లాంగదా! అప్పుడీ పనిలేనిరాజు కూపీలాగేసేడండి. రాత్రిరాగానే భోజనానికైనా పోకుండా పెదసావిట్లో కూచుని దారంటపోయే పెతివాడికీ ఈ సంగతి చెప్పేడండీ. నేను కిరాణాకొట్టుకని బైలెల్లీసరికి సావిట్లో రాజులు పిలిచారండి. మాకంతా తెలిసి పోయిందీ ... నిజం చెప్పేమన్నారండి. చిరంజీవి బాబులేడండీ? ఆయనగారు మరీ నండీ. అంతమంది రాజులు గూర్చోని నిజంచెప్పు నిజం చెప్పమంటే నేనేం జేసే దండి. కానీ కలగాడ గోర్జి సంగతి మాత్రం చెప్పలేదు. మీ దద్దయ్యలీమద్దిన మరీ పోరంబోకుల్లాగ తయారవుతున్నారండి– మీరేవంటే అనుకొండిగానీ" అన్నాడు గోపాత్రుడు.

ఫకీర్రాజు రెండు చేతుల్తోనూ చికాగ్గా ఒకేసారి మీసాలు సర్దుకున్నాడు.

"సాయంత్రానికల్లా రెండుమూడు జిల్లాల్లోనిరాజులందరికీ ఈ భోగట్టా తెలిసి పోతాదండి. కొంతమంది దద్దయ్యలు ఇదే పనిమీద డబ్బులు కరుసుపెట్టుకుని బెలెల్లినా ఆశ్చర్యం లేదండి" అని గోపాత్రుడు మళ్లీ అన్నాడు.

ఫకీర్రాజు అప్పటికీ ఏమీ అనలేదు.

"తెలీనీవోయి మనకేమి లాసుగా? తెలీనీ. వైద్యం అంటే ఏవిటో తెలీని మూరపు మనుషులు నవ్వుతారు. తెలీనీ. మనకేమీ మనకేవి?" ఫకీర్రాజు ఆగ్రహం అంతా లోకంలో ఇతరులగురించి పట్టించు కునేవాళ్లమీదికి తిరిగిపోయింది.

"ఎవడిబతుకు అతడు బతుకుతాడు. ఎవడి వైద్యం అతడు చేసుకొంటాడు. ఊరందరికీ ఇందు గురించి ఆక్షేపణేమి? మనం ఎప్పుడైనా ఒకరిదుకుపోయావా? ఒకరి జోలికి పోయావా? ఒకరినెప్పుడైనా పదుగుర్లో ఆక్షేపించావా? లేదే. మన మీదెందుకోయి లోకం ఇలాగ పగబట్టింది? ఆశ్చర్యవోయి..ఆశ్చర్యం''

''లోకం తీరే అంతండి. జులాయి లోకం" అన్నాడు పాత్రుడు. ఒక నిమిషం ఎవరూ మాటాడలేదు.

రాజావారి ఆగ్రహం తగ్గుతున్నట్టు పసిగట్టిన కుక్కలు తోకల్ని మళ్లీ బైటకుతీసి స్వేచ్ఛగా ఎందుకైనా మంచి దని పరిమితమైన స్వేచ్ఛతో వూపాయి.

"అన్నట్టు పొద్దున పనిమీద బస్టాండుకు వెళ్లేనండి. కొత్త అనకాపిల్లి బస్సులోనుంచి కలగాడ అప్పలనాయుడు వాళ్లు దిగేరండి. ముసిల్ది దిబ్బకొక్కులా వుందండి"

"ముసిల్ది ఎలా చస్తే మనకేమి? బతి కింది. అదే చాలు! లేపోతే మన అబోరు పక్కేదికాదు. జరిగిందేదో జరిగింది. ఇంక నువు నాకు ఔషధాల విషయంలో సలహాలు ఇవ్వద్దోయ్"

గోపాత్రుడు మాట్లాడలేదు. ఉంగరాల జుత్తు సర్దుకున్నాడు. చేతికి అంటిన చమురు షరాయికి తుడుచుకున్నాడు.

"పాత్రుడూ ! సేరీ వేటకు వొస్తా వేటోయి?" నెమ్మదిగా అడిగాడు ఫకీర్రాజు.

"ఆ ఒక్క వ్యసనం నాకు అంటించ కండి బాబూ! మీకు పున్నెం వుంటాది"

"రెండు రాత్రుల కేంపు. మాంచి సరదాగా వుంటుంది. మా బావ గొప్ప పోటుగాడు. కొత్తవలసపొలం మీద అడివి పందులు మాంచి జోరుగా తిరుగుతున్నా యని మన్నెపువాళ్లు వర్తమానం పంపేరు. ఇవాళ మధ్యాహ్నం వెళ్తాం.

రాత్రిపూట సేరీవేట,పగలు పిట్టలవేట... కొత్తవల్స కొండ చెరువులో బెగ్గొరులు, నత్తకొట్లు, బేపనబాతులు, పుష్కలంగా వున్నాయిబోయ్... గొప్ప కాలక్షేపం. చిన్నరాజులందరొస్తారు"

"నాతరంకాదు ఫకీరుబాబూ! దివాణానికి దయుంటే ఎప్పటిలాగే ఓ వాటా మాంసం బంపండి''

"గాడిదగుడ్డూ.... వేటకి రానివాడికి వాటాలు పంపరాదని నేను ఇంక పట్టుబడతానోయి. వేటకైనా రావాలి, కుక్కనైనా పెంచాలి. అప్పుడే వేట మాంసంలో వాటా"

"రాజుల్తో సావాసం జేస్తే జేసేపు గానీ వేటజోలికీ, పేకాట జోలికీ వెళ్ళొద్దని మా నాయిన సేతల సెయ్యి వేయించుకున్నాడండి"

"వేటకెళ్ళొద్దు గానీ పందిమాంసం దొబ్బితిసరా కొడుకా అని మీ నాయిన జెప్పేదేటి? హరిశ్చంద్రుడంతటివాడు వేటజేసేడోయి. నువ్వెంత..నీబతుకెంత?"

"తమరు కాకనే కాదంటే తప్పించుకోలేను. కానీ ముందే జెప్పేస్తున్నాను. నా చేతుల్తో నేను పందినిగాని, పిట్టనుగాని చంపను"

"ఏడిచావులేవోయ్! పందిని చంపటం అంటే అంత ఆషామాషీవ్యవహారం అనుకొన్నావేమిటి? ఎంత పరాక్రమం కావాలి? నీ తరవా ? సరేగానీ మధ్యాహ్నం మూడయ్యేసరికి ఇక్కడికిరా. అందరూ ఇక్కడ్నించే బయలుదేరతారు. ఖాకీ నిక్కరూ, కమీజూ వుంటే పట్టుకురా. ఎందుకైనా మంచిది. ఒక దుప్పటి తెచ్చుకో"

"తలగడండి? తలగడా, బిషాణా తెచ్చుకోవద్దా?"

"ఆ...ఆ...ఆ... అవ్వీతెచ్చుకో! వీలైతే నీ ముండని కూడా తెచ్చుకో. బుద్ధి లేకపోతే సరి. వేటాడ్డానికి వెళ్తున్నామోయ్ పడుకోడానిక్కాదు.... తెలిసిందా? వేటగాళ్ళంతా ఏ తెల్లవారుజామునో జింఖానాల మీద పడుకుంటారు. వెళ్ళు మరి''

"మీర్జా పెదబాబుగారేరండి? బైటకు రాలేదు''

"మా బావా ? మహాభక్తుడోయి. స్నానం అయిన తరువాత ఓ గంటయినా జపం చేసుకోందే బైటకు రాడోయి''

వేటకుక్కలతోనూ, ఈటెలతోనూ సాగే వేటని సేరీ వేటని ఆ ప్రాంతంలో అంటారు. వేటసాగే ప్రదేశాన్ని పొలం అని వ్యవహరిస్తారు. సాధారణంగా పది పన్నెండు కుక్కల్ని తీసుకుని ఓ పది పదిహేను మంది వేటకు బయలుదేరతారు. వాళ్ళలో ముగ్గురు నలుగురు పోటుగాళ్ళుంటారు. వాళ్ళ దగ్గిరే ఈటెలు వుంటాయి. మొత్తం వేట కుక్కల్లో అడవి జంతువు వాసనని పసికట్టగలిగిన కుక్క ఒకటే వుంటుంది. దాన్ని గాలి కూన అంటారు. వేట పొలంలో గాలి కూన ముందు నడుస్తూ జంతువు వున్న దగ్గరికి వేట జట్టును తీసుకు వెళ్తుంది. వేటకుక్కల మెడకు తోలు పట్టీలుంటాయి. వాటికి ఇతడి రింగులుగానీ, ఉక్కు రింగులు గానీ వుంటాయి. ఆ రింగులో నుంచి పొడవయిన తాడు దూర్చి ఆ తాడు రెండు కొనలూ కుక్కను నడిపించే వేటగాడు చేతిలో పట్టుకుంటాడు. జంతువు దగ్గరవుతున్నకొద్దీ గాలి కూనని తాడుతో పట్టుకుని ఆపటం ఇబ్బందికరంగా తయారవుతుంది. ఆ కుక్క ఉరుకును బట్టి,




ఆవేశాన్ని బట్టి జంతువు ఎంత దగ్గిరలో వుందో వేటగాడికి అర్థమైపోతుంది. ఆ దశలో చేతిలో వున్న తాడు రెండు కొసల్లో ఒకదాన్ని విడిచేస్తారు. కుక్క కట్టు విడిపోయి తాడు వేటగాడి చేతిలో మిగిలిపోతుంది. ఈ రకంగా వేట పొలం మీద కుక్కను విడిచి పెట్టడాన్ని చూత అంటారు. ముందుగా వదిలిన గాలికూన జంతువును కనుక్కుంటుంది. అంతలో మిగిలిన కుక్కలొచ్చి దాన్నికలిసి నాలుగు వైపులనుంచీ జంతువును చుట్టుముడతాయి. ఈలోపున ఈటెలు ధరించిన పోటుగాళ్లు కూడా వచ్చి చేరతారు.శిక్షణపొందిన కుక్కలువేటగాడికి జాగా యిస్తూనే జంతువుని నానా అల్లరీ పెడతాయి. వేటగాడు ఈటె ఎత్తి పట్టుకొని మెరుపులాగ కదిలి, ఉరిమినట్టు కేక వేసి, పిడుగుపడినట్టు పందిమీద దాడి చేయాలి. ఈటె మొన పంది శరీరాన్ని తాకుతున్నదనగా ఎగిరి తన మొత్తం బరువునీ,బలాన్నీ ఈటె మొనపై కేంద్రీకరించి జంతువు పైనుంచి అటువైపుకు దూకాలి. ఆ బరువుకు, బలానికీ ఈటె మొన జంతువు శరీరంగుండా దూసుకుపోయి మట్టిలో గుచ్చుకోవాలి. జంతువు భారీయైనదైతే మరో ఈటెతో దాడిచేయాలి. ఒంటిపంది అయితే చాలా బలంగా, సాపుగా వుంటుంది గనుక ఈటెతో వెళ్ళే మనిషికి ప్రమాదమే. కాని మంచివేటగాడు ఒంటి పందిని కూడా అదే ఒడుపుతో చంపగలడు.

ఒంటిగంటన్నర అయ్యే సరికి గోపాత్రుడు మూడుగుర్రాల బీడీప్రకటన ఉన్న ఓ సైను సంచి పట్టుకొని ఫక్కీరాజు ఇంటి ప్రహరీగేటు దాటి ఆవరణలో అడుగుపెట్టాడు.

అప్పటికి అక్కడ వేటగాళ్లంతా దాదాపుగా జమకూడారు. బొబ్బిలితో సహా ఎనిమిది వేటకుక్కలున్నాయి. దుంపల దత్తుడు గాలికూనతోసహాతూర్పుసోఫాలో కూర్చుని బీడీ కాలుస్తున్నాడు. పికిలిపిట్ట అనే మారుపేరున్న ఒకరాజు జోడు బారల తుపాకీ, చేత్తోకట్టిన తూటాలు ఓ సంచీడు పట్టుకొచ్చాడు. చిరంజీవి ఒంటి బారు రైఫిల్ పట్టుకున్నాడు.

ఫక్కీరాజు ఇంటిముందున్న సువర్ణరేఖ మామిడిచెట్టు నీడలో పడకకుర్చీ వేయించుకుని మీర్జా పెద్దబాబు హుక్కా పీల్చుతున్నాడు.

ఆదరాబాదరాగా వస్తున్న గోపాత్రుడ్ని చూసి చిరంజీవి నవ్వాడు. "వో...వో... చూడండోయ్. గోపాత్రుడు యమ స్పీడుగా వచ్చేస్తున్నాడు" అని ఇతరులకు చూపించి, పాత్రుడు కాస్తదగ్గరకురాగానే-

"ఏవోయి పాత్రుడూ! కొంపదీసి నువ్వూ వేటకేనేటి?" అని అడిగాడు.

పాత్రుడు పళ్ళన్నీ బైట పెట్టి,సంచీతో సహా రెండు చేతులూ వెనక్కి పెట్టుకుని "అవునండీ" అన్నాడు.

చిరంజీవి పగలబడి నవ్వేడు "ఇకనే వోయ్..ఇకనేం? నువ్వూ, ఫకీరుమావ్యా చెరికో సిరంజీ పట్టుకొని బయలుదేరండి. మరేవోయ్... మనం తుపాకులూ, ఈటెలూ పట్టుకెళ్ళొద్దు. ఈసారి వేటా, పోటూ అంతా ఇండిసన్ సూదుల్తోనే అయిపోతాది. మనం జంతువు నాలుక్కాళ్ళూ పట్టుకుని కలిపికట్టేసి తీసుకొస్తే పాత్రుడు ఇండిషన్ ఇచ్చేస్తాడు. ఒంటి పందిగాడు దాన్ని బాబైనాసరే గుడ్లుతేలేసేసి తిరగబడి చచ్చిపోతాది"

అక్కడున్న రాజులందరూ నవ్వేరు.

"ఊరుకుందురూ. చిన్నరాజులకి మరేం పనీపాటూ లేకుండుంది" అన్నాడు పాత్రుడు.

అల్లుడు రాజబాబు పాత్రుణ్ని పిల్చి, "ఆ కలగాడ ఇంజీషను పట్టుకొస్తున్నావా?" అని అడిగాడు పెద్దమనిషి తరహాలో.

రాజులంపరూ మళ్ళీ గట్టిగా నవ్వేరు.

మీర్జా పెదబాబు, దుంపల దత్తుడు, చిరంజీవి, ఫక్రీరాజు మరోముగ్గురు చిన్నరాజులూ కారులో బయలుదేరారు.

గోపాత్రుడు మిగిలిన వేటగాళ్ళతోను, కుక్కలతోను కలిసి బస్టాండుకు నడిచాడు.

బస్సెక్కి కొత్తవలసలో దిగి టీలు తాగి, బీడీలూ, సిగరెట్‌లూ కొనుక్కొని నెమ్మదిగా నడుస్తూ వాళ్ళంపరూ బంజరుకు చేరుకునేసరికి అంధకారమైపోయింది.




"కుక్కను పట్టుకుంటావా? ఈటె పట్టుకుంటావా?" అని గోపాత్రుణ్ని అడిగాడు ఫక్రీరాజు.

ఈటయితే మొయ్యాలి. ఖర్మంగాలి దారిలోఏపులో,సింహమో ఎదురైతే 'చూస్తావేమోయ్ పాత్రుడూ! పొడూ' అంటారు వద్దయ్యాలు. ప్రాణ గండం. "కుక్కనే పట్టుకుంటాను బాబూ" అని అంతవరకు ఫక్రీరాజు దగ్గిరున్న బొచ్చిలి తాడు అందుకున్నాడు గోపాత్రుడు.

ఫక్రీరాజు, మీర్జా పెదబాబు, చిరంజీవి, అల్లుడు రాజిబాబు, కుమందాస్ ఈటెలు పట్టుకున్నారు.

గోపాత్రుడు, దుంపల దత్తుడు, పికిలిపిట్ట మొదలైనవాళ్లు కుక్కల్ని పట్టుకున్నారు.

పదిగంటల రాత్రయింది. వేటజట్టు బసనుంచి బయలుదేరింది. కొత్తవలస బంజరని అందరూ పిలిచేది నిజానికి నాలుగువందల ఎకరాల మామిడితోట. కొండల వారనే వుంది. తోటకీ, కొండకీ మధ్య కొండ గెడ్డల వల్ల నేల కోసుకుపోయి పెద్దపెద్ద లోయల్లాగ తయారైన నేలవుంది. తోటకి ఇటూ అటూ వేరు శనగ చెలకలున్నాయి. బంజరు తోటలో తూర్పున ఒక పెద్ద కమ్మలపాక వుంది. మామిడికాయల కాలంలో తోట సొంతదార్లు అందులో మకాం వేస్తారు. వేటజట్లు వచ్చినపుడు అందులోనే వుంటాయి. దాన్ని సాధారణంగా బస అంటారు.

బసనుంచి బయలుదేరిన వేటజట్టు తూర్పువైపే నడిచి తోట చుట్టూ వున్న జీడి మామిడి చెట్ల కంచె దాటింది.

చీకటి చిక్కగా వుంది. మిణుగురు పురుగులు జట్లు జట్లుగా చప్పుడు చెయ్యని దీపాల్లాగ చల్లగా ఎగురుతున్నాయి. కొండలమీంచి గాలితెరలు జాగిలాల్లాగ దూకుపోతున్నాయి.

'ఊ, ఊ, ఊ' అంటోంది టేకు చెట్టుమీది బండిగూడు పిట్ట. వేటజట్టు, కుక్కలూ కదుల్తున్న అలికిడి విని అంతవరకూ వేరుశనగ చేలో చిగుర్లు కొరుకుతున్న చెవుల,పిల్లులు రెండు నీడల్లో నీడలు కలిసినట్టు రెండు దూకుల్లో మాయమయ్యాయి.

ఈటెదార్లంతా ఒక దగ్గిర చేరేరు.

ఎందుకక్కడ ఆగారో, ఈ వేలు పట్టుకున్న రాజులందరు ఒక దగ్గిర ఎందుకు గుమిగూడారో అర్థంకాలేదు గోపాత్రుడికి.

కుమందాస్ నిక్కరు జేబులోంచి ఓ పొట్లం తీసి విప్పాడు.

ఈలోపుగా మరో వేటగాడు కింద దొరికిన నాలుగయిదు చిదుకులు ఏరి ఒక దగ్గిర పోగేసి మంటపెట్టాడు. చేతిలోని పొట్లంలోంచి ఇంత పొగమందు తీసి ఆ మంటలో వేశాడు కుమందాస్.

గుగ్గిలపు వాసన్ను పోలిన వాసనతో దట్టమైన పొగలేసింది. ఈ వేలన్నీ ఆ పొగ తగిలేలాగ పెట్టారు. చేతులతో ఆ పొగ కుక్కలకి కూడా తగిలేట్లు విసిరారు.

సేరీ వేటగాళ్ళకి కొన్ని నమ్మకాలుంటాయి. అందులో మంత్రాల మీద, పొగల మీద నమ్మకం ఒకటి. ఒక పొలం మీద పరాయివాడికి వేట సాగకుండా పొగ బెట్టటం అందులో ఒకటి. చుట్టుపక్కల గ్రామాలలో వున్న ఏ వేట జట్టయినా అలాంటి పొగబెడితే తమకు వేట సాగదు గనుక ఆ పొగను విరుగుడుగా వేట పొలం మీద అడుగు పెట్టేముందు సేరీవేట జట్లన్నీ దాదాపుగా ఇలా పొగ పెట్టి ప్రతిక్రియ చేస్తాయి.

"సిగరెట్లు, బీడీలూ కాల్చేవాళ్లు గబగబ కాల్చేసుకోండోయి పాత్రుడూ... నీకు వేట కొత్త. పొలంమీద మాట్లాడకూడదు. నాకు చెడ్డ చిరాకు, తర్వాత కుమందాస్ బాబు కొట్టేడంటే వూరుకోను" అన్నాడు కుమందాస్.

అలాగేనని తల వూపాడు పాత్రుడు.

"పాత్రుడూ! నీకు చెట్టెక్కడం వచ్చా?" అని చిరంజీవి అడిగాడు.

"ఏవండి?"

"ఏంలేదు. వేటగాడికి చెట్టెక్కడం రావాలోయి. అలమంద దద్దయ్యల సూత్రంలే. నిన్ను వెటకారించడానికి అడుగుతున్నాడు చిరంజీవి. భయపడి చెట్టెక్కేస్తావేమోననే అనుమానం" అని మీర్జా పెదబాబు వివరించాడు.

"నాకా? బయ్యమా?....హు... నేను గోపాత్రుడినండి... ఏటనుకుంటున్నారు. ఉక్కుగుండికాయండి నాది" అని పాత్రుడు పౌరుషంగా అన్నాడు.

"ఊ....ఇంక నడవండి" అన్నాడు కుమందాస్.

"ఊ... ఊ... ఊ... ఊ... ఊ..." అన్నాది బండిగూడుపిట్ట. వేటజట్టు నడక మొదలయింది.

ఎండు పుల్లలేవో కాళ్ళ కింద చిట్లుతున్నాయి. కుక్కలు నిరాసక్తిగా నడుస్తున్నాయి.

ఎవరూ మాట్లాడటంలేదు.

పాత్రుడి ముందు నడుస్తున్న బొబ్బిలి ఆ చీకట్లో దెయ్యంలాగున్నది.

కళ్లు చిట్లించుకొని నడుస్తున్న వారిని చూస్తూ ముందుకు వెళ్తున్నాడు పాత్రుడు.

ఏంవేట?

కాళ్లు పీకులుగాని.

మాటాడగూడదట.

సిగరెట్టు కాల్చగూడదట.

మనకేం ఖర్మ రాసోడికంటే తప్పేడుగాని?

అందరికంటె ముందు నడుస్తున్న దుంపల దత్తుడి గాలికూన ఒక్క క్షణం ఆగి మోర ఎత్తి ఇటూ, అటూ చూసి తరువాత నేల వాసన చూస్తూ మళ్ళీ నడవటం మొదలుపెట్టింది.

అలా వాళ్లు అరగంటపైన నడిచారు.

శెనగచేలు దాటి కొండ గెడ్డల ప్రాంతంలోకొచ్చారు. గెడ్డల్లో మెత్తటి ఇసుక వుంది. అది ఆ చీకటిలో తెల్లటి బాటలాగ కనిపిస్తోంది.

"పాత్రుడూ! సున్నపు రాళ్ళ మీద కాలూరిపోగల్దు. జాగర్తోయి'' అని గోపాత్రుడి చెవిలో చెప్పాడు అతని వెనుక నడుస్తున్న పక్కీరాజు.

''ఇదేం వేటండి ... రెండుగంట లయింది బైలెల్లి. ఒక్క పందిని కూడ మనం పొడవలేదు"

"వేటకి నువ్వొచ్చావని ఈపాటికి తెలుసుకోనుంటాయి. ఇక బయలుదేర తాయి పందులు. మాట్లాడకు. కుమందానికి చిర్రాకెక్కువ'' అన్నాడు పక్కీరాజు.

దుంపలదత్తుడు ఆగాడు. ఎడమచేతిని ఎత్తి ఆగండి అన్నట్లు సంజ్ఞ చేశాడు.

జట్టంతా ఆగింది.

గాలికూన. వెనక కాళ్ళ మీద నిలబడి గుర్ గుర్ మంటోంది సన్నగా. 'జంతువు'



అన్నాడు చాలా సన్నగా ఫకీర్రాజు పాత్రుడికి మాత్రమే వినిపించేటట్టు.

ఏం జంతువో?

పాత్రుడు కనపడినంత మేర చూశాడు కళ్ళు చిట్లించి.

చీకటి. తుప్పా, డొంకా, తాటిచెట్లు.

గాలి కూన నడక దిశ మార్చింది. మామిడి తోటవైపు తిరిగి లాగింది.

ఎందుకోగాని అది తొందరపడుతోంది.

జంతువునే పసిగట్టిందో, ఏదో ఆడ కూన గాలినే పసిగట్టిందో అనుకున్నాడు గోపాత్రుడు.

అంతవరకూ తీరికగా నడిచిన బొబ్బిలి కూడా వేగం పెంచింది.

కుక్కలన్నీ ఆతృత కనపరచటం మొదలెట్టేయి.

సున్నపురాళ్ళ గట్లపైనా, ఇసుక గెడ్డల్లోనూ ఆ చీకటిలో కుక్క వెనకాల నడవటం పాత్రుడికి ఇబ్బందికరంగా వుంది.

కుక్క వెనకాతల మనం నడపటం ఏవిటో, మన వెనకాతల కుక్క నడవాలి గాని! అయిదు గెడ్డలు దాటిన తరవాత పెద్ద బయలు. అది దాటిన తరవాత బంజరు. ఆ బయల్లో పెద్ద పెద్ద బలుసు దంపలున్నాయి. అక్కడోటీ అక్కడోటి ముడిమామిడిచెట్లు జీబుగా అలుముకుని వున్నాయి.

ఒక్కొక్కపొదా ఒక ముసుగుదొంగ లాగ కనిపిస్తున్నది ఆ చీకటిలో. గాలి కూన నడకవేగం మునుపటికంటే బాగా పెరిగింది.

తాను లాగేసుకుని ముందుకు దూకడానికి అది ప్రయత్నిస్తోంది. ఫకీర్రాజు పాత్రుడి భుజం తట్టి అతన్ని తప్పించుకుని ముందుకు నడిచాడు.

ఒక గుంటనక్క అంత దూరాన వున్న బలుసు పొదలో చటుక్కున నక్కేసింది.

గాలి తోటలోంచి దూసుకుని వస్తున్నది. రెండు నిముషాల్లో వేట జట్టంతా మళ్ళీ మామిడితోటలోనే ప్రవేశించారు. ఎండిపోయిన ఆకులు కాళ్ళకింద నలుగుతున్నాయి. తోటలో చీకటి మరింత గుబురుగా వున్నది.

బొబ్బిలి ఒక్క లాగులాగి పరుగు మొదలుపెట్టింది. గోపాత్రుడు తూలిపడబోయి తమాయించుకున్నాడు. అతను కుక్క వెనకాల గుంటుపరుగు మొదలు పెట్టవలసి వచ్చింది.

మొత్తం జట్టంతా గుంటు పరుగు పెడుతోంది.

పడమటి వైపునుంచి సర్‌సర్‌సర్‌మని ఏదో భారీ జంతువు పరిగెడుతున్నట్టు చప్పుడు వినిపిస్తోంది: 'ఆఁ' అన్నాడు కుమందాన్ ఈటె కుడిచేతితో గట్టిగా పట్టుకుని ఆ వైపు పరిగెడుతూ.

బొబ్బిలి గుర్రుగుర్రుమంటూ కూపుడి పడిపోతున్నది. దాని చెవులు రిక్కపొడుచుకున్నాయి. మెడమీదా, మూపు మీదా దాని చర్మం అలలు అలలుగా విరుచుకుపడుతున్నది. అక్కడి జూలు లేచి వెంట్రుకలు నిక్కబొడుచుకున్నాయి.

ఏం జరుగుతున్నదో పాత్రుడు అర్థం చేసుకునే లోపలే దుంపల వత్తుడు గాలి కూనని దూసేశాడు. మిగిలిన వేటగాళ్ళు తమ దగ్గరున్న కుక్కల్ని వదిలేశారు. అది గమనించేసరికే బొబ్బిలి పాత్రుణ్ని ఒక్క గుంజు గుంజింది. గోపాత్రుడి చేతిలోని తాటికొనలు జారిపోయాయి. బొబ్బిలి రెప్పపాటులో చీకటిలో కలసిపోయింది.





మొత్తం వేటదార్లంతా పరుగు మొదలుపెట్టారు. ఒక్క క్షణం ఆల స్యంగా పాత్రుడువాళ్ళని అనుసరించాడు.

మామిడిచెట్ల మీది కాకులు కంగా రుగా అరుస్తూ ఎగిరిపోయాయి.

"టివ్ టివ్ టిటిటిట్...

టివ్ టివ్ టిటి టిట్" అని అరుస్తూ ఒక తీతువ పిట్ట గాళ్ళ తలలమీంచి వెళ్ళి పోయింది. పిట్టగోరలు గోలగోలగా అరుస్తూ చెల్లాచెదరైపోయాయి.

వేగంగా పరిగెడుతున్న పాత్రుడు ఒక రాయిని తన్నుకుని పడిపోయాడు. మిగిలినవాళ్లు తమ వేట తమకంలో పాత్రుణ్ని గమనించలేదు.

కిందపడిపోయిన పాత్రుడు తేరుకుని ఒళ్ళు దులుపుకుంటూ లేచి నిల్చుని దిక్కులుచూసేసరికి వేటగాళ్ళ అడుగుల చప్పుడు మాత్రం వినపడుతోంది.

పాత్రుడు మళ్లీ పరిగెత్తటం మొదలు పెట్టి ఒక ఎకరామేర పరిగెత్తి ఆగిపో యాడు.

ఒగుర్చుకుంటూ మామిడిచెట్ల మధ్య నిల్చుండిపోయాడు. కొంతదూరం నడిచి హఠాత్తుగా ఆగిపోయాడు.

సర్‌సర్‌సర్‌మని చీకటిలో ఏదో జంతువు పరిగెత్తిన శబ్దం వినిపించింది.

నిల్చున్న చోటనే వంగి చెట్లకిందనుంచి చూశాడు. ఏమీ కనిపించలేదు.

ఎండిన మామిడాకుల మధ్యనుంచి ఏ పామో పాకురుతున్న శబ్దం వినిపిం చింది.

'బయ్యవేసేలాగుంది' అనుకున్నాడు పాత్రుడు భయపడుతూ.

"కుయ్యో" మని దూరంనుంచి ఒక వేటకుక్క ప్రాణభయంతో అరిచింది.

ఒక్క క్షణం నిశ్శబ్దం.

పాత్రుడు ఏమీ ఆలోచించకుండానే దగ్గరగావున్న ఒకమామిడి చెట్టు ఎక్కి పోయి కూర్చుని సిగరెట్టు వెలిగించాడు.

దూరం నుంచి వేటకుక్కలన్నీ గోల గోలగా మొరుగుతున్నాయి. గోపాత్రుడు చెట్టుకొమ్మని గట్టిగా వాటేసుకుని కూచు న్నాడు. సిగరెట్ చేతుల్లోంచి జారిపో యింది. చెట్టుకింద పడింది.

ఆళ్ళంతా మళ్ళీ ఈదారిన వస్తారో రారో?

వస్తారో రారో ఆళ్ళందరు?

సర్...సర్....మని ఏదో జంతువు పరిగెడుతున్న శబ్దం మళ్ళీ. సన్నగా చెమట పడుతోంది.

కళ్లు చిట్లించుకుని చూస్తున్నాడు.

ఏమీ కనిపించటంలేదు.

బరువైన జంతువేదో పరిగెత్తుకుంటూ అటే వస్తోంది.

ఏ పులో?

ఏ సింహమో?

ఏ ఎలుగుబంటో?

ఎందుకైనా మంచిదని పాత్రుడు ఊపిరిపీల్చటం మానేశాడు. ఎలుగుబంటి అయితే గోళ్లుపెట్టి బక్కరిసి కండలుపీకేసి పమ్ములు సమిలేస్తాదంటారు.

గోపాత్రుడికి జడుపుపట్టుకుంది.

కళ్లు చిట్లించుకొని అలాగే చూస్తు న్నాడు.

ఎత్తయిన నల్లని ఆకారం ఒకటి అంత దూరాన ఆగివుంది. ఓలమ్మ ... ఎంతన్నాదో !

నాకోసవే గావాలా దేవుడా ఎతుకు తున్నాది.

అరిచేతులకు చెమటలుపడుతున్నాయి.

పెద్దనక్కలాగుంది. పెద్దనక్క ఎలా వుంటాదోగానీ...

దుమ్ములగొండంటారు...అదెలాగుం టాదో....

ఆ ఆకారం కదిలి పాత్రుడు ఎక్కి కూచున్న చెట్టువంక నడవటం మొద లెట్టింది.

అయిపోయింది మనపని.

చెట్టుకిందకే వచ్చి నిల్చున్నాది.

'కొంపదీసి, ఇంతాజేసి మన బొబ్బిలి గావోసు....అలాగేవుంది' అని పాత్రుడు అనుకొంటుండగానే–

"చెట్టు దిగవోయి గోపాత్రుడూ" అంది బొబ్బిలి.

"ఓస్.... నువ్వేనేటే! ఏ పులో అను కున్నాను" అన్నాడు గోపాత్రుడు చెట్టు దిగుతూ.

"ఈ ప్రాంతాల్లో పులులుఉండవుగానీ నువు చెట్టెందుకు ఎక్కేవోయి?" అని అడిగింది బొబ్బిలి.

అది చిన్నప్పటినుంచీ తూర్పు రాజుల ఇళ్లలో పెరిగినందువల్ల దానికి ఆ భాష, ఆ వరవడీ పట్టుబడింది.

పాత్రుడు ఆ ప్రశ్నకు సమాధానం చెప్పలేదు. "ఆళ్ళందరేరీ?"

"ఒస్తారొస్తారు" అన్నది బొబ్బిలి గంభీరంగా.

"నేను చెట్టుమీదున్నానని నీకెలాగ తెలుసే?"

"నీ దగ్గిర అవుషధాల వాసనేస్తోం దోయ్. పసిగట్టేను"

"వైద్యుడి దగ్గిర ఔషధాల వాసన రాదేటిగానీ, వేట అయిపోయిందా?"

"ఒంటిపంది కనిపించిందోయ్. మా గానమైన ఒంటడి. ఆలమంద అంపకెకీ పలావుకు సరిపోతాది"

"మరేం. ఒంటిపంది కనబడితే నువ్విలా గొచ్చీసేవేటి? మీదపడి, మెడ బట్టుకుని కరిచేసి, చంపేసి, కొరికేసి చంపీపోయావా?"

"నీకు వేటసంగతి ఏం తెలుసోయి పాత్రుడూ! ఇంతలేసి పన్నుంది. ముట్టితో గానీ కొట్టిందంటే మన డొక్క చిరిగి పోతుంది ఏటనుకుంటున్నావోగాని. సెడ్డ దేంజరు. మనం అంత దూరం నుంచే దేంజరు అని కనిబెట్టి ఇలాగొచ్చీసేం" అన్నాది బొబ్బిలి.

"ఛీఛీ...బయపడి ఇలాగొచ్చీసేవా? నువ్వేం వేటకుక్కవి?"

"బయ్యవేసి చెట్టెక్కిపోయిన వేట గాడికి నాపాటి కుక్క చాల్దేటి....! నీకు వేట కొత్తగాబట్టి అలాగ అనీసేవు గానీ ఒంటి పంది మీదికీ, పిల్లల్ని తిప్పు తున్న పెట్టపందిమీదికీ, ఏదు పంది మీదికీ వేటకుక్కలు వెళ్ళకూడదోయి. ప్రాణా పాయం"

సడక్, సడక్, సడక్‌మని చీకటిలో నుంచి చప్పుడు వినబడుతోంది.

'ఏమిటి చెప్మా' అని పాత్రుడు చూస్తు న్నాడు.

బొబ్బిలి చెవులు రిక్కించి జాగ్రత్తగా ఆ చప్పుడు విన్నది. సడక్ సడక్ సడక్‌మని బరువైన జంతువు ఏదో పరిగెత్తివస్తున్న శబ్దం.

"పాత్రుడూ! ఒంటిపంది" అని హెచ్చరిస్తూనే బొబ్బిలి అనే పేరుగల ఆ భారీ వేటకుక్క పాత్రుడి భుజాలమీద కాళ్ళువేసి ఒక్కఉదుటున చెట్టెక్కి పోయింది.

మెరుపు వేగంతో పాత్రుడు కూడా చెట్టెక్కిపోయాడు. అతని గుండెలు ప్రళయ వేగంతో కొట్టుకుంటున్నాయి.

ఒకటి రెండు క్షణాల తర్వాత –

ఢూక్, ఢూక్ మంటూ నాలుగు





అడుగుల ఎత్తున్న ఒక భారీ ఒంటిపంది ఆ చెట్టుకిందనుంచి పారిపోయింది. దాని నిడివి చూసి పాత్రుడికి మతిపోయింది.

"చూసేవోయ్ గోపాత్రుడూ ... ఎంతుందో ఒంటిపంది? ముట్టితో కొట్టిం దంటే చచ్చే చచ్చిపోతాం. అది పరిగెడు తుంటే నేల చూసేవా ఎలాగ అదిరి పోయిందో...!" అన్నది బొబ్బిలి చెట్టు మీద నుంచి కిందకి చూకుతూ. అప్పటికి ఇంకా అడివిపంది పరిగెడుతున్న చప్పుడు అక్కడికి వినబడుతూనే వుంది.ఎందుకైనా మంచిదని పాత్రుడు చెట్టుమీదే వున్నాడు.

దూరంగా వేటగాళ్ళు తిరిగి వస్తున్న చప్పుడు వినిపించింది.

"చెట్టు దిగిపోవోయ్ గోపాత్రుడూ! రాజులు జూస్తే నవ్వుతారు" అన్నది బొబ్బిలి రెండు కాళ్ళ మీదా కూచుంటూ.

"ఆ...నవ్వుతారు నవ్వుతారు! మరేం పనిలేకపోతేసరి" అంటూనే పాత్రుడు చెట్టుదిగి సిగరెట్టు ముట్టించాడు.

"నువు ఒంటి పందిని చూసి భయపడి చెట్టెక్కిపోయిన సంగతి నేనెవరికీ చెప్పను లేవోయ్" అన్నది బొబ్బిలి.

"విశ్వాసం అంటే నీదే! నీకున్న విశ్వాసంలో సగంలేదు మీ రాజుకి" అన్నాడు గోపాత్రుడు.

"నిజవేకానీ నేను ఒంటి పందిని చూసి పారిపోయి వచ్చేసిన సంగతి కూడా నువు ఎవరికీ చెప్పకూడదు. ఏవంటావోయ్ పాత్రుడూ? ఇది మన రహస్య ఒప్పందం" అన్నది బొబ్బిలి. అప్పటికి వేటగాళ్ళ మాటలు వినిపిస్తు న్నాయి.

ఎవరికీ చెప్పనన్నాడుగానీ పాత్రుడి. నిజాయితీమీద బొబ్బిలికి నమ్మకంలేదు.

వేటపొలంమీద నడుస్తూనే పాత్రుడు పక్షిరాజుతో ఏం చెబుతున్నాడోనని ఓ చెవి అటు పారేసింది.




'చేతిలో ఈటె లేకపోవటంవల్ల ఇంతపని జరిగిందండి ... నాకు కొత్త గదండీ మీ పరుగు అందుకోలేకపోయాను. వెనకబడిపోయి, ఇంకెందుకులే అని నిల బడిపోయాను. చీకటి...గాఢాంధకారం గుందండి. నేను గాబట్టిగానీ మరొక డయితే జడుసుకుని ఏ చెట్టో ఎక్కే సును. అలాగ నిలబడి చూస్తున్నానండి. ఘూక్ ఘూక్మని పారొచ్చిందండి ఒంటి పంది. మీ బొబ్బిలి...మన బొబ్బిలి ఆ పందిని తరుముకొచ్చిందండి. ఇదేంటా ఘూక్ ఘూక్మంటున్నాదని నేను చూసే సరికి ఆ పంది నాకెదురుగ్గా వుందండి. చేతిలో ఈటుంటే పొడిచేసి పోదునండి. ఏటి సాధనం? కింద ఇంతకొవ్వు రాయుం దండి. అదితీసి కొట్టేసినండి. చెడ దెబ్బ కొట్టేసిన్నెండి. సూటీగా జూసి కడుపు మీదకి విసిరాను రాయి. పంది పారి పోయిందనుకోండి. కానీ అనుమానం ఏటంటే నా దెబ్బకి దాని కడుపు చీరుకు పోయి పేగులన్నీ బైటకి వొచ్చేసి వుంటాయి. కొండకేసి పారిపోయిందిగడ. రక్తం కారిపోయి బహుశా ఏ గడ్డలోనో నచ్చిపడి పోయుంటాదని నా అనుమానం.

గొప్ప దెబ్బ కొట్టేసేన్లెండి. పొద్దున లెగిసి మనం వెతుకుదాం"

గోప్పాత్రుడి కోతలు విని బొప్పిలికి నవ్వొచ్చింది.

మానవజాతే అంత అనుకుందది.

ఫక్కీరాజు అంతా విని, ఆగి ప్పాత్రుడి భుజంమీద చరిచి "కట్టిపెట్టవోయి కోతలు. ఒంటి పందిని బొప్పిలి తరుముకొచ్చిందా? ఒంటి పందిని చూసి తోక ముడుచుకుని అది పారిపోవటం నేను కళ్లారా చూసేను. పప...పొలంమీద మాట్లాడకూడదని వమందాస్ చెప్పలేదూ? మళ్ళీ మాత అయితే నువ్వు మాతోపాటురా. ఇందాకటి లాగ ఆగిపోవద్దు" అన్నాడు.

'తోక ముడుచుకుని పారిపోయేనా? ఏం చెపుతున్నావోయి ఫక్కీరాజు కబుర్లు! తోక నిషేపంలాగ, జాతీయ జెండాలాగ ఎత్తి పెట్టుకొని అక్కడ్నించి వచ్చేసేను. పోనీ నేను పారిపోతే ఈ పోటుగాళ్లంతా ఒంటిపందిని ఎందుకొదిలేయాలి? అలమంది వారికి ఆషేపణ ఎక్కువని అంపరూ అందికే అంటారు' అనుకుంది బొప్పిలి చిరాగ్గా.

అలా అనుకుంటూనే ఎవరకి చూసింది.

గాలివాన ఈమారు కొండవైపు లాగుతోంది.

ఈ పిచ్చిముండొకర్తి! ముందూవెనకా చూసుకోకుండా తోటి కుక్కలన్నిట్నీ ప్రమాదంలో పడేస్తుంది. ఏది ఒంటి పందో, ఏది పెట్టపందో, ఏది పందికూనో పసిగట్టలేనిది ఏం గాలికూనోయి. బుద్ధి లేకగాని.

మళ్లీ వేటపండు అంతా గాలివాన వెనకపడి మామిడితోట దాటి శెలకల మీదికి వచ్చింది.

ఇటూ అటూ జాగ్రత్తగా చూసుకుంటూ బొప్పిలి నడుస్తోంది. దూరంగా పట్టిరంగులోవున్న ఓ కుందేలు కనగచేలో ఒక్క గెంతుగెంతి అంతదూరాన పడటాన్ని చూసింది.

పరుగెత్తుకెళ్ళి పట్టేసుకోవచ్చు గానీ పంటికిందకు రాదు. తీరా మనం పట్టినా ఫకీర్రాజు బొమ్ముతాడు అనుకుంది బొప్పిలి.

దానికి ఆ చీకటిలో కూడా చక్కగా కనిపిస్తున్నది.

జంతువు వాసనేదో వొస్తున్నట్లుంది కానీ ఈ ఫక్కీరాజుదగ్గిరా, ప్పాత్రుడిదగ్గిరా మందుల కంపెక్కువగా వున్నది. దీని మూటుదగ్గిర జంతువునుంచి వచ్చే గుబ్బ వాసన సరిగా తగలదు అనుకొందది.

మరికొంత దూరం వెళ్ళేసరికి దానికి అడివిపంది వాసన తగిలింది.

మురరవాసన కాదు.

లేతపందే అయివుండాలి.

బొప్పిలికి తెలిసిందానే దాని నడక వేగం హెచ్చింది. మూపుమీదిజూలు రిక్కబొడిచింది. చెవులు, ముక్కు జంతువు వాసనకోసం, శబ్దంకోసం కేంద్రీకృతం అయ్యాయి. నోరు తెరుచుకుంది. అసంకల్పితంగానే గొంతులోంచి గుర్ర్ర్ మనే శబ్దం వస్తున్నది. ఛాతీదగ్గిర, కాళ్ళలో వున్న కండరాలు బిగుసుకుంటున్నాయి. నోటినుంచి చొంగకారటం ఎక్కువ అయిపోయింది.

క్షణక్షణానికీ బొప్పిలిని ఏదో ఉద్వేగం ఆవరిస్తున్నది.

జంతువు వాసన ఎక్కువ కావటం, అంతదూరాన జంతువు కనిపించటం ఒక్కసారే జరిగింది.

'ఆఁ' అన్నాడు దుంపలదత్తుడు గాలికూనని చూస్తూ.

ఈసారి అందరితోపాటే ప్పాత్రుడు

బొబ్బిలినికూడా సక్రమంగా చూశాడు. అతనిచేతిలో తాడు మిగిలిపోయింది.

అయిదుపిల్లలు, ఒకతల్లి.

కుక్కలవాసన పసిగట్టి ఆ తల్లిపంది ఘూక్‌మని పిల్లల్ని హెచ్చరించి పరుగు మొదలు పెట్టింది.

తనకు లాభమేగానీ ప్రమాదం లేదని గ్రహించిన క్షణంలోనే బొబ్బిలి ఒక దెయ్యపు కుక్కలాగ అయిపోయింది.

ఒంటిలోని శక్తినంతటిని కాళ్ళలోకి కూడదీసుకుని అది ప్రళయవేగంతో పరిగెత్తటం మొదలుపెట్టింది.

అప్పటికి గాలికూన, మరోకుక్క పెట్ట పంది వెంటపడ్డాయి.

పందులకదుపు శెనగచేలు వదిలికొండ గెడ్డలోకి దూకాయి.

వెనకాల వేటగాళ్లు పరిగెత్తుకుని వస్తున్నారు. బొబ్బిలి తక్కిన కుక్కల్ని అవలీలగా తప్పించుకుని కొండగెడ్డలోకి దూకి ఇసుకలో పడింది. రెప్పపాటులోనే తేరుకుని పందులు పరిగెత్తిన దారినపడింది.

ఇసుకలో పందుల కాలిగిట్టల ముద్రలు దానికి కనబడుతున్నాయి. వాసనకూడా తెలుస్తూనేవుంది. బొబ్బిలి గాలికూననీ, పందుల కదుపునూ కలిసే సమయానికి అవి కొండగెడ్డ రెండుగా చీలినచోట వున్నాయి.

బొబ్బిలి కళ్లు మెరిసాయి. తల్లి జోలికి మనకెందుకు? పిల్లలపని పట్టుదాం- అనుకుని అది భయంకరంగా అరిచి ఎగిరి పిల్లలమధ్య దూకింది.

తల్లి పంది కంగారుపడింది. దానికి ప్రాణభయంఎక్కువయిపోయింది. ఎడమవైపువున్న చీలిక కొండవైపు వెళ్తుందని దానికి తెలుస్తూనే వుంది. ఆ గెడ్డమలుపులోకి అది దూకింది.

అదే సమయాన బొబ్బిలి రెండు పంది కూనల్ని భయపెట్టి, కంగారుపెట్టి వాటిని తల్లినుంచి వేరుచేసింది.

అవి కుడివైపు చీలిన గెడ్డలోకి పారిపోయాయి. వాటికిదంతా కొత్తగా, భయంకరంగా ఏమీ అర్థంకాకుండా చాలాచాలా ఆందోళనకరంగా వుంది. ఘూక్‌ఘూక్‌మని ఆ రెండుకూనలు భయంగాఅరుస్తూ చీకటి ప్రవహిస్తున్న ఆ గెడ్డలో గుండెలు తెగిపోతున్నంత వేగంగా పరిగెత్తాయి.

గాలికూన, మరో మూడుకుక్కలూ పెట్ట పంది వెంటపడ్డాయి. బొబ్బిలి వెనకాల మరోకుక్క పరిగెడుతున్న శబ్దం వినిపిస్తోంది.

బొబ్బిలి తన ఎత్తుగడ పారినందుకు సంతోషించి రెట్టించిన ఉత్సాహంతో గాలిలో ఎగురుతున్నట్టుగా పరిగెత్తి రాకాశిలాగ అరుస్తూ ఆ పందిపిల్లల మీద పడింది.

అవి దారిమార్చి గెడ్డగట్టుమీదికి ఎక్కిపోయాయి. బైట తుప్పా, డొంకా... జీబురుగా తల్లికీ, వాటికీ మధ్యవున్న దూరం ఎక్కువయిపోయింది.

చావుకీ, తమకీ మధ్యవున్న దూరం తగ్గిపోయినట్టు వాటికి తెలీదు. అవింకా నాలుగునెలల కూనలు. బొబ్బిలి మరోసారి అవి జడసుకునేటట్టుగా అరిచి ఆ రెంటిలోనూ కాస్త ఏపుగా వున్న పందికూన మీద పడి, దాని వెనుక చట్ట అందుకుంది. అదే సమయంలో బొబ్బిలి వెనకాల వచ్చిన ఇంకో వేటకుక్క రెండో పందిపిల్ల మీదికి దూకింది. ఆ పిల్ల ఘూక్‌ఘూక్‌ఘూక్‌మని ఎడతెరపిలేకుండా అరుస్తూ మళ్లీ వెనుదిరిగి కొండగెడ్డలోకి దూకేసింది. దాన్ని అనుసరిస్తూ రెండో కుక్క పోయింది.



బొవ్వలి ముందు ఒక్క పందికూన మాత్రమే మిగిలింది. అది ఎటు వెళ్తున్నానో కూడా చూసుకోకుండా పారిపోతున్నది. బొవ్వలి మరొక్కసారి ఎగిరి మళ్ళీ ఆ పందికూన వెనుక చట్టి అందుకున్నది.

ఆ పిల్లముంత 'గీక్'మని అరిచి వెనక కాళ్ళమీద ఆధారపడి మెరుపు వేగంతో వెనుదిరిగి తన చిట్టి మూతితో బొవ్వలి గూబ గుయ్‌మనేలాగ ఒక్కటి కొట్టింది.

'అమ్మ దొంగముండా! జానా బెత్తెడున్నావో లేదోగాని ఎంత దెబ్బ కొట్టేసేవే' అనుకుంటూ బొవ్వలి మరోసారి భయంకరంగా అరిచి ఎగిరి మూకి చారల చారలుగా వున్న ఆ పందికూన భుజాన్ని పట్టుకుని చీరేసింది. కీచుమని అరుస్తూ పందికూన కింపపడిపోయింది.

చిట్టిచిట్టి గిట్టలున్న దాని కాళ్ళు అసహాయంగా, భయంగా చకచక గాలిలో కదిలాయి.



బొబ్బిలి వెనుకనుంచి మరో వేట కుక్క దూకి కిందపడిన పందికూన గొంతు కొరకేదానికి ముందుకు వొంగింది.

బొబ్బిలి అరవనైనా అరవకుండా ఆ కుక్క మట్టి మీద కటిక్కిన కరిచేసి ఛాతీతో దాన్ని అంత దూరాన పడేలాగ తోసేసింది. కిందపడిన కుక్క అసూయ తోనూ, అవమానంతోనూ మూలిగి బొబ్బిలి భుజం మీద కరిచేసింది.

ఈ సందది అదునుగా తీసుకుని కిందపడిన పందిపిల్ల తేరుకొని ఒక్క వుదుటున లేచి నిశ్శబ్దంగా పరుగు లంకించుకుంది.

బొబ్బిలి అది గమనించి తనని కరిచిన కుక్క మీద పెనుకోపంతో కల బడి దాని మెడ దగ్గిర చర్మం లంకించు కుని రక్తం కారేలాగ కరిచేసింది.

'కుయ్యో కుయ్యో' మని ఆ రెండో కుక్క అరిచింది. దాన్ని అలాగ వదిలేసి బొబ్బిలి చకచకమని చూకుతూ, భౌ భౌ మని చీకటి కూడా బెదిరిపోయేలాగ అరుస్తూ పారిపోతున్న పందిపిల్లని వెంబ డించి దగ్గిరకు రాగానే దానిమీదకు దూకింది.

కానీ ఆ పందికూన వెంట్రుకవాసిలో బొబ్బిలి కోరల నుంచి తప్పించుకుని పక్కనేవున్న బలుసు పొదలోకి దూరే సింది. అంత వేగంగానూ ఆ పొదలోకి దూకి ఆ పందిపిల్ల పని పట్టేయాలని చూసిన బొబ్బిలి అది ముళ్ల పొద అని గమనించింది. బలుసు ముళ్ళు ఏదుపంది ముళ్లలాగే గుచ్చుకుంటాయని గ్రహించి అసహాయంగా, చాలా కోపంగా ఆ పొదచుట్టూ తిరుగుతూ-

'బైటకి రాకపోతే చంపేస్తాను తెలుసా? పిల్లముండా...రా బైటకి. ఎవరనుకుంటు న్నావు? జాగర్త,నా పేరు బొబ్బిలి - వీర బొబ్బిలి.నాలాంటికుక్క ఈభూప్రపంచకం లోనే మరొక్కటిలేదు. రా బైటకి. రాక పోయావో కరిచేస్తాను' అని అరిచింది.

'భౌ భౌ భౌ'మని గోల చేసింది.

ముళ్ళ పొదలోని పందిపిల్లకు ఇదంతా అర్థంకాలేదు. అందులో నక్కి కూచుంటే బొబ్బిలి కరవలేదని మాత్రం అది గ్రహించింది. కానీ ఇందాక బొబ్బిలి కోరలు దిగినచోట దానికి పళ్లంతాభగ్గున మండిపోతున్నది. భయంతో, అలసటతో దాని చిన్నారిగుండె ఎగిరి పడుతున్నది. దాని కళ్లు ఆ చీకటిలో భయంగా, చాలా దిగులుగా వున్నాయి.

బొబ్బిలి కళ్లు ఆకుపచ్చగా మెరుస్తూ ఆ పందిపిల్ల కంటికి పరమ భయంకరంగా కనిపించాయి.

ఈలోపల ఫకీర్రాజు ఈటె పట్టు కుని పరిగెత్తుకుంటూ అక్కడికివచ్చేడు. ఒరకంట అతణ్ని గమనించి-

'వచ్చేవ్రా పోటుగాడు' అనుకుంది బొబ్బిలి.

బొబ్బిలి ఆ బలుసు పొదలోకిచూస్తూ అరవటాన్ని గమనించిన ఫకీర్రాజు అందులో ఓ పందికూన నక్కిందని ఊహించాడు. చేతిలోని ఈటె ఆ పొద లోకి గుచ్చి 'ఏయ్... ఏయ్' అని అది లించాడు.

'పోరా పోరా... పకీరోడా' అని బొబ్బిలి తిట్టుకుంది.

ఫకీర్రాజు వంగి ఆ పొదలోకి కళ్లు పట్టించి చూశాడు. ఏమీ కనిపించలేదు.

కానీ బొబ్బిలికి పొద మధ్య నక్కి వున్న పందిపిల్ల కనిపిస్తున్నది. పంది కూనకు ఫకీర్రాజూ, దెయ్యపు కుక్కా కూడా కనిపిస్తున్నారు.

 

'గీగీగీగీ'మని ఆమాత్రం దూరాన్నుంచి ఒక పందిపిల్ల ఆర్తనాదం వినిపించింది.

'పని జరిగిపోయినట్టుందోయి' అనుకుంటూ ఫకీర్రాజు ఆ వైపు పరిగెత్తాడు.

ఆ చప్పుడుకి పొదలోని పందిపిల్ల బెదిరిపోయి ఢూక్‌మని కేకవేసి పొదలోంచి బైటకు ఉరికి కొండవైపు కంగారుగా పరిగెత్తబోయిందిగానీ బొబ్బిలి దెబ్బకు దొరికిపోయి వెల్లకిలా పడిపోయి గీగీగీగీగీమని తన తోబుట్టువులాగా అసహాయంగా ఏడిచింది.

బొబ్బిలి ఆ పందిపిల్ల గొంతు నోటిలో చిక్కించుకుని కటిక్కిన కొరికేసింది.

వెచ్చగా, ఉప్పగా, తియ్యగా నెత్తుటి పని! పందిపిల్ల వాడిగిట్టలు బొబ్బిలి ఛాతీ మీద చురుక్కుని గుచ్చుకున్నాయి. ఆ పంది ముట్టిదెబ్బకు బొబ్బిలి వెనుక కాలు విరిగిపోయినంత పని అయింది.

కొరికిన చోటే మరోసారి కొరికేసింది బొబ్బిలి. దానికి మహా ఉత్సాహంగా వుంది.

ఎప్పుడైనా ఒంటిపంది నిద్దరపోతూనా కంటికి కనబడాలి – దాన్నలాగే చంపేసి, కొరికేసి, కరిచేస్తాను అనుకుంది.

'గీ'మంది తీవ్రంగా గాయపడిన పందిపిల్ల బాధతో. ఎవరో వేటగాడు పరిగెత్తుకు వస్తున్న శబ్దం వినబడుతోంది.

మూడోసారికూడా అక్కడే కొరికింది బొబ్బిలి.

'గీగీ'మంది పందికూన నీరసంగా చావు పొలిమేరలోకి కాలు పెడుతూ. మీర్జా పెదబాబు ఈటె ఎత్తి పట్టుకొని పరిగెత్తుకొస్తూ వచ్చాడు.

"లే బొబ్బిలీ...లే!నేనొచ్చేసేను.నీకేం భయంలేదులే. తప్పుకో. ఈటెతో ఒక్కపోటు పొడిచేస్తాను. నా పనివాడితనం చూద్దూగాని ...లే" అని అతను కేక లేశాడు.

'ఏడిచావులేవోయి మీర్జా బావా' అని కసిగా అనుకుంది బొబ్బిలి.

మీర్జాబాబు ఎటుతిరిగితే బొబ్బిలి కూడా అటు తిరుగుతూ ఈటెతో పందిపిల్లని పొడవడానికి వీలులేకుండా చేస్తున్నది.

"అలమంద పోటుగాళ్లు రాకముందే ఆ పందిపిల్లని ఈటెతో పొడిచేసి, వేట జరిపేవోయి బావా అనిపించుకోవాలని మీర్జా" పెదబాబు తాపత్రయం.

"ఏయ్ బొబ్బిలీ! లే.... తప్పుకోమని చెబుతుంటే నీక్కాదూ? లే... లే. చెబుతాను" అని

మళ్ళీ ఆజ్ఞాపించాడు రాజా మీర్జా పెదబాబు.

రాజాజ్ఞను బొబ్బిలి పాటించదలుచుకోలేదు.

మీర్జా పెదబాబుకి అవకాశం ఇవ్వకుండా తిరుగుతూ పందిపిల్ల భుజం మీద కండపట్టుకొని లాగింది.

'యావైనా సరే ఈ పందిపిల్లను తింటే నేను తినాలి. లేపోతే నా తోటి కుక్కలు తినాలి గానీ వేటగాళ్ళకు పిసరంత మాంసం అయినా దక్కనివ్వకూడదు' అనుకుంది బొబ్బిలి.

అప్పటికే దానిమూతి పంది రక్తంతో తడిసి ఎరుపెక్కివుంది. పందికూన గీమని అంటోందిగానీ అది గొంతుదాటేటప్పటికి గురకలాగ మాత్రమే వినబడుతోంది.

మీర్జా పెదబాబుకి బొబ్బిలిమీద మండిపోతున్నది. ఈటె తిరగేసి సడ్డిమీద ఒక్కటిద్దామనుకున్నాడు గానీ కుక్క

చూస్తే దెయ్యంలాగుంది. తిరగబడి పీక బట్టుకు కరిచేస్తే ఏమిటి సాధనం – అని అతను జంకి ఊరుకున్నాడు. అయితే ఏమాత్రం అవకాశం వచ్చినా ఆ పంది పిల్లని ఈటెతో పొడిచేసి, చంపేయాలనే నిర్ణయాన్ని మార్చుకోలేదు. ఈటెను సిద్ధంగా పట్టుకుని చచ్చిపోతున్న పంది చుట్టూ, దాన్ని కొరికేసి తినేయాలని చూస్తున్న బొబ్బిలి చుట్టూ అతను అతి లాఘవంగా ప్రదక్షిణ చేస్తున్నాడు.

ఆసరికి మిగిలిన వేటకుక్కలన్నీ అక్కడికి చేరుకున్నాయి. వెనుకనే వేటగాళ్లు కూడా వచ్చారు.

"పెట్ట పంది యావైందోయి బావా?" అని ఆత్రంగా కేకవేసి అడిగాడు మీర్జా పెదబాబు.

"చీకట్లో ఎక్కడో కాడీసిందోయి. ఒక కూనమాత్రం దొరికింది. కుక్కలు బట్టీసేయి అనుకో" అని తిరిగి కేక వేశాడు ఫకీర్రాజు.

"ఇక్కడో కూనని నేను నిలబెట్టే నోయి. త్వరగా రండి" అన్నాడు మీర్జా పెదబాబు ఇంకా భజన అడుగులువేస్తూనే.

అప్పటికి మిగిలిన కుక్కలన్నీ బొబ్బిలితోసహా బంతి భోజనానికి సిద్ధమై తలో కంటా కొరికేయాలని చూస్తు న్నాయి. కానీ పంది చర్మం వెళసరి కావటం మూలాన అది అంత సులభంగా కుదరటంలేదు.

పాత్రుడు ఆ కుక్కలన్నీ పందిపిల్లని ఏం చేస్తున్నాయో చూద్దామనుకున్నాడు గానీ అందులో ఓ కుక్క 'గుర్రు'మని ఓ హెచ్చరిక జారీచేసింది.

"రాజులొచ్చేర్రా తప్పుకొండి తప్పు కొండి.. పందిని పొడిచేస్తారు" అని గోపాత్రుడు కేకవేసి ఆ కుక్కలకి నచ్చ చెప్పేడు. తర్వాత వేటగాళ్ళ వైపుతిరిగి–

"ఏమండోయి! ఈ కుక్కలన్నీ కలిసి పందిని తినేస్తున్నట్లున్నాయి" అని కేకవేశాడు.

"మీ కుక్కలకి సరైన తర్ఫీదు ఇవ్వ లేదోయి. మనం ఈటె పట్టుకొచ్చినా అవి తప్పుకొని దారి ఇవ్వటం లేదు. ఏం తర్ఫీ దోయి అలమంద తర్ఫీదు... కరవాకు తర్ఫీదు గాని" అన్నాడు మీర్జా పెదబాబు చిరాకుపడుతూ.

"తర్ఫీదనేది నిరంతరం ఇవ్వాలోయి. ఈటె తిరగేసి బాదితేగాని వాటికి మన కుక్కలమన్న సంగతి జ్ఞాపకం రాదు" అన్నాడు ఫకీర్రాజు ఈటె తిరగేసి బొబ్బిలి నడ్డిమీద కొడుతూ.

అంత దెబ్బతిని కూడా బొబ్బిలి కిమ్మనలేదు. 'ఇంటికి పదవోయి ఫకీరూ! అన్నం పెట్టినపుడు తొడబట్టుకొని చీరికపోతే నాపేరు పేర బొబ్బిలే కాదు' అనుకుంది.

ఫకీర్రాజుకూ, దుంపల వరుసకి, అల్లుడు రాజబాబుకి, అందరినీ మించి కుమందాస్‌కి ఒక్కసారిగా కోపం వచ్చింది. అందరూ కలసి, ఒక్కసారే కుక్కల్ని దభీదభీమని బాదేరు.

కుక్కలు కుయ్యోమంటూ తప్పు కున్నాయి. అయినా వదలకుండా రాజులు వాటిపై యుద్ధం ప్రకటించి దూరంగా తరిమేశారు.

కుమందాస్ ఈటె పాత్రుడికి ఇచ్చి వంగి పందికూనని పరీక్షించాడు.

"అయిదు నెలలకూనోయ్! కుక్కలు చీరేసేయి. మనం విడిపించకపోతే తినేసును" అన్నాడతను.

పాత్రుడు చాలా సంబరపడుతూ వంగి ఆ పందిపిల్లని పరీక్షగా చూశాడు.

ఆ చీకటిలో చచ్చిపడున్న అడవి పందిపిల్ల పంటి మీద, గాయాల మధ్య అతనికి తెల్లని చారలు కనిపించాయి.

"ఏమండోయ్! మీరు సరిగ్గా చూడండి. నాకేదో అనుమానంగున్నది. ఇది వూర పంది పిల్లలాగుందండీ" అన్నాడు.

"ఊరపందికాదులేవోయి! అడివి పంది పిల్లలున్నాయా చిన్నప్పుడు చారలుంటాయి. అవి ఎదిగిన కొద్దీ మాయమై పోతాయి'' అన్నాడు కుమందాన్.

దుడ్డుకర్ర దెబ్బలకు జడిసి దూరంగా వెళ్ళిపోయిన కుక్కలన్నీ రాజుల మీద కోపంతో గుర్రుగుర్రు మంటున్నాయి. ముఖ్యంగా బొబ్బిలి మండిపడిపోతున్నది.

పాత్రుడికి పెద్ద అనుమానం పట్టుకుంది "ఇప్పుడింతకీ ఈ పందిగూనని ఎవరు వేటాడినట్టండీ?"

ఎవరూ సమాధానం చెప్పలేదు. పికిలి పిట్ట తాటిరెమ్మ ఒకటి చీరి, పచ్చి తాటాకులతో ఆ పందిగూన నాలుగు కాళ్లూ గట్టిగా కట్టేశాడు. దాని కాళ్ళ సందునుంచి ఈటె దూర్చి పికిలిపిట్ట ఒక వైపూ, చిరంజీవి ఒకవైపూ భుజానికి ఎత్తుకున్నారు. అది పెద్ద బరువులేదు.

మరో ఇద్దరెళ్ళి దూరంగా పడివున్న రెండో పందిగూనని కూడా అదేవిధంగా భుజాలకు ఎత్తుకున్నారు. రాజులు మీసాలు మెలేసుకుంటూ వాటిని బసవైపు మోసుకు పోతుంటే బొబ్బిలి నిప్పులు కక్కుతూ చూసింది.

'కుక్కలు కరిచిన కూటికోసం కక్కుర్తిపడే మీరేం వేటగాళ్ళోయి' అనుకున్నది ఆ కుక్క.

* * *

బసలో తాటాకు చాపమీద కూచుని ఎత్తుపు ఆట ఆడుతున్నారు పేటజట్టు. ఫకీర్రాజు చేతివాటం బాగులేదు. అప్పటికే అతనోసారి కుదేలయిపోయి వున్నాడు.

"మీ ఉద్ధారుడొచ్చాడండోయి ఫకీరు మామయ్యా" అన్నాడు పికిలిపిట్ట.

ఫకీర్రాజు ఎడంత్రీగా గోపాత్రుడు కూచున్నాడు. అతనికా పేకాటలో ఒక్క ముక్క కూడా అర్థంకావటంలేదు.

'రెండంటారు, మూడంటారు, నాలుగంటారు, బేస్తంటారు, బొమ్మ లాంతరంటారు, కుదేలంటారు...ఏటో గోల. చక్కా కోతాటగానీ, సెట్‌లు గాని, జానా పట్టు గానీ, కంపీ గానీ ఆడుకుంటే బాగోదా' అనుకున్నాడతను.

"ఏవిటో కనుక్కోపోయావా?"

"అడిగేను ... నేనడిగేను, దుంపల పత్తుడు నాన్న అడిగేరు... చెప్పందే. అర్జెంట్ పనున్నాది. ఒక్కపాలి మా దివాణాన్ని బైటకి పిలమంటాడు" అన్నాడు పికిలిపిట్ట.

"సరే...నా ఆట నువు చూడవోయి" అని చేతిలో ముక్కలు పికిలిపిట్టకిచ్చి లేచాడు ఫకీరు.

పికిలిపిట్ట ముక్కలు విప్పి జాగ్రత్తగా చూస్తున్నాడు "ఆడు.... ఎంత సేపు చూస్తావు... చేతొరస" అన్నాడు అతని పైచేతి స్థానంలో కూచున్న కుమందాన్.

ఫకీర్రాజు 'బస' అని పిలవబడే పాక నుంచి బైటకొచ్చాడు.

నాజింపసందు చెట్టు మొదట్లో నిల్చుని వున్నాడు అరసవిల్లి.

'ఇలారా' అన్నట్టు తలవూపి పిలిచాడు ఫకీర్రాజు.

అరసవెల్లి ఓ రెండడుగులు ఫకీర్రాజు వైపువేసి — "తవురే కొంచెం ఇసుంతా రండి" అన్నాడు.

అతను నిల్చున్న ధోరణిబట్టి, గొంతుకబట్టి, కనుపాపల కదలికనుబట్టి ఏదో పెద్ద విశేషమే వుందనుకున్నాడు ఫక్కీరాజు. గబగబ నడిచి నాజింపసందు చెట్టుకిందకు వెళ్లాడు.

"ఏంరా?"

"దివాణాన్ని, పాతుద్దగోర్ని వున్న పాట్న తీసుకరమ్మని పెద్దయ్యగారు పంపినారండి"

ఫక్కీరాజు ఆశ్చర్యంగా కనుబొమలు ముడిచి "అదేవిటదేవిటది? అసలేం జరిగింది?" అని అడిగాడు.

"చితం.. నాకేటి తెలీదు బాబయ్యా! రేతిరి నాను ఇంటికెళ్ళిపోతుంటే 'ఒరే అరసివిల్లీ! నువు కోడిగూసిజావున నెగిసి బంజిరికెళ్ళి పెదరాజుగోర్ని, పాతుద్ద గోర్ని తీసుకురారా' అని చెప్పేరండి. తుని దివాణాన్ని మాత్రం తోటలోనీ ఒగ్గిసిరమ్మని చెప్పమన్నారండి"

"ఇంకేం చెప్పలేదా?'

"చితం. మరేటి సెప్పలేదండి"

"మేం ఇలాగ వేటకొచ్చేసిన తర్వాత ఏవైనా జరిగిందా? రేవిడ్నించి పెదపాప గానీ, పాండ్రంకి నుంచి చినపాప గానీ వొచ్చారా? పెద్దయ్యగారికి ఏవైనా వొంట్లో సుస్తీజేసిందా? అసలేవైందో చెప్పరా లంవిడీకి"

అరసవిల్లి తల గోక్కున్నాడు "బేగా బైలెల్లండి మారాజా"

"చెపుతావా తన్నమంటావా?"

"నాకేటి తెలీదంటే దివాణం నమ్మరేటి?" అన్నాడు అరసవిల్లి.

"కొంచెం ఇసుంటా రండి బాబూ" అని వెంటనే అన్నాడు.

ఫక్కీరాజు ఆత్రంగా మరో రెండడుగులు జరిగాడు.

"మరండీ.. నిన్న పొద్దోయి మన నోగిట్లోకి జామి నుంచి పోలీస్ జమా నొచ్చినాడండి" అన్నాడు అరసవిల్లి రహస్యంగా.

ఫక్కీరాజు నిర్ఘాంతపోయాడు.

"ఎందుకో?"

"నాకు తెలీదండి. తూరుపు వాకిట్లో పెద్దయ్యగారితో ఏటో మాట్లాడినాడండి. తరవాత పలారం తిని, మజ్జిగ బుచ్చుకుని మళ్ళీ సైకిలుమీద పోనాడండి"

ఎందుకో పోలీసులు? ఏం దారుణవో? ఏం ఘోరవో?ఫక్కీరాజు ఆచెట్టుకిందనుంచి కదిలాడు. అతను ఓ అయిదారు అడుగులు వేసేంతరవాత –

"బాబూ..." అని మళ్ళీ పిలిచాడు అరసవిల్లి.

"ఈసారేవిటి?"

"ఓపాలి ఇలారండి బాబూ! సిన్న కబురు"

వినుక్కుంటున్నాడు గానీ ఫక్కీరాజు గుండెల్లో గుర్రాలు పరిగెడుతున్నాయి. మళ్ళీ వెనక్కి వెళ్ళాడు.




"తవురూ, పాతుద్దగోరూ కలగాడ్లో గ్రారిపోతు అప్పల్నాయుడింట్లో దొంగతనం జేసినారని జామి పోలీసుటేషన్ల రిపోర్టు జేసినారటండి. ఈయాళ మాపిటేళ

కల్లా పోలీస్‌స్టేషన్ల తప్పురిద్దరుండాలని ఆ పోలీస్ జమాన్ సెప్పినాడటండి. అంచే తండి తుని బావగార్ని తీసుకురావొద్దని పెద్దయ్యగోరు మరీ మరీ సెప్పినారండి"

ఫకీర్రాజుకు కళ్లు తిరిగినంత పనయింది.

కలగాడ్లో దొంగతనం చేసినట్టు రిపోర్టు అయిందా?

ఆ ఉదయపు వెల్తురులోంచి, ఆ పచ్చ పచ్చని నాజింపసందు మామిడాకు ల్లోంచి ఎలాంటి చప్పుడూ చెయ్యకుండా ఫకీర్రాజు నెత్తిమీద పిడుగు పడి పోయింది.

అతని గుండెల్లో దడ పట్టుకుంది. గొంతుక, నోరూ క్షణాలమీద ఆరి పోయాయి.

అతను కొన్ని క్షణాలపాటు అలాగే రెప్పయినా వాల్చకుండా నిల్చుండి పోయాడు.

గట్టిగా ఏగించి కట్టిన పంచ చెంగు వూడిపోయింది.

"బేగి బైలెల్లండి బాబూ" అన్నాడు అరసవిల్లి.

ఫకీర్రాజు మరుక్షణానికి తేరుకొని పంచెకట్టు మళ్ళీ దోపుకున్నాడు. అక్క ణ్నించి కదిలి బస వాకిలి దగ్గర నిల్చుని- "పాత్రుడూ" అని పిలిచాడు.

పాత్రుడొచ్చాడు.

"మనం క్షణాలమీద బయలుదేరి అలమంద వెళ్ళాలోయి"

"ఇపుడా? ఏటండి అంతజరుగుచుపని. మజ్జానం భోంచేసి బైల్దేరుదాం. రాత్రి అంతకష్టపడి వేటజేసిన పందిమాంసం కూర తినకుండా ఎలాగ వెళ్తావండి"

"బయలుదేరు" అని చాలా కటి సంగా చెప్పేసి, ఆ పక్క మరోచెట్టు కింద చాపమీద కూచుని హుక్కా కాలుస్తూ దుంపల దత్తుడితో మాట్లాడు తున్న మీర్జా పెదబాబు దగ్గరకు వెళ్ళి-

"నేనూ, పాత్రుడూ చిన్న జరుగుప పనిమీద అలమంద బయలుదేరుతున్నా వోయి బావా! సాయంత్రానికి తిరిగి వచ్చేస్తాం. కారు తీసుకుని వెళ్తున్నాం" అనిచెప్పాడు.

"ఏవన్నా వైద్య సంబంధమైన వెవహారం ఏమిటోయ్?" అని దుంపల దత్తుడు అడిగాడు.

అవును అన్నట్టుగా తలవూపేడు ఫకీ ర్రాజు.

మీర్జా పెదబాబు బావగారికేసి జాలిగా చూస్తూ "మళ్ళీ వైద్యమా? ఎందుకొచ్చిన రాష్ట్రోయి బావా!" అన్నాడు.

ఫకీర్రాజు మాట్లాడకుండా అక్క డ్నించి కదిలి, వంటపొయ్యి దగ్గిర సాయంచేస్తున్న డ్రయివర్ని పిలిచాడు.

తోట మొగన నిలిపివుంచిన కారు దగ్గరికి ఫకీర్రాజు, గోపాత్రుడు, అరస విల్లి, డ్రయివరు చేరుకొన్నారు.

అక్కడనుంచి వున్న బండి దారిలో కారు ఏ ఇబ్బందీ లేకుండానే నడుస్తుంది. ముందు సీట్లో డ్రయివరు పక్కన ఫకీ ర్రాజు కూర్చున్నాడు. వెనక సీట్లో గోపాత్రుడూ, అరసవిల్లీ కూర్చున్నారు.

ఇరవై నిమిషాలు పట్టింది తోట నుంచి కారు కొత్తవలస త్రారోడ్డు మీదకి చేరేసరికి.

అంతవరకూ ఎవరూ ఏమీ మాట్లాడ లేదు. కొత్తవలస బస్టాండులో తాతబాబనే పేరుగల అలమంద పెద్దయ్య కనిపించి కారు ఆపాడు. కారు ఆగగానే అతను ఆత్రంగా ఫకీర్రాజు దగ్గరికి వచ్చేడు.

"ఏవిటి ఫకీరుమాయ్యా? ఏవిటిది?

తనకి బేడీలేసి పోలీస్ స్టేషన్‌కి తీసుకెళ్ళడానికి జావిసుంచి పోలీసులు వచ్చేరట. తనరేదో దోపిడీ చేసినట్టు రిపోర్టయిందిట. ఏవిటిదంతా?" అని అడిగాడు తాతబాబు.

ఫక్రీరాజు గుటకలు మింగాడు.

పాత్రుడు హడలిపోయాడు.

డ్రయివర్ మొహంలో ఏ మార్పూ లేదు. 'ఏరోజో ఒకరోజు ఈ డబ్బునోళ్ళందర్నీ బొక్కల పెట్టవలసిందే' అన్నది అతని అభిప్రాయం. కనుక అతనికి లోలోపల సంతోషంగా వుంది.

అరసవిల్లి మాత్రం తలబాగా వంచుకుని తాతబాబు కంటికి కనిపించకుండా దాక్కోవాలని చూశాడు.

"ఏటండి ఫకీరు బాబూ. ఏటండీ ఘోరవేటండీ'' అని పాత్రుడు చాలా కంగారుగా సీట్లోంచి లేచిపోతూ అడిగాడు.

వెనక్కి తిరక్కుండానే ఫకీ్రరాజు 'ఆగు' అన్నట్టు పాత్రుడికి సంజ్ఞచేసి



"అంతా విధివిలాసం. సిందొచ్చింది. నిజా నిజాలు ఆ భగవంతుడికి తెలుసును. సువ్వూ అలమండొస్తేరా. దార్లో మాట్లాడు కుందాం'' అన్నాడు.

"లేదుమాయ్యా! నేను చోడవరం బయలుదేరాను. మా చిరంజీవిగాడికి గోవాడ పంచదార ఫ్యాక్టరీలో ఉద్యోగం చూడ్డానికి బయలుదేరాను. మనం కూడా నౌకరీలు చేసుకోవలసిన కాలం వచ్చేసింది గదా'' అన్నాడు తాతబాబు.

''రోజులు చెడ్డయితే... అందులో ఏం అనుమానంలేదు. లేకపోతే నా లోగిటికి పోలీసులు రావడమేమిటి? అలమండలో కాకర్లపూడి వారందున్నారుగదా. అందులో ఎవరింటికైనా రావచ్చుసుగదా. అన్నట్లు నీకీ సంగతి ఎలా తెలిసిందోయి తాతబాబూ'' అని అడిగాడు ఫకీర్రాజు

''అడుగో. మీ ఉద్దాఫుడే చెప్పాడు'' అన్నాడు తాతబాబు కారుమీంచి చెయ్యి తీస్తూ.

"సర్లే మేం వెళ్ళొస్తాం. పోనీవోయి''

కారు మళ్ళీ బయలుదేరింది. కొత్త వలసకు రెండు మైళ్ళ దూరానవున్న పెదగొప్పు అనే ప్రదేశానికి కారు చేరు కునేవరకూ ఫకీర్రాజు ఏమీ అనలేదు.

ఈలోపల 'ఏటయిందండీ ఫకీరు బాబూ, ఏటయింది?' అని పాత్రుడు ఓ పది సార్లయినా అడిగాడు.

"పాతుడుగోరూ! మిమ్మల్ని తీసికెళ్ళ కుండా మా దివాణం జైలుకెళ్ళర్లే. మీరు లాగ గుండయిపోతన్నావు. నీ కోసం కూడా పోలీసోడొచ్చిన్నాడు'' అన్నాడు ఉండబట్టలేక అరసవిల్లి.

"కారు ఆపవోయి డెయివోరూ'' అన్నాడు ఫకీర్రాజు గంభీరంగా. పెద గొప్పు మీద కారు ఆగింది.

''ఒరే అరసవిల్లీ! ఇపుడు చెప్పరా... లంజకొడకా ఏ ట యిం ది రా అంటే నాకు ఒకపట్టాన చెప్పలేదు. మురి పించుకొని, మురిపించుకుని ఆ కొంచెమూ చెప్పేవు. ఇపుడీ తాతబాబుగాడు కన బడినతర్వాతగదా నీ మాపర్ఫోదీతనం బైటపడింది. ఇపుడు చెప్పు. నిన్న సాయంత్రం ఏం జరిగిందో, ఏమిటో మొత్తం అంతాచెప్పు. లేకపోతే చమ్డా లెక్క దీసేస్తాను" అన్నాడు ఫకీర్రాజు

"ఇదేటండి ఫకీరు బాబుగారు. జైలేటి దోపిడేటి.... మీరేటి? అన్నిటికీ మించి నేనేటి? ఏటన్నిసార్లడిగినా చెప్పరేటి? ఏటండి బాబు. ఏటిపంతా.... నాకేటి తెలీడం లేదు. మతి బోతున్నాది. రాజుల్తో సాహసం జెయ్యొద్దురాఅని మా ముసల్దిం దుకే కాదాల నెత్తీనోరూ కొట్టుకుంటాది" అని గోపాత్రుడు గొడవచేసేడు.

"పాత్రుడూ! నీ ప్రాణానికి నా ప్రాణం అడ్డు. మరి మాటాడకు. ముండీ లంజ కొడుకు పని పట్టేస్తాను. చెప్పరా లమ్డీ కొడకా"

అరసవిల్లి మొ హం గంటు పెట్టు కున్నాడు. రాజుగారిమీద గౌరవంకొద్దీ కారులోనే అతను నిలబడి మాట్లాడ్డానికి ప్రయత్నించేడు గానీ అది సాధ్యంకాక రాళ్ళమీద నిలబడి, బాగావొంగి "చిత్తం. తప్పురిగోరికి కోపమెపోతాదని ఇందాక మొత్తంఅంతా జెప్పలేదండి. బయ్యమేసిం దండి. నిన్న పొద్దోయ్యి జామి నుంచి బిత్తిరి సోవులని భీమాలిమాలోల్ల కుర్రోడండి— జామిలో పోలీస్ జమానండి... గోసిగట్టిస కాడ్నించి నాకు బాగా తెలిసినోడండి. ఆడు నిన్న చాయంత్రంజేసి సైకిలేసు కుని మన నోగిటికాడికి వొచ్చినాడండి. నీళ్ళమోసేసి మన నోగిట ముందున్న

మావిడిసెట్టుకి బజినికలుంటే అయి క త్తెట్టి నరుకుతున్నానండి. అప్పుడు ఆడొచ్చి మీరాజుగోరేర్రా అరసవిల్లీ అని అడిగి నాడండి. జరిగిందంతజరిగినట్టు సెప్పేస్తా నండి దివాణానికి. నాను అపుడు సెట్టు దిగి, 'ఏట్రా సోవులా! మారాజుగోరితో నీకేట్రా పని' అని అడిగినానండి. 'మీ రాజుని బేడీలేసి బొక్కలో తొయ్యడానికి ఒచ్చినాన్రా' అన్నాడండి ఆ ఎదవ నంజి కొడుకు. ఓరి నంజిడికీ మా రాజుగోర్ని బొక్కల్తొయ్యడానికి సువ్వెవిడివిరా అన్నానండి. ఆడుపోలీస్ జమానే గానీ ఆడికి నాపు అంతంరాదండి. నాను అసలేవ నీను అంటాడండి ఎదవ నంజికొడుకు.దాని కాడు సైకిలు నిలబెట్టి 'నేను పోలీస్జమాన్ గోర్నిరా ఎదవా. మీ రాజునేగాదు, నిన్ను కూడాబొక్కల్తొయ్యడానికిఅదాట్టుందిరా' అన్నాడండి. మీ రాజేట్రా అని ఆడు మళ్లీ అడిగినాడండి. మా దివాణం ఏట జెయ్యే డానికి కొత్తవల్సబంజరికి ఎల్లేరని జెప్పే నండి. ఆ తరవాత ఓరిసోవులా అసలేటి కత కమామీసు అని అడిగినానండి. 'మీ రాజూ, మీ వూరి గోపాతుర్దూ కలిసి కల గాడ్లో సిన్న కీటుపని జేసినార్రా. మరేటీ నేదు' అని సోవులుగోడు అన్నాడండి. నాకు ఉచ్చగారి పోయిందండి. పోలీసు జమాన్ నంజికొడుకొచ్చి మా దివాణం కేటు పనిజేసినారంతె! నాకెంత నామోసి గుంటాదో సూసుకోండి. 'సీ! ఎదవనంజి కొడక. మా దివాణం సిప్పలా హోర్రా. పీకిపోయినా అలాటి పన్జెయ్యరు' అన్నా నండి. మా రాజుగోరు సేస్తే కూనీజేస్తారు తప్పించి కేటుపని జెయ్యర్రా అని నాను గట్టిగా సెప్పినానండి.ఆడు నా సిన్నపుడి సావాసిగోడు గద. అడికాడ నాకు బయ్యం నేటి.దానిమీద ఆ నంజికొడుకు పళ్లికలించి నాడండి. మీద పండిసినిచ్చి కలగాడ కర్రప్పల నాయుడిగోడి అత్తని కూనీ జెయ్యాలని కూడా సూసినార్రా ఎర్రి ముండకొడకా అనేసినాడండిఆడు. దాంతో నాను బెగిలిపోనానండి. ఉచ్చగారి పోయిం దండి. ముసిల్ది నానూ, పట్టిడా, బోల్డన్ని విచ్చురూపాయిలూ సందుగు పెట్టెకింద దాసిందటండి. దాన్ని నిన్నరేతిరి మీ రాజూ, పాతుర్దూ కేటుజేసినారని ఆడన్నా డండి. నాకు కాళ్లేతులు ఆడలేదండి. ఆ నంజికొడుకుని దువ్వారం కాడ నిలబెట్టి నోఫలికెళ్లి పెద్దయ్యగోరికి జెప్పినానండి. పెద్దయ్యగారు బెగిలిపోనారండి. నోగిల్లో మరెవ్వరలూ నేరండి. కొండ్రాజుగోరు కందా ఇంట్లో వున్నారుగాని ఆ బాబుకి అద్దు మాల్ని బయ్యేవండి. సెడ్డ పిరికి. మరేటి జెయ్యగలవండి? తూర్పు సావిట్లో పోలీస్ జమానున్నాడండి. ఆడసలే జడ్డీ పోతునా గుంటాడండి. కర్రిగా గొడు గేదనాగుంటా డండి. పెద్దయ్యగోరు తూరుపు వాకిట్లో కొచ్చి, తలుపుసాట్న నిలబడి 'ఏటోయి పోలీసూ అని అడిగినారండి.సోవులుగోడు మళ్ళీ నాకుజెప్పిన కతంత జెప్పేడండి. పెద్దయ్యగోరుబెగిలిపోయి 'అయ్యన్ని బొల్లికవర్లోయి. మీ ఇనసపెట్టర్కి నాన్జెప్పేనని జెప్పు' అన్నారండి. కానీ ఆ జమాన్ నంజికొడుకు పెద్దయ్యగోరి మాటలు నమ్మనీదండి. నంచుకోడానికి ఊరగాయలు, తింటానికి ఫలాహారాలూ, కోసుకోడానికి కోడిపుంజూ ఇస్తాం. అంబ వొట్టుకుని వెళ్లిపొమ్మన్నారండి పెద్దయ్య గోరు. ఆయమ్మ అడుక్కునేవోడికే నేదని జెప్పదు. పోలీస్జమానొస్తే పుత్తి సేతులో బంపుతాదా?మహాతల్లి. పెద్దయ్య గోరు అలాగంతే ఆ జమాన్నంజకొడుకే టన్నాడో తెలుసాబాబూ. ఇస్తే అయ్యన్ని



మారాజునాగ పట్టికెల్తాను. యాటనుంచి వచ్చినాక రాజునీ వొట్టికెల్తాను అన్నా డండి...... సూ సు కోం డి పోలీసు జమాన్ నంజికొడుకు ఎలా టోడో? ఆ మాల నంజికొడుకుని పెద్దయ్యో గోరు బతిమాలుకొన్నారండి. కానీ ఆడు పోలీసోడండి. తెల్లారీసరికల్లా మీ రాజు గోరూ, గోపాతుర్డు జాం పోలీస్ టేషన్ల అజరవ్వాలని చెప్పేసి వింక ఫలారాలు బెట్టండి అన్నాడండి. తూర్పు వాకిట్లో దిమ్మల మీద గూకొని బూడిదగుమ్మడి కాయ మురబ్బా, పూత చుట్టలు, ముర్రి పీలు దొబ్బితిని, మజ్జిగ తాగి, వూర గాయ పొట్లం కట్టించుకుని మూతితుడుచు కుంటూ ఎల్లిపోనాడండి ఆ బిత్తిరి సోపులుగోడు. ఆడెల్లిపోనాక పెద్దయ్యో గోరు పెళ్ళరుగు మీద కూకొని ఏడిసి నారండి. దీపాలు బెట్టివేళ తవలాంటి తల్లులు ఏడకూడదమ్మా అన్నానండి. నానే దయిర్నం జెప్పినాను. మన రాజుగోరి కేటీ బయ్యంనేదమ్మా, నిప్పులాటోడు అని నాను అన్నానండి. కోడిగూసి జావున పారెల్లి రాజుగోర్ని, పాతుర్డుగోర్ని తీసు కొస్తానని జెప్పినానండి. ఆయెనక తెల్లారి కొత్తనకాపల్లి బస్సెక్కి తమకాడి కొచ్చినా నండి. ఇంతె మారాజా జరిగింది. దివా ణానికి జెప్పకుండా ఇంకేదైన దాసినానని తెలిస్తే జోడుచ్చుకొని కొట్టండి'' అన్నాడు అరసవిల్లి.

అంతావిని గోపాత్రుడు ఏమీ మాట్లాడకుండా గుండెలు బాదుకున్నాడు. ద్రయివరు మాబాగా జరిగింది అను కున్నాడు.

"ఇదంతా ఇందాకే నాకెందుకు చెప్ప లేదు?"

"చితం.తవరు తిడతారని బయ్యవేసిం దండి"

"కారు దిగు చెప్తాను"

గోపాత్రుడు డోరు తెరిచాడు. అరస విల్లి దిగి నిలబడి తల గోక్కున్నాడు.

"పెద్దయ్యగారు బస్సు ఖర్చులిచ్చేరా?"

"చితం. రెండ్రూపాయలిచ్చినారండి. ముచ్చావుక కరుసయిందండి. ఇంక రూపాయి పావలుందండి... ఇదిగోండి"

ఫకీర్రాజు ఆడబ్బులు అందుకున్నాడు.

"నాకు చెప్పలేదుగానీ ఊరందరికీ చెప్పేవు. నా సొమ్ము తింటూ, నా పంచన బతుకుతూ నాకు కీడు జరిగితే చాటింపు ఏస్తున్నావు లంజకొడకా. మేం వెళ్ళిపో తున్నాం. కారు వెనకాల నడిచిరా'' అన్నాడు.

"నడవటం కాదండీ పరిగెత్తుకు రమ్మనండి. తెగులు కడుతుంది" అన్నాడు పాత్రుడు అప్పటికి నోరు తెరిచి.

అరసవిల్లి నవ్వేడు "తవరుగోరు కోపం కొద్దీ అలాగంటన్నారుగానీ నడిసి రావడం నాకు సిచ్చేటండి? కోసులు కోసులు నడిచి దిరిగి జనమం నాది. తవరు ఎలాగ సెలవెతే అలాగేవస్తాను కానీ నోగిట్లో నీళ్లుండవు. పొద్దున్న నెగిసి ఇటు పారొచ్చినానుగదా'' అన్నాడతను.

ఓ క్షణం ఆలోచించాడు ఫకీర్రాజు.

"సర్లే కారెక్కు. కానీ ఇటువంటి దగుల్బాజీ పని మళ్ళీ చేసేవా బోర మీద తంతాను''

* * *

జామి పోలీస్‌స్టేషన్ ముందున్న వరం డాలో సంభానికి అనుకొని కూర్చు న్నాది దేవుడమ్మ. నిప్పుతోవున్న చుట్ట కొన నోటిలో పెట్టి అడ్డపొగ పూదుతూ కళ్లుమూసుకుని వున్నాది.

నీరసంగా వుంది.

కాళ్లు సలుపుతున్నాయి.

ఆమె పక్కనే కూతురు చిన్నమ్మ కూర్చున్నాది. వరండా అంచున కూచుని అప్పలనాయుడు మాసిన గడ్డం వేళ్లతో గోక్కుంటున్నాడు.

ఎందుకొచ్చిన పుర్రాకులియ్యన్నీ అని వాళ్లిద్దరూ చిరాకుగా వున్నారు. అంతవరకూ అరుగుకు ఆనుకుని నిల్చుని బీడీ కాల్చుతున్న 'బాంబులుగోడు' ఆరిపోయిన బీడీపారేసి వచ్చి అప్పలనాయుడి పక్కనే అరుగుమీద కూచున్నాడు.

అతను ఖాకీ నిక్కరేసుకునివున్నాడు. నైలాను గుడ్డతో కుట్టించిన లాల్చీ వేసుకున్నాడు. దాంట్లోంచి గుండెలమీద మీది వెంట్రుకలు కూడా కనిపిస్తున్నాయి. నెత్తిమీద చిన్న చిన్న వెంట్రుకలున్నాయి. గడ్డం, మీసం నున్నగా గీయించుకొని వున్నాడు. కనుబొమలు ఒత్తుగా వున్నాయి. కంటిపాపలు ఒక్క క్షణం కూడా ఎక్కడా ఆగని కత్తెర పిట్టల్లాగ కదులుతున్నాయి. ముప్ఫయి అయిదేళ్ళ వయస్సుంటుందతనికి. పొట్టి ముక్కు వెడల్పుగా వుంది. పలువరస దృఢంగా, చక్కగా కనిపిస్తుంది. మనిషి బలంగా, ఎత్తుగా వున్నాడు.




దేవుడమ్మ నోట్లోంచి చుట్ట బైటకితీసి పళ్లు తెరిచింది. కూచున్న చోట్నించి కదలకుండానే తుపుక్కున ఉమ్మింది. అది వరండాలోనే అంతదూరానపడింది. ఎడమచేత్తో బారచాపిన కాళ్లు నొక్కుకుని "వోలమ్మో... కాళ్లూరిక సలిసేస్తన్నాయి. కుసింత పిసుకిమీ" అంది కూతురుతో.

చిన్నమ్మ ఇంత ఎత్తున ఎగిరింది "నీకు రాత్రనానూ మతోదన్నాదోలమ్మ. ఇంటికాడ మంజూరు కింద కూకుదన్నాననుకొంతన్నావేటి? కాళ్ళు పిసుకుమీ, ఈపు గోకుమీ, జుట్లో పేలుసూడుమీ అని బెత్తాయించడానికి. నాను పిసకను. అడుగో నీ సెల్లెలి కొడుకున్నాడు. ఆడిసేత కాళ్లు బట్టించుకో. ఆడే నిన్ను, మమ్మల్నీ సిన్నటినుంచి ఇందంట తిప్పి తిప్పి సంపుకొని తింతన్నాడు"

బాంబులు వెటకారంగా నవ్వేడు "అదీ. దాసుకున్న బంగారప్పిసరంతా నాసోడికి ఉపారవెట్టేసినాక నీమాటెవ్వులింటారే పెద్దమ్మ? నీకు పిచ్చిగాని. సువ్వానొమ్ము, బంగారం సెక్కగా దాసుకోనుంటే నీ కూతురు పట్టేది, నీ అల్లుడూ పట్టేవోడు, నానూ బట్టేవోడ్ని—ఆకిరికి టేసనల్లకూకున్న ఎస్సయిగోరు కూడా పట్టేవోడు"

అతని అసలుపేరు పైడితల్లినాయుడు. కాని మిలటరీలో చేరి, భయపడి పారిపోయి వచ్చేసి 'ఓలమ్మ బాంబులుగాని పేల్తే సచ్చే సచ్చిపోతాం' అని నలుగురిలో ఓసారి అన్నాడు. దాంతో కలగాడలో అతని పేరు బాంబులుగోడని స్థిరపడి పోయింది.

"బాగా సెప్పినావుర బాంబులుగోడా" అని చెల్లెలి కొడుకుని మెచ్చుకుంది దేవుడమ్మ.

మధ్యాహ్నం రెండున్నర.

వేసవి సూచనలు ఎండలో కనిపిస్తున్నాయి. 'అగ్గిపెట్టాడీ" అని దేవుడమ్మ అడిగింది.

బాంబులు నిక్కరు జేబులో చేయి పెట్టేసరికి అప్పలనాయుడు తన చేతిలో వున్న అగ్గిపెట్టెను అత్తమీదికి విసిరేడు.

"నా మీద కోపం అత్తమీదెందుకురా సూపెడతావు కర్రిబావా? నాసు పక్కనే వున్నానుగద. కొడితే నన్ను గొట్టు. మా పెద్దమ్మ అసలికే గుండపిండయి పోయింది. అసలు నీకు మా బొట్టినివ్వడమే మా పెద్దమ్మ జేసిన మొదటితప్పు. నన్ను దత్తత జేసుకోకపోవడం రెండో తప్పు-కాదు కాదు ఇదిగిలాంటి కూతుర్ని కనడవే మొదటితప్పు" అన్నాడు బాంబులు.

చిన్నమ్మ పినతల్లి కొడుకుమీద ఈసారి లేచింది "పళ్ళు పీకీగల్లోన్నరే పింతల్లికొడకా. జేగర్తగా మాటాడు. దాసుకున్నాయన్నీ ఏదొంగసచ్చినోడోదొబ్బుకుపోనాడు. వొంటిమీద మిగిల్నాయి నువ్వీయిదంగ కప్పుబెట్టించేయిస్తన్నావు. నిన్న మాపిటికిఇక్కడికిదీసుకొచ్చికూకబెట్నావు. ఇప్పుడుదాక ఏటిజేసినార్రా అని ఎవులైన అడిగితే జపంజీసినావండి అని సెప్పుకోవాలి. చుట్టపోళ్ళింట్లో అంబలి దాగి, కాపీ కబ్బలో టీ సుక్కలు తాగి పోలీసు టేషన్లో పడిగాపులు కాస్తన్నాం. దొంగోడెవుడో మన సొమ్ములు కనుసుబెట్టుకుని ఊళ్ళంట దిరుగుతున్నాడు. మనం పోలీస్ టేషన్ల కాపరం పెట్టినాం. సాయానికొచ్చి ఇంత జేసినావు.. దత్తత జేసుకుంటే మాయమ్మని సువు ఎన్నికవుకులు పెట్టేసీవోడివో"

అప్పలనాయుడు గొంతుసర్దుకుని కుడి చేయి వరండా గచ్చుమీద ఆన్చి వెనక్కి తిరిగాడు "మీయమ్మ ఈ బాంబులు గోడ్ని దత్తతజేసుకుంటే ఈ సొమ్ము, బంగారం పోకపోను. దాసిన సొమ్ము కదా పోయింది. ఈడు దత్తుడయితే ఆట్ని దాసే కరమ్మవే నేకపోను. ఆడు ఆట్ని ఎప్పుడో అమ్మేసి రామకోవిల్లో పేకాటకు పెట్టీసును" అన్నాడతను.

దేవుడమ్మ నోట్లోని చుట్ట తీసి మళ్లీ తుపుక్కున వుమ్మి "నీ పిచ్చిగానీ ఆ యలమంద రాసోడీపాటికి ఆ బంగారం వొట్టుకుని ఏ రంగవో దొబ్బేసుంటాడు. ఆడిక్కడికి మరిరాడు. నాకు తెలుసును. రాడేరాడు" అన్నది. అని మళ్ళీ చుట్ట కొన ఎర్రగా పీల్చి, అడ్డపొగ బెట్టింది.

"ఈవాళగానీ ఆ రాసోడిక్కడికి రాకపోతే ఇక్కడీ పోలీసు ఎస్సయిగోడి గూబ పేలిపోతాది. ఈడి పూసీమీద గద మనం ఇక్కడ కూకున్నాం. జమాన్లందరికి సిగరెట్లు, టీలూ నిన్నమాపిట్నించి మనం గాదా చరపరా చేస్తన్నాం. ఆ రాసోడు రంగంలోవున్నా, అండమాన్లో వున్నా ఆడి పిలకబట్టుకుని నాకొచ్చి మన కాళ్లకాడపడేసేడూటీ ఈపోలీసుదే! వందికే ఆడికి గవర్నమెంటోడు జీతవిచ్చి మేపుతున్నాడు. జనం దగ్గర కాణీ,పరకా దండుకోని బతకండ్రా పోలీసు నంజికొడకల్లారా అని గవర్నమెంటోడు జెప్పినాడు. అదీ లాపాయింటి. ఆపాయింటి మనకి దెలుసును... మనకి దెలుసునని ఆ ఎస్సయికి దెలుసు. అందికే నన్ను జూసే ఆడికి వుచ్చ. మరొకడ్నయితే ఈపాటికి రిపోర్టిచ్చినావు గాదా... మరింక ఇంటికి ఛలో అనీసును" అన్నాడు బాంబులు.

అప్పల్నాయుడు చిరాగ్గా జుత్తు పీక్కున్నాడు. "మా అత్తనంజికి తగినోడివి దొరికినావురా బావా"

దేవుడమ్మకి అల్లుడిమీద కోప మొచ్చింది. నోట్లోంచి చుట్టతీసి "ఆ బంగా




రప్పిసదుగాని దొరికితే అందల సంగోరు మా సెల్లెలిగోరి బొట్టిడితే ఇచ్చేస్తాను. మిగిల్ని సంగోరు అమ్మేసి తిరపతెళ్ళి ఎంకిటేశ్వరుణ్ని జూసి వొస్తా. అందల సిగ్గానీ, నీ పెళ్లానికి గానీ తోనీ కూడా పక్కాడు. తెలుసుకోరో అల్లుడోడా" అన్నది.

"ఆఁ.. అది దొరికినప్పుడు మాట" అన్నాడు అప్పలనాయుడు.

బాంబులు లేచి నిక్కరు దులుపు కున్నాడు-"బంగారంలోసంగోరు ఇస్తావో నస్తావో తరవాత సూసుకుందారి. ఇప్పుడుకాక రూపాయి ఇలాగొడి పెద్దమ్మా! టీ సుక్కాదాగి సిగరెట్లు కొను క్కొని పారొస్తాను"

ఆ మాటలు విన్న దేవుడమ్మ పదు ప్పైన కళ్లమూసేసుకుని, నోట్లో పాచా పుడిగా చుట్ట పెట్టేసుకొని అడ్డపొగ మాపటంలో నిమగ్నం అయిపోయింది. నోటి బైటున్న కొసలోంచి పొగ సన్నగా పైకి దూసుకువస్తోంది.

"ఒలే...ఒలె పెద్దమ్మా! కళ్లూ, నోరూ మూసుకుంటే సెపుతెక్కాడికి పోనాయే? నాకో రూపాయిగావాలి" అన్నాడు బాంబులు.

పెద్దమ్మ తాపీగా చుట్ట తీసింది. కళ్ల తెరిచి-

"యినిపించింది నాయినా... యిని పించింది. చెవులున్నాయి, నేత్రాలు న్నాయి, నోరుంది... దబ్బులే లేవు. కరుసయిపోనాయి. అన్నీ నువ్వే వొడి కేసేవు. అనకూడదుగానీ ఆ రాసోడి తరవాత నాకు పెద్ద అన్నేయం జేసినోడివి నువ్వేనా" అన్నది.

బాంబులు రెప్పవాల్చకుండా దేవు డమ్మ వైపు ఓక్షణం చూసి —

"పెత్తల్లివి అయిపోనావుగానీ నేక పోతే జుత్తు పట్టుకుని తందునే నిన్ను. నేన్నీకు అన్నేయం జేసినా? 'ఓలమ్మ నా డబ్బులో, ఓలమ్మ నా నచ్చలో, ఓలమ్మ నా బంగారవో' అని కిందపడి పొర్లుతుంటే నెగదీసి, 'ఓలమ్మ పెద్దమ్మ ఏడకే. నానున్నానే. నీ సెల్లెలి కొడుకు నున్నానే. నీ బంగారప్పిసదు నీకిప్పించి, నీకు నేయం జరిపించే పూచీనాదే' అని నాన్జెప్పితే నువ్వేపుడు ఏటంటన్నావూ? నీకు యిసివాసం నేదు. నీ అల్లుడుగోడే టన్నాడు? పోయింది పొల్లన్నాడు. ఆ రాసోడ్ని ఇంటికి డీసుకొచ్చి,నిన్ను యమ యాతనబెట్టి కడాకి నీ సొమ్ము, బంగారం ఆడిసేతిల పెట్టినోడెవడూ ? అల్లుడు మాయదారోడే గదా ? ఆడు పోయింది పొల్లన్నాడు. నీ కూతురేటన్నాది? రాసోడి మీద నాకు అనుమానవే నేదన్నాది. మరి అప్పుడు నీకు దన్నుగా, సపోర్టిగా నిల బడ్డోడ్ని నానేగదేటే ? నన్నంతమాట అనేసేవు. నాకాడ దబ్బులు నేక బీడీ పీకలకి నిన్ను డబ్బులడుక్కుంతన్నా ననుకుంటన్నావేటి? ఇయిగో నిక్కరుజోబీ నిండా నోట్లేవున్నాయి. మరిగయితే నిన్నేఎందుకిడుగుతున్నాననుకుంతన్నావు నీపని మీద యిక్కడికొచ్చినాను గాబట్టి కిరుసులు నువ్వే బెట్టుకోవాలి. నిన్న ట్నించి నాకేటి కరమ్మని నీతో ఇందంట, ఈ పోలీస్ నాకొడుకులికి సలాంలు కొడుతూ తిరుగుతున్నానే. నీ కోసవే గదా" అన్నాడు.

"ఊకొట్టి సంజికొడుకు ఎవుడన్నా అగుపిస్తే నువ్వు ఎంతరొడ్డయినా మాటాడ తావుర బాంబులు బావా. పోలీస్ టేషన్కి రావడమే మా గానవైన పన్లాగ సెప్పుతున్నావు" అన్నాడు అప్పల

నాయుడు.

బాంబులు మూతిమీద చేయివేసి, లేని మీసం తిప్పి, తొడ గట్టిగా కొట్టి "ఈయాల్టి రోజుకి ఈ సింగారకోట తాలూకాలో రాసోడి మీద పోలీస్ టేషన్ల కుపోర్టిచ్చిన మొగోడు మరొకడెవుడైనా వున్నాడేటో సెప్పరా బామ్మరిదీ! నా జోడుతో నేనే కొట్టుకుంటాను. బస్తీమే సవాల్. నానొక్కడ్ని వున్నాను. ఇదిగో ఒరే బామ్మరిదీ....నాను ఇపుడు కలగాడ ఎళ్ళిపోతాను. నీకు దమ్ములుంటే, నీవు మగోడివైతే పోలీస్ టేషన్ల కత నడిపించు. అందాక ఎందుకూ కాళ్లు సేతులూ వాడి కీసుకోకుండా, వుచ్చగార్చిసుకోకుండా నువు ఎస్సయిగోరితో నాను సూస్తుండగ మాటాడు...సవాల్. గానవైన పనంటే మరొకడి ముండకి కన్నుగొట్టి, సెయ్యోట్టుకొని, తొంగడబెట్టడం కాదు రోరి బామ్మరిదీ" అన్నాడు కోపంగా.

ముసలామె కంగారుగా పైటకొంగున



ముడివేసి దాచిన డబ్బుల్లో ఒక విచ్చ రూపాయి తీసి బాంబులుకేసి విసురుతూ "ఒరేబాబు,..గుస్సాయిపోకరా. కోప్పడి పోకు" అన్నది.

ఆ రూపాయి గచ్చుమీద పడి తుళ్లి కింద మట్టిలో పడిపోయింది. బాంబులు వొంగి ఆ రూపాయి తీసి, కళ్లకు అద్దుకుని "నచ్చిందేవిని ఏవీ గాకండా ఇసిరేస్తన్నావు పెద్దమ్మా...తప్పుగాదా?" అన్నాడు.

నిన్ను నమ్ముకొని గంగలో దిగడవే తప్పురా సెల్లెలుగోరి బొట్టిడా—అనుకుంది దేవుడమ్మ.

అదే సమయంలో ఆ పోలీస్ స్టేషన్ ముందు మిత్తా పెదబాబు కారు ఆగింది. ముందు తలుపు దీసుకొని ఫకీర్రాజు దిగాడు, అతని వెనక గోపాత్రుడు దిగాడు.

"డెకాటీ నాకొడుకు లొచ్చినాడు" అన్నాడు బాంబులు దేవుడమ్మ ఇచ్చిన విచ్చ రూపాయి నిక్కరు జేబులోకి వేస్తూ.

ఫకీర్రాజు తెల్లగా మెరిసిపోతున్న గ్లాస్కో పంచె కట్టి లాల్చీ వేశాడు. పొందూరు కండువా మెడచుట్టూ వేసి ఓ కొన ముందువేపు ఎడమ జేబు మీద పడేలాగ జార్చేడు. ఓ చేత్తో పంచెకొన పట్టుకొన్నాడు. కాళ్ళకి మాసిన చడావులే వున్నాయి.

పాత్రుడి తల నూనెతో ఆ ఎండ పొడలో తళతళ మెరుస్తున్నాది. తెల్ల లాల్చీ, షరాయి వేసి హవాయి చెప్పులు వేశాడు. నల్ల కళ్ళద్దాలు పెట్టుకున్నాడు.

ఫకీర్రాజుని చూసి అప్పలనాయుడు లేచి నిలబడ్డాడు. 'నువ్వెప్పుడు బాగుపడతావు ఆవారి నాకొడుకా' అని అప్పలనాయుడ్ని తిట్టుకుంటూ బాంబులు ఆ అరుగు మీద హడావుడిగా కూచుని కాలు మీద కాలేశాడు. తల పొగరుగా ఎగరేసి గిరగా చూశాడు.

అప్పటికి చిన్నమ్మ వరండాలోని గోడకు జేరబడి పూగన్ను వేసింది. దేవుడమ్మ నోట్లోని చుట్ట తీసి, గచ్చుకు వేసి దాని నిప్పును ఆర్పి, ఆరిన చుట్టను చెవి సందుని దోపింది. కొప్పు సర్దుకొంది.

ఫకీర్రాజు, పాత్రుడూ కారు దగ్గర్నుంచి బయలుదేరి స్టేషన్‌వైపు నడక మొదలుపెట్టేరు. పది అడుగుల దూరం.

అప్పలనాయుడు రెండు అడుగులు ముందుకు వేసి ఫకీర్రాజుకి దండం పెట్టేడు.

అసలే మండిపోతున్న ఫకీర్రాజుకు ఆ దండంతో వెర్రెక్కిపోయింది.

"ఏవిటోయ్? ఏవిటోయ్ః ఇదేవిటిదేవిటిది? చిత్రవోయి చిత్రం. పిలకట్టుకొని ఈడ్చుకు రమ్మని నా ఇంటికి పోలీస్ జనాన్ని పంపి, ఇక్కడకు ఒచ్చింతర్వాత దండాలెడుతున్నావేటి? ఇదేవి మర్యాద" అన్నాడు.

"నాకేటీ తెలీదు మారాజా....నాను ఒద్దనే చెప్పినానండి. కానీ మాయత్త మాకాని మనిసండి. మొండిశికండిదండి. ఒకులు చెప్పిన మాట ఇనదండి. రాజులు అలాంటోళ్లు కాదే అత్తా అని నాను చెప్పేనండి. అది ఒప్పుకోనేదండి. అలాంటోళ్లు కాకపోతే అంతలేసి నోగిళ్లు ఎలాగ కట్టించినారు అంటాదండి. ఇంక అలాంటి మనిసితో ఏటండి మాటాడతాం"—అన్నాడు అప్పలనాయుడు.

"ఒరే అల్లుడోడ! సొమ్మా, బంగారం వొట్టుకొచ్చినారో నేదో ముందుకనుక్కో" అని చెప్పింది ముసలామె కూచున్న




చోటునుంచి లేవకుండానే.

"పెద్దమ్మా! నీ అల్లుడి మాటలు ఇనిపించాయా? సెక్కంగా, సెబాసుగా మాటాడేడు. నాకు ఏటీతెలీదు మా ప్రభో-అంతా మాయత్త సంజే చేసింది అని సెప్పినాడు. మనింటికి కన్నవేసినోడ్ని బట్టుకుని మారాజా,మా ప్రభో అంటేమనసొత్తుమనకి దక్కుతదా ? నాసింత కవుకులు పడి చేసిన పనంతా నీ అల్లుడు ఒక్కమాటతో పొల్లు చేసీసేడు. అలమండోళ్లకి మన వంటే ఇకనేటి బయ్యం" అన్నాడు బాంబులు కోపంతో మండిపోతూ.

ఆ కేకలకి చిన్నమ్మ నిద్రలేచి, ఫక్కీరాజుని, పాత్రుడ్ని,వాళ్ళకు ఎదురుగా నిల్చున్న భర్తను చూసి చటుక్కున లేచి నిల్చుంది. పైట భుజం నిండుగా కప్పుకుంది.

"సువు బేగెళ్లి టీ నీళ్లు తాగి పార్రారా నాయినా" అని దేవుడమ్మ బాంబుల్ని బతిమాలింది.

"నానిప్పుడు టీ నీళ్ళు తాగన్లే. ఈళ్లొచ్చేసినారు కదా! కతానాయికుడ్ని నాన్లేకపోతే ఎలాగ" అన్నాడు బాంబులు లేచి నిల్చుంటూ.

ఫక్కీరాజు మీసాలు సర్దుకుని, బాంబులు వైపు కోపంగా చూసి కదిలాడు.

"మరైతే అయినాక ఒట్టుకెళ్దూగాని ఆ రూపాయి ఇలాగిచ్చి.. నాకాడ పుంచుతాను" అన్నది దేవుడమ్మ.

బాంబులు నవ్వేడు—

"దబ్బులంటే సీకింతంత బెపత కాదో లమ్మ..ఇలాగే కూడబెట్టి కూడబెట్టి ఆకలికి పొపుగూరి డెకాటి నాయాళ్ళకి దొబ్బెట్టినావు"

మెట్లెక్కి పోలీస్‌స్టేషన్ వరండాలో అడుగుపెట్టిన ఫక్కీరాజు తలతిప్పి మళ్ళీ బాంబులుకేసి ఆగ్రహంతో చూసేడు.

వీడెవడోయి బడితెలాగున్నాడు. ఛీంపోతులాగ మొహం వీడూను. ఫక్కీరాజు వరండాలో ఆగేడు. అతని వెనుకనే పాత్రుడు నిల్చున్నాడు.

పోలీస్‌స్టేషన్‌లో నుంచి నల్లగా, లావుగా వున్న ఓ పోలీసు కానిస్టేబుల్ బైట వరండాలోకి వచ్చాడు.

ఫక్కీరాజు ఓ చేత్తో పంచె చెంగు, రెండో చేత్తో కండవా కొన పట్టుకుని, గంభీరంగా మొహం పెట్టి "నమస్సండి.. నిన్న మా లోగిట్లోకి దయచేసింది తమరేనా?" అని అడిగాడు.

ఆ పోలీసు గాభరాపడి "నమస్సండి.. నేను కాదండి..మీరెవురో నాకు తెలీదండి. నోపుల ఎస్సయిదొరగారున్నారు" అనేసి గబగబా మెట్లు దిగిపోయాడు.

పోలీస్ స్టేషన్ వరండా దాటిన తర్వాత ముందునో గది వుంది. అది ఖాళీగా వుంది. ఓ మూలను ఓ స్టూలుంది. ఆతర్వాత మరో గది వుంది. అందులో ఎస్సయి కూర్చుని వున్నాడు. అతను కూర్చున్న టేబిల్‌కు ఇవతల రెండు కర్ర కుర్చీలున్నాయి.

ఎస్సయి ఎర్రగా, సున్నగావున్నాడు. తలమీద జుత్తుబాగా పల్చబడిపోయింది. గడ్డం, మీసాలూ నున్నగా గొరుక్కున్నాడు. కళ్ళలో ఎర్ర జీరలున్నాయి. కింద పెదవి కింద నల్లని పులిపిరి కాయ వుంది. వయస్సు నలభై పైనే ఉంటుంది. గదిలోకి అడుగుపెట్టిన ఫక్కీరాజు వేపు అతను పరీక్షగా చూశాడు.

"నమస్తండి...నా పేరు ఉప్పులపాటి ఫక్కీరాజు... అలమండ. నిన్న తమరు కబురంపించేరు" అన్నాడు ఫక్కీరాజు రెండు చేతులూ ఎత్తి సమస్కరిస్తూ.

పాత్రుడు కూడా పోలీసు అధికారికి భక్తితో దండం పెట్టేడు.

"రండి ... కూర్చోండి" అన్నాడు ఎస్సాయి.

"చితం" అంటూ ఫకీర్రాజు కండువా సరిచేసుకుని, కుర్చీ చప్పుడు చేస్తూ లాక్కొని కూర్చున్నాడు. గోపాత్రుడు జంకుతూ నిలబడిపోయాడు.

"మీరూ కూర్చోండి" అన్నాడు ఎస్సాయి.

"చితం. అతను పాత్రుడులెండి"

ఎస్సాయి కనుబొమలు ముడిచాడు– "పాత్రుడయితే ?"

"చితం.. గోపాత్రుడని నా శిష్యుడు. నా దగ్గిర విద్య నేర్చుకుంటున్నాడు"

"ఏ విద్య ?" అని ఎస్సాయి కుతూహలంగా అడిగాడు.

"ఇంకే విద్యండి..అదేనండి.. కలగాడ్ల మా అప్పల్నాయుడింట్లో చూపించిన విద్యేనండి" అన్నాడు గుమ్మానికి ఆనుకొని నిల్చున్న బాంబులు.

ఎస్సాయి బాంబులుకేసి కోపంగా చూసి "నువు సరిగ్గా నిలబడవోయ్..నేను పిలిచేవరకూ వరండాలో కూర్చో" అని చెప్పి–

"ఏ విద్యండీ?" అని మళ్ళీ అడిగాడు.

"చితం..వైద్యవిద్యండి"

"మీ శిష్యుడైతేనేం. కూర్చోమనండీ"

"పెద్దలంటే పాత్రుడికి చాలా గౌరవమండి.. పెద్దల సమక్షంలో కూచోడు" అన్నాడు ఫకీర్రాజు.

"ఫర్వాలేదు. కూచోండి" అన్నాడు ఎస్సాయి.

పాత్రుడు హడావుడిగా కుర్చీ లాక్కొని బుద్ధిగా కూర్చున్నాడు.

కూర్చుని కళ్ళద్దాలు తీసేసి పక్క జేబులో పెట్టుకున్నాడు.

"తమ నామధేయం ఏవిటో శెలవివ్వలేదు" అని ఫకీర్రాజు అడిగాడు.

"నన్ను జహంగీర్ అంటారు" అన్నాడు ఎస్సాయి.

"బహుచక్కని పేరు. నా పేరు ఇందాకే తమకి మనవిజేసేను. ఇతడు గోపాలపాత్రుడు. గోపాత్రుడంటారు. తమరు మా లోగిట్లోకి పంపిన వర్తమానం ఈవాళ పొద్దున పేటలోవున్నప్పుడు మాకుచేరింది. తెప్పుల్చుకొని వచ్చేసరికి ఈ వేళయిపోయింది. పోలీసువారంటే మాకు బహుగౌరవం. కానీ ఇటునుంచి అటూ, అటునుంచి ఇటూ మాకు రాకపోకలు ఇంతవరకు లేవు. నేను ఎన్నడూ కూడా పోలీస్‌స్టేషన్‌కు వచ్చినవాడ్ని కాను. చిత్తగించారా?" అని ఉపన్యాసం మొదలు పెట్టాడు ఫకీర్రాజు.

"నేనూ అంతేనండీ! ఇంతవరకూ ఒక్కసారిగూడ జైలుకు వెళ్ళలేదు. మా వూళ్ళో పోలీస్‌టేసన్ నేదండి. అంతమంది రాజులున్నకాడ పోలీస్‌టేసన్ లేకపోవడం అన్యాయమండి" అన్నాడు పాత్రుడు.

ఎస్సాయి చిరునవ్వు నవ్వి పూడుకొన్నాడు.

"మా కుటుంబం చాలా ఉన్నతమైనదండి. మేం సూర్యవంశక్షత్రియులమండి. ఇక్కడ విజయనగరం సంస్థానంలోని పూసపాటి వారయితేనేమి, అటు తుని మీర్జావారయితేనేమి, అక్కడ మొగల్తూరు సంస్థానాధీశులయితేనేమి మాకు బంధువులండి. నిప్పులాంటి వంశమండి మాది. దర్జాగా, హోషగా, గౌరవంగా కాలక్షేపం చేసుకొస్తున్నామండి.అటు వుండగా నిన్న సాయంత్రం తమరు పంపిన పోలీస్ జమానుగారు మా ఆవరణలో అడుగు

 

పెట్టాడండి. అటువంటి దుస్థితి మాకు గానీ, మాలోగిటికిగానీ గతంలో ఎన్నడూ లేదండి. నేనేమి...దొంగతనం చేయత మేమి? నావలన ఉపకారం పొందినటువంటి ఒక శూద్రుడు ఆ అభాండం నా నెత్తిన వెయ్యడవేమి? జాంగీపుగారయిన తమరు అది నిజవని భ్రమించడవేమి? ఊరంతా కోడయి కూయడవేమి? అయ్యయ్యయ్యో. అయ్యో ఏమి నామోషి? ఎంత నామర్దా? అంటూ ఫకీర్రాజు ఎస్సాయికేసి చూశాడు.

అతను వింటున్నాడు.

ఫకీర్రాజు మీసాలు జాగ్రత్తగా సర్దుకొని మళ్ళీ మొదలుపెట్టాడు-

"పోనీ ఈ గోపాత్రుడొక్కడిమీదా అంత నిందబడితే అర్థంవుంది. ఎందువల్లననగా ఈతని వృత్తి వైద్యం. జనం మీదపడి బతకవలసినవాడు గనుకనూ, వయసులో చిన్నవాడు గనుకనూ మనం ఈషణ్మాత్రమైనా సందేహించడానికి వీలుంది. కాని నేను? ఒకరికి పెట్టడవే గాని ఒకరి సొమ్ము ఎన్నడైనా తిన్నానా? తమకు తెలిసే వుంటుంది. నా సొమ్ము ఈ భూప్రపంచకంలో ప్రతివొక్కడూ ఎప్పుడో ఒకప్పుడు తినేవుంటాడు. నా పంటపొలాలు మగతాకుచేస్తున్న రైతులు నాసొమ్ముతిన్నారు. కాంగిరేసువాడి బేపన పరిపాలనవల్ల వచ్చినటువంటి సాగు హక్కులవల్ల నా సొమ్ము తనఖాదార్లు దిన్నారు. నా మామిడితోట కొమ్మలూ, చెట్లూ దొంగచాటుగా నరికేసి అమ్మేసుకున్న తోటకాపులు నా సొమ్ము తిన్నారు. ఆ తోట్లోని కాయలు కలకత్తా, ఢిల్లీ పంపించిన హిందీ సావుకార్లు నా సొమ్ము తిన్నారు. చిత్తగిస్తున్నారా? ఊర్లోని పాటకజనం యావన్మందీ నాసొమ్ము తిన్నారు. నాసొమ్ము పిచ్చికలు తిన్నాయి; పొలాల్లోని, ఇంట్లోని ఎలకలు తిన్నాయి పిట్టలు తిన్నాయి, కోళ్లు తిన్నాయి. నా సొమ్ము కుక్కలు తిన్నాయి. ఈ పాత్రుడు తిన్నాడు. కడకు నిన్న తమరు పంపిన పోలీస్‌జమానుకూడా నాసొమ్ము తిన్నాడు. ఈరోజు నామీద ఇంత ఘోరమైనటువంటి అపనింద వేసిన ఆ ముసల్ది రెండురోజుల్లక్రితమే నా సొమ్ముతో కోలుకొని బతికి బట్టకట్టింది. ఇన్ని వైనాలుగా ఇంతమందికీ నా సొమ్ము పెట్టి ఈరోజు ఇంత అవమానం పొందుతున్నానంటే నా మనస్సు ఎంత క్షోభపడిపోయి, ఎంత బాధపడిపోయి, ఎంత ఆయొక్క ఇదయిపోతుందో జాంగీపుగారూ... తమరే యోచించండి"

"పాతిక సంవత్సరాలనుంచి కడుపు కాల్చుకుని ఎంగిలిసేత్తో కాకినిగూడ కొట్టకుండా, కన్నకూతురికిగాని, దాన్ని కట్టుకొన్న మా కర్రిబావగ్గాని, సెల్లెలిగోరి బొట్టిడినయిన నాకుగాని పెట్టకుండా రోలీరోలీగా, దమ్మిడీ దమ్మిడీగా దాసుకున్న సొమ్ము, పిసరుపిసరుగా కూడబెట్టిన బంగారం ఒక్కసాలేపోతే మా పెద్దమ్మ ఎంత ఇదయిపోయి ఎంతఅదయిపోయి ఇంకేటయిపోతాదో కూడా తమరు ఆలోసించండి ఎస్సాయిగోరూ" అన్నాడు బాంబులు ఆ గదిలోకి వచ్చి ఎస్సాయికుడి చేతివేపు నిల్చుని.

ఎస్సాయికి బాంబులుమీద కోపం వచ్చింది. "ఏయ్! నిన్ను అవతల వరండాలో కూర్చోమని చెప్పానా లేదా?"

"ఆయ్ ... సితవండి" అన్నాడు బాంబులువెటకారంగా, "పోలీస్‌టేసన్లంట. కేడీనాకొడుకులికి జేసినంత మర్యాద మానాటోలికి ఎందుకు జేస్తారు లెండి. అల్లిద్దర్నీ కుర్సీల్లో కూకడబెట్టి మమ్మల్ని

బయటకి పొమ్మంటన్నారు" అనేసి బాంబులు బయటకు వెళ్ళటానికి సిద్ధమయ్యాడు.

ఫక్కీరాజు కోపంగా లేచినిల్చున్నాడు.

"జాంగీరుగారూ! ఇతగాడు ఎవరోగాని అడ్డూ, అదుపూ లేకుండా చిత్తానుసారం పేల్తున్నాడు. ఏమిటా వాగుడేవిటి? రాచ పుట్టుకబుట్టినా సాత్వికం గాబట్టి ఇంత వరకు సహించాను. తమరిముందే చెబుతున్నాను. అతగాడు మళ్ళీ పేలాపన గానీ చేశాడా ఈటెబెట్టి పొడిచేసాను. అతన్ని అదుపుచేసే బాధ్యత మీదే"

'ఓసోసి ఏటోరిబాబు. అంత సపగ్గుంది ఈటిబెట్టి పొడిసీడవంటే. నోరూ వాయీలేని జంతువుల్ని పొడిసీసినట్టును కుంటన్నాడుగావాల' అనుకుంటూ బాంబులు సాధ్యమైనంత నెమ్మదిగా, నిటారుగా నడుస్తూ బయట వరండాలోకి వెళ్ళాడు.

ఎస్సయి అరచేతిని చూపి ఫక్కీరాజును వారించాడు.

"రాజుగారూ! కూర్చోండి. ఆవేశపడొద్దు. ఇంతసేపు మీరు మాట్లాడేరు. ఇక వినండి. నిన్నమధ్యాహ్నం...." అని ఆరంభించి బాంబులు సారథ్యంలో దేవుడమ్మ, అప్పలనాయుడు, చిన్నమ్మ స్టేషన్‌కొచ్చి ఫలానా ఫలానా మనుషులు తమ బంగారు నగలూ, నగదూ అపహరించేరని ఫిర్యాదు చేయటంవరకూ చెప్పేడు. చెప్పి—

"అయితే నేనా ఫిర్యాదు కాయితం తీసుకొన్నాను గానీ దాన్ని నమోదు చేసుకోలేదు. మీ కోసం కబురంపేను. పోతే— ఆ బంగారం, నగదూ పోయిన మాటనిజవే అని నమ్ముతున్నాను. మీరు, పాత్రుడూ వాళ్ళని విజయనగరంలో వొదిలేసి వచ్చినరాత్రే ఆ దొంగతనం జరిగింది. మీరే ఆపనిచేశారని ముసల్ది గట్టిగా నమ్ముతోంది. నేను చాలా ప్రశ్నించాను...."

"నిన్నరాత్రి నేను విజయనగరం నుంచి పాత్రుడ్ని తీసుకొని అలమండ వచ్చిందిలగాయితూ నేను మా లోగిట్లోనే వున్నాను. తునినుంచి రాజా మీర్జా నల్లపరాజ సత్యసూర్య నారాయణరాజుగారని మా బావమరిదిగారుదయచేశారు. ఆయనతో ఆరాత్రిపూర్తి కాలక్షేపం. తమరు కావలిస్తే విచారించండి...నాయోగ్యత ఎటువంటిదో మీరు దేశం మొత్తం మీద వాకబు చేయచేయవచ్చు. ఇక పాత్రుడి విషయానికి వస్తే అతను కూడా నాకు తెలిసినంత వరకూ యోగ్యుడే. కనీసం పైకిఅలా కనిపిస్తాడు. చిత్తగిస్తున్నారా? ఒక్క వైద్యం విషయంలో ప్రమాదకారిగానీ మిగిలిన విషయాల్లో ఫరవాలేదని నా నమ్మకం. కానీ తమరు శెలవిచ్చినట్టు సొమ్ము పాపిష్టిది. కనుక ఈతడా రాత్రి ఎక్కడున్నాడన్నది తేలవలసివున్న విషయం. తమరేం శెలవిస్తారు?" అని ఫక్కీరాజు అన్నాడు.

అంతవరకూ కుతకుత వుడికిపోతున్న గోపాత్రుడు చటాలున కుర్చీలోంచి లేచి పోయాడు—

"ఏటయ్యోయ్ రాజూ, ఏటా మాట్లేటి! నీ వరస జూస్తుంటే చివరికి 'పాతుర్డే ఈ దొంగతనం జేశాడని నా అనుమానం. తమరేంశెలవిస్తారు?' అని అడిగేలాగున్నావు. మనూరోడేకదా...రాసోడసిజెప్పి నేను చిత్తం బత్తెం అని, మర్యాదిచ్చి మసులుతున్నాను. హద్దులు దాటిపోతున్నారు ఫకీరుబాబుగారూ!"

ఫక్కీరాజు గాభరాపడ్డాడు. "కూచో

వయ్యా మొగుడా! నిన్నేపీ అనలేదు నేను. నిన్ను నామనిషికిందే చూసుకొంటున్నాను. బలేవాడివయ్యా. ఆరాత్రినేనెక్కడున్నానో నాకు తెలిసినట్టే నువ్వెక్కడున్నావో నీకు తెలుసు. నా సంగతి నేను చెప్పుకొన్నట్టే నీసంగతి నీవు చెప్పుకోవాలి. నువ్వెక్కడున్నావో చెప్పేదా? రాత్రి ప్రతిరాత్రిలా నువు ఎర్రసన్నాసమ్మ దగ్గిరున్నావు. ఈ సంగతి నేను చెప్పితే ఏవన్నా మర్యాదగా వుంటుందేటోయి. అందుకని నేను అలాగన్నాను. నా మనసు కనిబెట్టలేక పోయావు"

"ఎర్రసన్నాసమ్మ ఎవరండీ?" అని ఎస్సయి అడిగాడు.

"చితం. తమరా ప్రశ్న మాపాత్రుడ్నే అడగండి. అసలేకోపంతో మండిపోతన్నాడు. ఏవోయ్ ఫకీర్రాజూ అనీ సేడు ఇందాక. ఈసారి ఏవిరా అనేస్తాడు"

గోపాత్రుడు ఓ క్షణం నిదానించి కూచున్నాడు. పెదాలు తడుపుకొని "చితం. ఆ మనిషి నా పేషెంటండి..." అన్నాడు.

ఫకీర్రాజు నవ్వేడు. "అవునండి షేషెంటే. ఒక్కరాత్రిగాని గోపాత్రుడు కనబడకపోతే చలిజ్వరం వచ్చేస్తాది''

"ఏటండి పోలీస్‌జమాన్‌గోరూ ! దొంగల్ని పిలిపించి ఆళ్ళతో వూసులేటండి. తవురుగోరు మొకమాట పడిపోతన్నట్టుంది. వుండండి. ఆయడగవలసిన నాలుగు ముక్కలూ సూటిగా నానే మొకం మీద అడిగేస్తాను'' అంటూ దేవుడమ్మ లోపలకివచ్చింది.

ఆమెకు దండ పట్టుకుని ఊతం ఇచ్చే నెపం మీద బాంబులు కూడా వచ్చాడు.




దీని సిగదరగ పోలీసును జూసినా బయ్యెవెయ్యలేదుగానీ ముసిల్దాన్ని చూసే సరికి దడ పట్టుకుంటున్నది... అనుకొన్నాడు గోపాత్రుడు కుర్చీలో ఇటు దిరిగి సర్దుకు కూచుని.

ఫకీర్రాజు గుటకలు మింగి, తరువాత ముక్కుపుటాలు ఎగరేసి, కాలుమీద కాలు వేసుకుని కూచున్నాడు. నాకేటి బయ్యం అనుకుంటున్నట్టుగా అగుపించాలని అతని తాపత్రయం.

దేవుడమ్మ గోడకు చేరబడి గచ్చుమీద కూలబడింది. ఓసారి పాత్రుడ్ని, ఫకీర్రాజుని చీదరింపుగా జూసి, తరువాత రెండు చేతులూ ఎత్తి ఎస్సయికి దండం పెట్టింది.

"పోలీస్‌మారాజా! నాకు కురిసీవొద్దు. నాకు నీ వూసువొద్దు. మూడ్రోజులాయి కంటిమీద కునుకునేదు. అన్నం మెతుకు నోట్లో పెట్టలేకపోతన్నాను. ముసిలి ముండను. నా బంగారప్పిసరు నాకిప్పించీ తండ్రీ...సచ్చి నీ కడుపున పుడతాను. బాబు రాజుగోరండీ ! తవురికి ఇది నేయంగుందా? నా పీక పిసికిస్తే ఎంతో నా బంగారప్పిసరు నాకు కాకండ జేస్తే అంతే. తవురికి ఏటి లోటని ఇంత పన్జేసె నారు నాభూమీ పుట్రా, నా బతుకు అంతా

కలిసి మీ నోగిట్లో మీ హాయిఖాన దొడ్డంత నేదని తప్పరే చెప్పినాను. సన్నింత కపుకులు బెట్టిబడులు నామెడ జివలు ఇరిసేసి, సంపేసినా బాగుణ్ను" అని ప్రారంభించింది దేవుడమ్మ.

"నాయురాలా! నిన్ను నేను కపుకులు బెడుతున్నానో, నువ్వె నన్ను హింస పెడుతున్నావో ఆ భగవంతుడికి తెలుసు. జీవితంలో తెలిసో తెలియకో, అజ్ఞానం వల్లనో, ప్రారబ్ధకర్మ వల్లనో ఒకేఒకసారి నీ గడపతొక్కాను. ఆ తప్పుకు ప్రాయశ్చిత్తం అయ్యే అయిపోయింది. ఊరిలో నవ్వుల పాలయ్యాను, నూటయాభై రూపాయల చేతి చమురుతో బైటపడ్డాను. మళ్ళా ఇపుడీ రొష్టేమిటి? అయ్యోరామ ఈ నిందేమిటి? నీముష్టి బంగారప్పిసరే కావాలా నాకు" అని ఫక్రీరాజు అన్నాడు.

"అది ముష్టి బంగారమా? పిసరంత బంగారమా?" అని ముసలామె ఆశ్చర్యపోయింది. "ఒక నాను, ఒక పట్టెడ, దుక్క–








ముక్కలాంటి ముక్కుర, ఇన్ని వెండి
రూపాయలు - ఇయ్యాల్టి రోజున కొన్ని
వందల రూపాయిల ధరజేస్తాయి...."

"కొన్నివేల రూపాయల విలువజేసే నప్పటికీ నాకేమిటి సంబంధం? భగవంతుడి సాక్షిగా నేను ఒకే ఒకసారి నీ గడప కొచ్చాను.అప్పుడు మీఅందరున్నారు.నేను మీయింటికి ఎందుకువచ్చేను? నీ అల్లుడు కాళ్ల మీదపడి బతిమాలితే పోనీలేవోయి మన రైతాంగంగదా అని జాలిపడివచ్చాను. వంశగౌరవం,ప్రతిష్ట–ఇలాంటి విషయాలు నీకు అర్థంకావు కాని నామీద నువ్వటువంటి నిందవేసేంతరువాత నేను ఎంతో మధన పడి, షోభిస్తున్నానో తెలుసునా? మా మొఖాసాలు పోయాయి, మా మడి మాన్యాలు పోయాయి. నా యింట ఎంత జవహారీ వుండేది? జవహారీ అంటే నీకు అర్థం తెలుసునా? వడ్డాణాలు, కాసుల పేర్లు, చంద్రహారాలు, పాపిడిశేర్లు, జూకాలు, కంటెలు, బావిలీలు, దంతకడియాలు, జడకుచ్చులు, నాగరాలు, హారాలు, పొళ్ల దుద్దులు, కడియాలు. గాజులు, పిళ్ళేళ్లు, పచ్చలవుంగరాలు, మురుగులు, పోచీలు, వజ్రాల హారాలు, బంగారపు మొలతాళ్లు మాబావాజీగారి చిన్నతంలో మా యింట జడ్డీ పెట్టెడు జవహారీ వుండేది. అంత బంగారాన్ని, అంత సంపదనీ చేజేతులా పారేసుకున్న వోళ్లైన కుటుంబం మాది. నీ నానుతాడూ, నీ పట్టెడముక్కా నాక్కా పలసి వచ్చేయా? కొంచెం యోచించు"

"నువు చెయ్యకపోతే నీతోటొచ్చిన దొంగమొకం పాతుర్దుగోడు చేసుంటా దండి రాజుగారూ" అన్నది దేవుడమ్మ.

"ఇద్దరూ చేయకపోయి వుండొచ్చు. ఇద్దరూ కలిసి మరో మనిషిని పంపించి మిద్దెకి బొక్కెట్టిగదిలోకి దింపిపుండొచ్చు. అక్కడ, ఆ సందుగు పెట్టికింద మా పెద్దమ్మ ఆ బంగారపు పిసర ముంతలో పెట్టి కప్పెట్టిన సంగతి కలగాడ్ల అందరికీ పదిహేనేళ్ళుగా తెలుసు. కానీ ఒక్కనాడు కూడా ఇంత దొంగతనం జరగలేదు. మీ కిద్దరికీ తెలిసిన రేతిరికే ఈ పని జరిగి పోయింది. మావేటి తెలివితక్కువ నన్నాసోళ్ళవనుకుంటున్నారేటి? మాకూ దేవుడు బుర్రలిచ్చాడు. మాం కూడా రాసోడిపాటి ఆలోసించగలం" అన్నాడు బాంబులు.

"ఏయ్ నువు మాటాడకోయ్" అని ఎస్సయి బాంబుల్ని కసిరాడు. బాంబులికి ఎస్సయిమీద మండుకొచ్చింది.

"ఏటండోయి పోలీస్ ఎస్సయిగోరూ! ఇందాకటినుంచి సూస్తన్నాను. నాను నోరిప్పితేకరిసేసీలాగకలబడిపోతన్నారు. మావేటి దిక్కూ దివాణంలేనోళ్ళవని గదా మీ అలుసు. మాం నీకంటికి నాదా రోళ్ళలాగా కానొస్తన్నాం కాబట్టే ఇంత అలుసయిపోనాం.ఇదే దొంగతనం ఆరాజు గోరింటికాడ జరిగిపోయుంటే, మా మీదే అనుమానంగుంటే ఈపాటికి ఆకాశం, భూమీ బొక్కడిపోను. మమ్మల్నంపర్ని కట్టగట్టి బొక్కల్దోసి, ఎవుకులు ఇరిసేసి, మనాల కిందేసి మట్టేసి, తిత్తితీసేసి, చమడాలొలిసేసి వుందురు. కానీ ఇపుడేటి సేస్తన్నారు? సొమ్ముపోయి, నష్టపోయి లబోదిబోమంటున్న మా పెద్దమ్మనీ, సాయంగ వొచ్చిన నన్నూ నోరుమూసు కోని వుండమంటన్నారు. వసుమానస్తుల్ని సిత్తం, బత్తెం అని నెత్తిమీదికి ఎక్కించు కుంటన్నారు. ఇది అన్నేయం గాదా? లేషన్లంటె అంపర్ని ఒక్కలాగసూడొద్దా"

ఎస్సయికి తిక్కరేగింది. కుర్చీవెనక్కి తోసేసి లేచి నిల్చున్నాడు "అసలూ–నువ్వసలు నిజంగా ఈపెడికి చెల్లెలి కొడుకువేనా ? నువ్వసలు నిజంగా సాయానికే వచ్చేవా ? బ్రోకర్ పనిచేసె

 

జెల్లకొడ్డానికి వచ్చేవా ? వుండు అదీ తేల్చేస్తాను. ఏయ్ నాయురాలా....ఇతగా డెవరు?"

"ఆవిడ మా పెద్దమ్మని పదిసుట్లు చెప్పినాను"

''మావోడే నాయినా మా సుట్టపోడే.. మారాజా" అన్నాది దేవుడమ్మ.

''మాయమ్మ మా దేవుడు పెద్దమ్మకి పిన్నల్లి కూతురు" అన్నాడు బాంబులు.

"సుట్టపోడేగానీ నిన్న మాపుటేళ ఇక్కడికొచ్చిన కాడ్నించి ఇరవై రూపాయలు వాడికి సేడు మారాజా. టీనీళ్ళం తాడు, కాఫీ నీళ్ళంతాడు, బీడీలంతాడు, టిపినీ అంతాడు, రాజుల వాటేళ్ల మాంచం కూరంతాడు.దొంగ సచ్చినోడు వాడికేస్తన్నాడు తండ్రీ. బంగారప్పిసరు గానీ తిరిగి దొరికిస్తే తవురిగోరికో వంద రూపాయిలు, ఆడికోయాపై రూపాయిలు ముట్టజెప్పాలని షరతు బెట్నాడు. సుట్ట పోడేగానీ దొంగమాలోడి కొడుకు వైతీ మారాజా, నాయల్లుడూ, నాకూతురో నా కరమానికి నన్నొగ్గేసినపుడు ఈడు నానున్నానే పెద్దమ్మా అని సాయానికి ఒచ్చినాడు గాదా ? వది మంచిగుణం కాదా? ఆడి మీద తవురిగోరు కేకియ్యేడం నేయంగున్నాదా తండ్రీ. ముసిల్దాన్నిగదా నడేలేపోతన్నాను. నన్ను దీసుకుని బస్సు లెక్కించి వింత ధూరం పోలీసు టేషనికి తీసుకొచ్చినాడు గదా వది మంచి గుణం గాదా తండ్రీ? ఇప్పుడు గూడ నాకూతురు, నాయల్లుడు అవతల ముంజూర్లొకూకు దోని వూసులు జెప్పుకుంటున్నారు గానీ నోపలికి రానేదే. విప్పుడు కూడ ఈ సుట్టపోడే ఒచ్చినాడు. నాకోసం మీసేత సేవాట్లు, సెప్పుదెబ్బలు తింటున్నాడు. నిది మంచి గుణం కాదా బాబయ్యా? మంచోడేగానీ సిన్న పిసరు కక్కుర్తి. కానీ సుట్టపోడు మంచోడే" అన్నాది దేవుడమ్మ.

"విన్నారండి ఫకీరుబాబూ ముసిలి ముండ లాజిక్కు. ఇది మామూలు మనిసి కాదండి...అసాధ్యురాలు" అన్నాడు గోపాత్రుడు.

ఫక్కీరాజు మాట్లాడలేదు.

"మంచోడే. నాకు వంద రూపాయిలు లంచం ఇవ్వాలన్నాడుగదూ-ఆ మాట ఓ కాయితం మీద రాస్తాను. నువు వేలి ముద్రెయ్యి. మంచోడ్ని కొన్నాళ్ళు కట కటాల్లోవుంచి ఇస్త్రీ చేయిస్తాను" అన్నాడు ఎస్సయి.

"బాబ్బాబు కోపమైపోకండి మారాజా! నంచంకాదు కానకివ్వాలన్నాడు. ఆడా ముక్క అనేలేదు. నానే ముసిలి ముండని గదా - గాబరా అయిపోనాను" అన్నాది దేవుడమ్మ.

ఎస్సయి వళ్ళు విరుచుకున్నాడు. తరువాత బాంబులుకేసి చిరాకుగా చూస్తూ "ఏవోయ్ నువు బైటకు నడు. నిన్ను చూస్తుంటేనే నాకు ఒళ్లు మండిపోతున్నది. పద. అవసరమైతే నేనే కేకేస్తాను" అన్నాడు.

బాంబులు కదలలేదు.

"బైటకి వెళ్తావా? లోపలికి వెళ్తావా?"

"నోపలి కంతే?" బాంబులు అనుమానంగా అడిగాడు.

"నోపలికంతే బొక్కలోకన్న మాట. ఒరే-ఓరి ఎర్రిమాలోకవా ఎందుకొచ్చిన తంటాగాని నువు బైటికినడు. ఏదైతే అదే అవుతాది" అన్నది దేవుడమ్మ.

"బొక్కలుంపవలసినోళ్లు కుర్చీల మీద కులుకుతుంటే నానెందుకు నోపలి కెళ్తాను. నాకేటి కరమ. నాను బైటికే

ఎలాగునుగానీ... పెద్దమ్మా జెగర్త. కాయితాల మీద వేలిముద్దరెయ్యమంటే నన్ను పిలు. జేగర్త. కేకలేస్తే బెగిలిపోకు. నన్ను పిలు" అనేసి బొంబులు కాళ్లు చప్పుడు చేసుకుంటూ బైటికి నడిచాడు.

"ఎలాగున్నాడో చూద్దురూ...నన్ని కల్లు పౌత్రంలాగ" అన్నాడు గోపాత్రుడు.

"సరేగాని పాత్రుడుగారూ! మీరు బైటకెళ్ళి బస్టాండు దగ్గిర వరాలమ్మ కబ్బులో కాఫీ తాగేసిరండి. ఈలోపల నేను రాజుగారితో కాస్త మాటాడాలి. దేవుడమ్మా! నువు కూడా బైటకు వెళ్ళి కాసేపు కూర్చో..."

పాత్రుడు కదల్లేదు "ఎందుకులెండి. నేను కాఫీ తాగేసే వచ్చేను"

"కాఫీ తాగేసొస్తే బైటకెళ్ళి సిగరెట్టు కాల్చుకుసిరండి" అన్నాడు ఎస్సాయి.

"వెళ్లవోయి పాత్రుడూ" అన్నాడు ఫకీర్రాజు చిరాగ్గా.

పాత్రుడు అయిష్టంగానే లేచి, జేబులోనుంచి నల్ల కళ్లద్దాలు తీసిపెట్టుకొని బైటకు నడిచాడు.

దేవుడమ్మ గోడమీద చెయ్యి ఆన్చి లేచి ఆ వెనకనే బైటికి వెళ్లింది.

ఎస్సాయి కుర్చీలో సర్దుకొని కూర్చున్నాడు. టేబిల్ మీద మోచేతులు ఆన్చి, ముందుకు వంగేడు. గొంతు తగ్గించి "రాజుగారూ! నిజంచెప్పేయండి" అన్నాడు.

ఇంకేదో ఆలోస్తున్న ఫకీర్రాజు ఆ మాట విని కుంగిపోయాడు.

ఇంతసేపు నేను చెప్పింది యదార్థం కాదనుకుంటున్నావా?

"తమరు చాలా అన్యాయమైనటువంటి ప్రశ్న వేశారు. అసలు నాకు ఈ కలగాడ వ్యవహారంలో చాలా అన్యాయం జరిగిపోయింది. ఎంత వున్నతమైనటువంటి కుటుంబంలో జన్మించేను. తమకు తెలియదని కాదుగానీ అలమండలో క్షత్రియుల ప్రాభవం ఎలావుండేది? రాజవీధిలో మరెవాకడెవడైన జోళ్లువేసుకుని నడిచేవాడా? పంచెకూడా మోకాళ్ళ దిగడానికి వీలులేదు. మా మేనమామగారొకరు మైసూరెద్దుల సవారీ బండెక్కి మధ్యాహ్నంపూట ముండ దగ్గిరికి బయలు దేరితే నరమానవుడు ఎదురు రావడానికి వీల్లేదు. యెంత కట్టడి? అంత భయంమీద వుండేవారు. అదేమి రోజులు...?ఏ రాజుగారైనా ముచ్చటకొద్దీ ఏ వస్తువైనా తీసుకుంటే ఎవరైనా ఎదురు మాట్లాడేవారా? అప్పుడు ధర్మం నాలుగు పాదాలమీద చక్కగా నడిచేది. కానీ ఇప్పుడు పరిస్థితి మారిపోయింది"

ఎస్సాయి ఎటో చూస్తున్నాడు.

"కాలం మారిపోతన్నాది. జనం బరి తెగించేస్తున్నారు. క్రమశిక్షణ అనేది లేకుండా పోతన్నాది. ఆమధ్య హైదరాబాద్ నవాబుగారి మీద జనం తిరగబడిపోయేరట. చూసుకోండి – ఎంత ఘోరవో? హైదరాబాద్ నవాబునే ఖాతరు చెయ్యనివాళ్లు అలమండ రాజుల్ని ఖాతరు చేస్తారా? చితగిస్తున్నారా? కలి కాలం. రాజులేనిచోట ధర్మం నిలుస్తుందటండీ జాంగీరుగారూ? కొత్త కొత్త ప్రభువులు ఉద్భవిస్తున్నారు. ఈ లెక్కన మరో పది పన్నెండు సంవత్సరాల్లో కలియుగం పరిసమాప్తి అయిపోతుందని నా నమ్మిక. ఏం శెలవు?"

అప్పుడు ఎస్సాయి మళ్లీ ఈ లోకంలోకి వచ్చాడు. టేబిల్ మీదున్న కాలింగ్ బెల్ కొట్టాడు. లోపలి గదిలోనుంచి




రైటరొచ్చాడు.

"కాస్త ఎవరినైనాపంపి రెండు కాఫీలు తెప్పించవోయ్" అని చెప్పి రైటర్ సరే నని వెళ్ళిపోయిన తర్వాత ప్రారంభిం చాడు ఎస్సయి.

"రాజుగారూ! మీరు నిర్దోషి అని నేను నమ్ముతున్నాను. అసలు ముందునుంచీ మీమీద నాకు అనుమానంవేలేదు. అందుకే కేసు నమోదుచేసుకోలేదు. ఈ పరువు ప్రతిష్టలూ, వంశగౌరవాలూ—ఇవన్నీ నాకు తెలీనివికాదు. కానీ నా బాధంతా ఏవి టంటే—ఈ పరిస్థితిచూసి మీమొఖాసాదార్లే ఇలా అయిపోతుంటే నాలాంటివాళ్ళు ఏమై పోవాలో నాకు అర్థంకావటంలేదు. తల్చు కుంటే నాకు కళ్ళంట నీళ్ళు తిరిగిపోతు న్నాయి"

ఫక్కీరాజు కంగారుపడ్డాడు.

"తమరేం శెలవిస్తున్నారో నాకు బోధపడ్డంలేదు"

ఎస్సయి విషాదంగా నవ్వేడు.

"అక్బరు, బాబరు, హుమయూను, జహంగీరు, ఔరంగజేబు – ఈ పేర్లెప్పు డైనా విన్నారా రాజుగారూ?"

"చితం విన్నానండి.. చాలా పరి చయం. జాంగీరు, హిమాంపసందూ ఒకటో రకం మామిడిపళ్ళండి. నా తోటలో చాలా చెట్లున్నాయి. మిగిలిన రకాలు మన ప్రాంతంలో వున్నట్టు నాకు తెలీదుగానీ నూజివీడు జమీందారుకి మామిడిపళ్ళ సరదా కద్దు. అవి అక్కడ లభించవచ్చు. తమకు వాటిమీద ఆపేక్ష గానీ అయితే మనిషిని అంపించి తెప్పించ వచ్చును" అన్నాడు ఫక్కీరాజు.

ఎస్సయి మళ్ళీ నవ్వేడు.

"మామిడిపళ్ళు కాదులెండి. ఢిల్లీ సామ్రాజ్యాన్ని పరిపాలించిన మొగలాయి చక్రవర్తుల పేర్లండి అవి. వాళ్ళు మాకు వేలు విడిచిన మేనమామలు. అందులో జహంగీరు చక్రవర్తి పేరే నాకు పెట్టేరు. ఇపుడు మీరు మహా గొప్పని చెప్పిన నిజాం నవాబులేదండీ? ఇతగాని పూర్వీకుడు మా మేనమామల సేవకుడండి. అంత గొప్ప వంశంలో జన్మించిన మనిషినండి నేను. సామాన్యుడి ననుకుంటున్నారా? అయితే కలికాల మహిమవల్ల మా మేనమామల కుటుంబమే దుంపనాశనం అయిపోయింది. ఆయొక్క మహాచక్రవర్తుల వేలువిడిచిన మేనళ్ళుల వంశంలో జన్మించిన నేను ఈరోజున ఇక్కడ ఈ పోలీసు ఉద్యోగంలో వున్నాను. మా మేనమామలతోనేఆవోషూ ఆ దర్జా, ఆ అంతస్థూ, ఆ వైభవమూ, ఆ ప్రతిష్ట అన్నీ కూడా పోయాయి. మీ మొత్తం అలమండవారి ఆస్తిపాస్తు లన్నీ కలిపి మహా అయితే మా మేన మామల గుర్రాలశాల అంత వుండొచ్చు. అయితే మా కోటలే లేచిపోయాయి. లేక పోతే మీరు ఈరోజున నా ముందు కూర్చుని మాట్లాడవే...?" అని ఎస్సయి అంటూండగానే ఫక్కీరాజు గాభరాగా లేచిపోయాడు.

"తమరు అంత పెద్ద కుటుంబంనుంచి వచ్చారని నాకు తెలీదు. ఏదో పోలీసు నౌకరీలో వున్నారనుకొన్నాను గానీ మీ వెనక అంత మహత్తరమైన వంశ ప్రతిష్ట వుందని నాకు తెలియదు"

ఎస్సయి సంతోషంగా నవ్వుతూ లేచాడు "కూర్చోండి.... కూర్చోండి"

"అబ్బే నేను సంప్రదాయమంటే పడి చచ్చేమనిషిని లెండి"

"అవి లేవనే విషయమే మీరింత సేపూ చెప్పారు. కూర్చోండి ఫర్వాలేదు"

"తమరే ముందు దయచేయండి"

ఎస్సైయి కూర్చున్నాకే ఫకీర్రాజు కూడా కూర్చున్నాడు.

"అదీ... అలా చెప్పండి. అంత పెద్ద పుట్టుక కనకే నాయొక్క శోభని తమరంత సులభంగా అర్థం చేసుకున్నారు. ఏది పోయినా, రాజ్యాలు పోయినా, కోటలు కూలినా, ఇంటి గోడలు కూలినా మన వంశగౌరవం, రక్తంఎక్కడికిపోతాయండీ. అహా! ఇవాళ సుదినం" అన్నాడు ఫకీర్రాజు.

"నవాబుల ఔదార్యాన్ని రాజులే అర్థం చేసుకోగలరు" అన్నాడు ఎస్సైయి.

"చిత్తం. తమరు ఓ పర్యాయం అలమంద దయచేయాలి. ఢిల్లీ చక్రవర్తుల వంశీకులు ఇక్కడ వున్నారని తెలిస్తే అలమంద యావత్తూ సంతసిస్తుంది. సెలవైతే మళ్ళీ తమ దర్శనం చేసుకుంటాను. ఇక్కడికి వచ్చినపుడు ఇసుమంత కలతపడ్డాను కానీ తమరెవరో, తమరి విశిష్టత ఏమిటో తెలిసింతరువాత నాకు బెంగపోయింది. నవాబుల, చక్రవర్తుల పాలనలో మేం క్షేమంగా వున్నాం. వాస్తవానికి మేం ఉత్తర హిందూస్థానం నుంచే ఇక్కడికి వచ్చేసేం అని చెపుతారు. తురక ప్రభువుల పాలనతోనే దేశం ప్రభ అంతరించిపోయింది. ఇపుడెవడో బ్రాహ్మడు...బ్రహ్మా కామోసు అతగాడి పేరు...పరిపాలిస్తున్నాడనుకోండి. మనకి సంబంధం లేని విషయం. సెలవు తీసుకుంటాను. పాపం ఆ నాయురాలికి మీరే దిక్కు. ఆవిడ బంగారం ఆవిడకు దొరికే వరకు నామీదపడిన నింద మాసిపోదు. అవమానభారం నేను భరించలేను. అట్టుపైన తమదయ. సెలవిస్తే వెళ్ళొస్తాను. వెళ్ళగానే తమకు ఒకటో రకమైన టర్కీ కోళ్ళజత అంపిస్తాను"

"ఎందుకండీ అవన్నీ"

"అలా సెలవివ్వకూడదు...మీకూ, మాకూ పూర్వోత్తరం నుంచీ ఇచ్చిపుచ్చుకోవడాలున్నాయి"

"సరేలెండి ... మీ అభిమానాన్ని నేనెందుకు కాదనాలి. నాకు చౌకీ బాతులు, ఖజానా బాతులంటారుగదా! అవంటే సరదా. అవిగానీ దొరికితేవొక జత పంపండి"

"తప్పకుండా. గిన్నీకోళ్ళ ముచ్చట వుంటే చెప్పండి–షణాల మీద ఓ నాలుగు జతలు పంపుతాను"

"పంపండి పంపండి. నాకు అవంటే భలే సరదా"

"కుక్కల సరదా వుందా? ఒకటో రకమైన కుక్కలున్నాయి. బొబ్బిలని మహాఘనమైన కుక్కున్నది"

ఎస్సైయి ఇబ్బంది పడ్డాడు "వొద్దులెండి.... కుక్కలెందుకు?"

"సరి మరి సెలవు" అని ఫకీర్రాజు కుర్చీలోంచి లేచాడు.

"చౌకీ బాతులు మాత్రం మరిచిపోకండి"

"ఎంతమాట. నేను వెళ్ళగానే అంపిద్దునుగానీ చీకటి పడిపోతుంది మనిషి ఇక్కడికి వచ్చేసరికి. రేపు తెల్లవారేసరికి గిన్నీకోళ్ళు, టర్కీ కోళ్ళు, చౌకీ బాతులు పట్టుకొని ఇద్దరు మనుషుల్ని పంపుతాను"

ఎస్సైయి సంతోషించాడు "రాజులంటే నాకు మొదట్నించీ అభిమానమండి. మీ మీద నాకు అసలు ఏమాత్రం అనుమానం లేదు"

"సంతోషం,సంతోషం.మరి సెలవా?"

ఎస్సైయి కూడా లేచాడు "మీవూర్లో పీరుసాయిబు తెలుసునాండీ" అని అతను




మామూలుగా అడిగాడు.

"చిత్రం" అని ఫక్రీరాజు నవ్వేడు "సాయెబులంటే తమరుగానీ మావూరు పీరుసాయిబేంసాయెబండి..ఊరసాయిబు"

ఎస్సయి మొహం మాడిపోయింది "అదేవిటండీ అలా అనేస్తున్నారు?అతను నాకు మేనల్లుడవుతాడు"

ఫక్రీరాజుకు విషయం అర్థం అయింది. "ఏ పీరుసాయెబు సంగతి చెబుతున్నారూ? ఎర్రగా, సన్నగా నవాబుల కుర్రవాడిలాగుంటాడు అతనా?"

"ఆఁ! అతనే. మా పోలికలు మరీ. చాకులాంటి కుర్రాడు"

"అలా చెప్పండి. అతనయితే మీ బంధువే అయివుంటాడులెండి. చిత్రం. నిజవే. ఆ కుర్రవాడిలో నవాబుల పోకడలున్నాయి. తమరు పీరు సాయెబంటే నేను మొదట పరుపులు కుట్టే పీరుసాయిబనుకుని పొరబడ్డాను. ఇదేవిట్రా మన పోలీసు నవాబుగారికీ, వీడికీ చుట్టరికవేవిట్రా అనుకొన్నాను...అలా చెప్పండి" అన్నాడు ఫక్రీరాజు కండువా దులుపుకుంటూ.

"ఆ పరుపులు కుట్టే పీరు సాయెబుకు మా పిన్నల్లి కూతుర్ని ఇచ్చాంలెండి!... బావ అవుతాడు"

ఫక్రీరాజు ఇబ్బందిలో పడిపోయాడు. దిగులు పడిపోయాడు. అయినా తప్పదు. గనక-

"అయ్యయ్యయ్యో...అలాగా. నాకు తెలీనే తెలీదండి. మనిషి కొంచెం ఛాయ తక్కువ అగుట చేత అలా కనిపిస్తాడు గానీ ఎంత వోషన్న మనిషి! పరుపులు కూడా ఎంత బాగా, ఎంత పకడ్బందీగా కుడతాడనుకున్నారు. చిత్రం. వృత్తిలో నేమున్నదిలెండి వంశం ప్రధానంగాని. మరి శెలవు"

"వెళ్ళిరండి. వాళ్ళనిద్దర్నీ అడిగేనని చెప్పండి"

"తప్పకుంటానండి... చిత్రం. మరిచేపోయాను – తమకు సోగల కోళ్ళంటే సరదా వుందా?"

"సోగల కోడా? మహా సరదా మాయావిడకుమరీను. నేను గానీ, ఆవిడ గానీ సోగలకోడి మాంసం ఎప్పుడూ తినలేదు. పలావుకు బాగుంటుందాండీ?"

ఫక్రీరాజు చూపుడువేలుతో మీసం గోక్కున్నాడు "చిత్రం. సోగల కోడి అనేటటువంటిది తినడానికి ప్రశస్తమైనది కాదండి. దాని యొక్క తోక ముచ్చటగా మూడు మూరల పొడవు పెరుగుతుందండి. అలా పెరిగిన తోక నేలమీదపడి మాసిపోకుండా దాన్ని సదా ఎత్తి పట్టుకోవడానికి ప్రత్యేకంగా ఒకనౌకర్ని పెట్టాలని నా సరదా అండి. అందుకోసమని రేపిడినుంచి ప్రత్యేకంగా దాన్ని రప్పించానండి. కానీ తమరు ఢిల్లీ చక్రవర్తుల వేలువిడిచిన మేనల్లుళ్ళ వంశలోవారు గనుక ఆ పుంజు తమ వద్ద వుండుటకు శోభస్కరం అండి. తమరు పోలీస్ నవాబు గారు కాబట్టి ఒక కనిస్టేపుని హమేషా ఆ పుంజు తోక భుజం మీద బెట్టుకుని మోయడానికి కేటాయించగలరు"

"చూదాం పంపండి" అన్నాడు జహంగీరు ఏదో ఆలోచిస్తూ.

* * *

"బాధపడకోయి బావా" సానునయంగా అన్నాడు మీర్జా పెదబాబు. ఫక్రీరాజు చేతికందిన జహంగీరు మామిడి చెట్టు కొమ్మ విరుస్తూ మౌనంగా వున్నాడు.

"తలవొంపులే అనుకో! మనలాంటి సుక్షత్రియులు జరిగిన అవమానానికి

గుండేసుకొని కొట్టేసుకోవాలనుకో. కానీ ఇవి మనరోజులుకావు. అందువల్ల అటువంటి వాటిని పట్టించుకోకూడదోయ్. కానీ శ్రీకృష్ణులవారికే ఇటువంటి నిందలు తప్ప లేదు ఆయన కూడా ఏదో బంగారపుహారం కేటుచేశాడనినిందొచ్చిందికదా! బంగారాన్ని వర్షించేటటువంటి అటువంటి బంగారపు హారాన్ని కేటుజేసినా తప్పులేదనుకో. ఇంతకీ నింద అనగా ఏమిటోయ్? అబద్ధ మనేగదా? కనుక, అందుగురించి నువ్వు బాధ పడకు. పోలీసుల్లోకూడా అటువంటి పుణ్యాత్ములున్నారు కాబట్టి లోకంలో ధర్మం ఇంకా బతుకుతోంది. మరిన్ని కానుకలు అంపించినా తప్పులేదు"

వాళ్ళిద్దరూ కొత్తవలస బంజరులో వే[illegible] దాపుల బసకు దూరంగా వున్న మామిడి చెట్టుకింద నించుని వున్నారు.



ఓ పక్కనుంచి పొద్దువాలి పోతోంది. జామి పోలీసు స్టేషన్‌నుంచి బయలుదేరి, అలమండొచ్చి అక్కడో గంటుండి ఫక్కీరాజూ, గోపాత్రుడూ అరగంట

క్రితం బంజరుకు తిరిగివచ్చేరు.

"ఈ రోజుతో మనం వేటకట్టిపెట్టి రేపుదయం తుని బయల్దేరుదామోయి. అక్కడ్నించి పెద్దాపురం చిట్టిబావగారి బసకు వెళ్దాం. అక్కడో రెండురోజులు కాలక్షేపం చేసి, రామచంద్రాపురం వెళ్ళి రాజబాబు వేట కాంపుకు రమ్మన్నాడు- అక్కడికి వెళ్దాం నాల్రోజులు ఊరికి దూరంగావుంటే ఎంత నిందయినా మాసి పోతుంది.పాత్రుడిచేత ఇంటికి కబురంపు" అన్నాడు మీర్జా పెదబాబు.

"పాత్రుడ్ని కూడా తీసికెళ్దాం బాబా! కాస్త కాలక్షేపంగా వుంటాడు''

"అడుగో... నీకది పోయింది గాదు. అయినా ఉంగరాలజుట్టున్న వెధవతో సావాసమేంటోయి'' అన్నాడు మీర్జా పెదబాబు చికాగ్గా.

మామిడి చెట్టు కిందనుంచి రాజు లిదరూ కదిలారు.

* * *

ఎనిమిది రోజుల క్యాంపు ముగించుకుని ఫక్కీరాజూ, గోపాత్రుడూ ఆలమండలో బస్సు దిగారు.

"వారం రోజులకే పూరు మారిపోయి నట్టు కనిపిస్తుందండోయ్'' అన్నాడు గోపాత్రుడు.

"పారలపాటివారి ప్రహరీగోడ పడి పోయింది. వర్షం పడినపుడల్లా వూరు మారిపోతూనే వుంటుంది. నిన్నటి గోడలు ఈ రోజుకి మాయమైపోవడం మామ్మూ లైపోయి''

"మరేనండీ-ఆ సంచీ నాకిచ్చీయండి. తమరు నడవండి. నేను సాయంత్రం జేసి పట్టుకొస్తాను"

"ఎందుకు లేవోయి. మన సంచీ మనం మోయడానికి నామోషీ ఎందుకు?'' అన్నాడు ఫక్కీరాజు సంచీ పాత్రుడికి ఇస్తూనే.

సంచి పాత్రుడికి ఇస్తూనే పంచెగట్టిగా బిగించాడు ఫక్కీరాజు. మీసాలు సర్దు కున్నాడు.

'రోజులొకటి మారిపోతున్నాయి. పంచె వూడిపోయినట్టు మీసాలు వూడి పోయేరోజు వచ్చినా ఆశ్చర్యంలేదు' అను కుంటూ పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ నడిచి ఇంటికి చేరుకున్నాడు.

ఇంటి ప్రహరీ గుమ్మం దాటేసరికి అరసవిల్లి ఎదురయ్యాడు.

"అనకాపిల్లి బస్సులో దిగినారేటి బాబూ?''అని తోవలోంచిపక్కకితప్పుకుని అడిగాడు అరసవిల్లి.

"ఆ!"

''చేసంచేటిబాబూ?"

నడుస్తున్న ఫక్కీరాజు ఆగిపోయాడు. అతని మనసులో పడిపోయిన పారలపాటి వారి గోడ కదుల్తున్నది.

"ఏంరా? నా సంచి నేనే మోసుకు రావల్సినంత మారిపోయిందేట్రా వూరు?"

ఆ గొంతుక, ఆ ప్రశ్న కు అరస విల్లి కలవరపడ్డాడు.

"సితం. మావంతా వుంఛగా లవురి గోరికేటా కరమ్మం బాబయ్యా! కొంపదీసి దివాణం సంచీ మరిసిపోనారేటోనని బయ్యంవేసి అడిగినానండి"

"అహ అదా...బస్సు దిగుతూనే ఊరు మారిపోయినట్టుందని గోపాత్రుడన్నాడ్లే. అందుకని అడిగాను" అన్నాడు ఫక్కీరాజు మళ్ళీ కదులుతూ.

అరసవిల్లికి ఆ సమాధానం ఏమీ అర్థంకాలేదు. కానీ దివాణాల మనసు మనకేటి తెలుస్తాది అనుకున్నాడతను- ఫక్కీరాజు వెనకనే దూప్పువాకిటిలోంచి

నాలుగిళ్ళ వాకిట్లోకి నడుస్తూ.

పెళ్ళయుగు దగ్గిరున్న గాబులోంచి నీరుతీసి కాళ్లూ చేతులూ కడుక్కున్న ఫకీర్రాజుకు అరసవిల్లి దండెంమీది తువ్వాలు అందించాడు.

ఫకీర్రాజు ఆ తువ్వాలుతో ముందు కాళ్లు శుభ్రంగా తుడుచుకుని తర్వాత మొహం తుడుచుకున్నాడు. ఈ లోపున అరసవిల్లి పడకకుర్చీ తెచ్చి నాలుగిళ్ళ వాకిట వేశాడు.

"వదినియ్యా, పిల్లలూ కులాసాగా వున్నారా?" అని అడిగింది చిట్టమ్మ కందాయింటి గదిలోనుంచి బైటకువస్తూ.

"అమ్మయ్య ఆరోగ్యం ఏమైనా కుదుటబడిందా?''

"ఆ!" అన్నాడు ఫకీర్రాజు రెండు ప్రశ్నలకూ కలిపి ఒకటే సమాధానంగా. అతను బైట ఎక్కడ ఎంత దీర్ఘంగా మాట్లాడినా భార్యతో మాత్రం చాలా ముక్తసరిగా మాట్లాడతాడు.

అరసవిల్లి స్తంభానికి ఆనీ ఆనకుండా నిల్చుని "బాబూ! కలగాడనుంచి అప్పల నాయుడుగోడు ఒచ్చినాడు" అన్నాడు.

ఫకీర్రాజు దిగ్గున పడకకుర్చీలోంచి లేచాడు.

''ఏది...నా తుపాకీ అందుకోవోయ్. ఏది...నా ఈటె అందుకోవోయ్. ఏదా తేకుతోక కొరడా పట్టుకురావోయ్. అయిపోయిందిరోజు కలగాడ నాయుడి గాడి పని. జీవితంలో తొలి ఖూనీ చేస్తు న్నాను. సఫా. ఎక్కడున్నాడా గాడిద కొడుకు? తూర్పు సోఫాలోనే వున్నాడా?" అని అతను పెనుకేకలేశాడు.

ఆ కేకలకి ఇంటి కప్పుమీద కాల క్షేపం చేస్తున్న గిన్నీ కోళ్లు హడిలిపోయి 'కీక్ కీక్ కీక్ కీక్ కీక్'మని గోలగోలగా అరవటం మొదలెట్టాయి.

అరసవిల్లి బుర్ర గోక్కున్నాడు "సితం. వుప్పుడుగాదండి. నిన్న పొద్దోయి వొచ్చినాడండి. తవుప ఆ టైంకి నోగిట్లో నేరని ఇదయిపోనాడండి"

ఫకీర్రాజు ఒక్కక్షణంలో తేరుకుని మళ్లీ పడక్కుర్చీలో వాలేడు.

"మళ్లీ ఎందుకొచ్చాడా గాడిదకొడుకు? మళ్ళీ ఆ లంజాకొడుకుని నా గడప ఎందుకురాతొక్కనిచ్చేవు? నిన్ను గుండేసి కొట్టేయ్యాల్రా"

"దివాణంగోరి గురించేనండి ఆడు శానా బాధపడిపోనాడు. మారాజు తండ్రిని మాయత్త సెడదుక్క పెట్టేసిందిరా అరస విల్లీ అని ఆడు కుళ్ళికుళ్ళి పోనాడండి. రాజుగోరికి నామీద ఎంత కోపంగుందో ఏటో అని ఇదయిపోనాడండి. వొక్కపాలి తమరుగోరి దరిసినం జేసుకొని పోదారని ఒచ్చినాడటండి"

"ఏడిచాడు. ఆమాత్రం అత్తని అదుపులో పెట్టలేకపోయిన ఆడారి లంజా కొడుకు బ్రతికి ఏం ప్రయోజనమోయ్. ఆ రోజు నాతోటీ అలాగే అన్నాడు. మధ్య పీడి ఓదార్పు ఎవడికి కావాలి. మెడమీద చెయ్యిబెట్టి బయటకి గెంటీపలిసింది"

"ఆడు నోటికొచ్చినట్టు పేత్తే నరికేసి సపాటిసెట్టుకింద గొయ్యిదీసి కప్పెట్టేసీ వోద్నండి. కానీ ఆడు కోడిపుంజునోట్టు కొచ్చినాడంకి."

ఫకీర్రాజు సిగ్ఘాంతపోయి కుర్చీలోంచి మళ్ళీ లేచిపోయాడు. చిట్టమ్మ భర్తకి కాఫీ కాయించడానికి కందాయింటిలోకి వెళ్ళింది.

కోడిపుంజా?

ఎందుకో?

ఇందులోనేమి కుట్రవున్నదో?

ఫకీర్రాజు చేతులు వెనక్కి కట్టుకుని

నాలుగిళ్ళవాకిట పరంచాలో ఇటూ, అటూ పచార్లుచేశాడు.

ఆ!

"అదోయి. ఇందులో ఒకగొప్ప కుట్ర వుండొచ్చోయి. అది పిన్నత్త కొడుకొక దున్నాడు రుబ్బురోలు పొత్రంలా గుంటాడు. ఆదే ఈ కుట్రచేసి ఉంటాడు. మొన్న దొంగతనంలో మనకు వ్యతిరేక ముగా సాక్ష్యాధారాలు లేవుకదా... కేసు పోయింది. అందుకని ఈమారు ఈ ఎత్తు గడ వేశాడు. కోడిపుంజుని మనకు దెచ్చిచ్చి తరవాత పోలీస్‌స్టేషన్‌కి వెళ్ళి... బాబూ మా ఇంట్లో కోడ్నెవరో వొట్టుకు పోనారండి. మాకు ఫలానా ఫక్కీరాజుగారి మీద అనుమానంగుందని కేసు పెట్టడానికి అయివుండవచ్చును. చూశావా – ఎంత కుత్సితమైన, దుర్మార్గమైన, నీచమయిన ఆలోచన జేశారో? అయ్యయ్యో ఇదేవి విపరీతం. ఇదేవి దారణం" అన్నాడు ఫక్కీరాజు.

"శా... అయ్యేం మాట్లండిబాబయ్యా! అప్పల్నాయుడు శానాబాదపడిపోనాడండి. ఏడుపే తక్కువ. ఆకాడికీ ముక్కు ఎగ బీల్చనట్టేవుండండి ఆచింట్లో మిద్దికి బొక్కెట్టి ఆ బంగారం పిసరు కన్నవేసి నోడు దొరికిపోనాడటండి. ఆ దొంగోడిదీ కలగాడేసటండి. దేవాంగుల కుర్రోడటండి. మొన్నమద్దినేలఎండప్పుడుకాపోళ్ళదొడ్డిలో మరోమిద్దికిబొక్కెడుతుండగాదొరికిసినాడ టండి. సెట్టుకి కట్టేసి కుమ్మి సేరటండి. దాంతో వుచ్చబోసుకుని నిజంచెప్పేసీడట. గొర్రిపోతు అప్పల్నాయుడింట్లో నాను ఇదేయిధంగ మిద్దికి బొక్కెట్టి బంగారం, నగదు ఒట్టుకెళ్ళి పోనానని ఒప్పేసు కున్నాడటండి. ఆ బంగారప్పిసరు దొరికి సిందటండి. వెండిరూపాయల్లో కొన్ని మనూర్లో కంసాలోడికే అమ్మినాడటండి. మిగిల్నియి ఇచ్చీసినాడటండి. ఇదిలాగ అయ్యేసరికి ఆ నిందంతా తపురిగోరి మీద పడిపోనాదని ఆ ముసిల్ది బెంగెట్టీసు కొంచటండి. రెండ్రోజులు పచ్చిమంచి నీళ్ళు కూడా ముట్టుకోలేదటండి. అప్ప ల్నాయుడుగోడు అత్తనంజా నీకియ్యాల మెడజివలు ఇరిసీడం ఖాయవే అని కేకే లేసినాడటండి. ముసిల్ది గోలగోల పెట్టి సిందటండి. అన్నెం పున్నెం ఎరుగని రాస పీనిగిమీద అన్నేయంగా నీలాపనిందేసినాం మనికి పాపం పోదు అన్నాదిటండి ఆ ముసిల్ది. నువ్వెళ్ళి రాజుగోరి కాళ్ళమీద పడిపోతేగాని నేను అంబలి తాగనన్నా దటండి ఆళ్ళత్త. దానికీడు ఆ రాజుని కవు కులుంబెట్టి, నానా పుర్రాకులుబెట్టినోకంల అది పరువంతా నువ్వే దురుమార్గంగా తీసి నావు కాబట్టి నువ్వే ఎళ్ళి ఆడికాళ్ళమీద పడేనంజా అన్నాదటండి. ఆ ముసిల్ది అల్లుడుగోడి గెడ్డంబట్టుకొని బతిమాలింది టండి. బాబ్బాబు నీకు దండాలెడతాను, నాకారోజుగోరి మొకం సూడ్డానికిసిగ్గేస్తాది.. ఎలాగోలాగ నువ్వే ఓపాలి ఎల్లి మనకోడి పుంజునిచ్చీసి ఏటనుకోకండి బాబయ్యా అని చెప్పేసి రారా అన్నాదటండి. అందు మీదట సిన్న సాయంత్రంజేసి అప్ప ల్నాయుడు ఒకటోరకమైన సవలాపుంజు నొట్టుకొని పారొచ్చినాడండి. నోగిటికాడి ఒచ్చేతప్పుడికి ఆడి కాళ్ళూ సేతులూ గడ గడ్లాడిపోతన్నాయటండి. ఏటోరికర్రప్పల నాయుడు అలాగొడికిపోతన్నావు, సర్జరం గాని నెగిసిందేట్రా అని అడిగిన్నండి. అడు కితంత జెప్పినాడండి. మరయితే ఎలాగరా... మా డివాణం కాంపుకెళ్లార్రా అన్నానండి. అడు నీరసపడిపోనాడండి. ఏదో ఒకవుపాయం జెసిపెట్రా అని అడు

నాగెడ్డం బట్టుకున్నాడండి. నాకు మా సెడ్డ కనికారం ఏసిందండి. సర్లే నా సత్తిగా లపు నంజికొడకా...ఆ పుంజు నా మావిడి సెట్టుకింద కట్టేసి నోగిటికి దండెవెట్టి పోరా మా దివాణం ఊర్కించి ఒచ్చిం తరవాత నా పుర్రాకపులేయో నేను పడతాన్రా అని జెప్పి ఆడ్ని బంపీసినా నండి..." అన్నాడు అరసవిల్లి. అతను సంభం చాటున నిలబడి, ఫక్రీరాజు మొహం చూడకుండా ఇదంతా చెప్పేడు.

"నీకీమధ్య ధైర్యం ఎక్కువయి పోయిందిరోయ్. మొన్న కూడా ఏ విషయంలోనో మా దివాణానికి నేను చెపుతానులేరా అని ఎవడికో అభయం ఇచ్చేసేవు" అన్నాడు ఫక్రీరాజు మళ్ళీ కుర్చీలో కూచుంటూ.

"చితం. తవురి మొహం కనబడ కుండా వుంటే ఎంత ధైర్యంగానైనా మాటడతానండి" అన్నాడు అరసవిల్లి మళ్ళీ మొహం చాటేస్తూ.

"నిన్ను జుత్తు పట్టుకుని తంతే ఆడికి బుద్ధొచ్చును"

"ఏటండి మారాజా నాన్జేసిన తప్పు?"

"ఏటా? ఆడు పుంజును బట్టుకొచ్చాడు గానీ పోయిన నా పరువును తెచ్చిచ్చాడా? పోయిన బంగారం దొరికిందిగానీ నాకు అంటిన అపఖ్యాతి పోతుందా?"

"సితం. అయ్యన్నీ నాకు తెలీదులెండి బాబయ్యా. చెట్టంత మనిషి ఏడిసినంతపని జెస్తే నాను మరేటీ సెయ్యలేకపోనాను. పుంజుని పట్టుకొని ఆడురాడం నేను నా కళ్ళతో చూసేనండి. గుండికాయ నీరయి పోయింది. మా దివాణంగోరి మనసు నాకు తెలుసునుకద. ఆ సెప్పుదెబ్బలూ, సీవాట్లూ నానే తినొచ్చనుకున్నానండి. పుంజు మాత్రం బ్రహ్మాండంగుంది" అన్నాడు అరసవిల్లి.

"చేసిన అవమానం అంతా చేసేచేసిసి కోడిపుంజును పంపుతారటోయి... ఎవర్రోయి అదీ... బాగుంది బాగుంది. ఈ మర్యాద మా చక్కగా వుంది" అన్నాడు ఫక్రీరాజు.

అన్నాడే కానీ అతని మనసు తేలిక పడింది. వానకు పడిపోయిన పాతగోడ మీద ఎండ తళతళా మెరిసినట్టుగా ఉంది.

"ఆడింట్లో పట్టుమీద దిగిన పిల్లే నటండి. మంచి కండబట్టున్నాది. ఇందలేసి కాటాలున్నాయి. బాగా మేపి పెద్ద పండుక్కి బస్తిమే సవాల్ జేసి కత్తికట్టి బరిమీద ఒగ్గిమన్నాడం... పెట్ల మీదకిడి మాత్తరం ఒగ్గియొద్దని మరీ మరీ జెప్పి నాడండి"

చిట్టమ్మ కాఫీ తీసుకొచ్చి గ్లాసుతో భర్తకిచ్చింది. "పుంజు బావుంది" అన్నదామె.

"ఒరే కుక్కపెత్తనంచేసిన అడ్డగాడిద కొడకా! ఆడూ, నువ్వూ జెప్పినట్లా చెయ్యడానికటర్రా నేనిక్కడున్నదీ?" అని ఫక్రీరాజు అడిగాడు.

"సితం.కాదండి.మా వెవళ్ళమండి తవురి గోరికి జెప్పడానికి? తమచిత్తం వచ్చినట్లు తవురు సేస్తారు" అన్నాడు అరసవిల్లి.

'దొంగవెధవ. రాజుగారి మనస్సు మా బాగాపట్టుకొన్నాడు' అనుకున్నది చిట్టమ్మ.

ఫక్రీరాజు నవ్వేడు. ఓ గుక్క కాఫీ ఉఫ్న ఊదుకుంటూ తాగి—

"ఒరే!ఆ పుంజుఇక నాకంటపడటానికి వీల్లేదు. షణాలమీద దానిపీకకోసి. వెళ్లు" అని ఆజ్ఞాపించాడు.

అరసవిల్లి బయటకి నవ్వలేదు. కాని, అక్కణ్ణుంచి వెళ్లిపోయాడు.



# సమిష్టి బాధ్యత

ఒక కోటీశ్వరుడుగారికి నానా రకాల వ్యాపారాలున్నాయి. సగటున అతని ఆదాయం ఇరవై లక్షల రూపాయలుంటుంది. అందుకు ఆనందించిన కేంద్ర ప్రభుత్వం ఆయన్ని సగౌరవంగా ఆహ్వానించి మంత్రిపదవినిచ్చింది.

కోటీశ్వరుడికి సమర్థుడైన కొడుకు ఒకడున్నాడు గనుక ఆయన సరేనని తన వ్యాపారాల భారమంతా అతనికప్పగించి, మంత్రిపదవి చేపట్టాడు. కొంత కాలం జరిగిపోయిన తర్వాత, ఒక వ్యాపారంలో 15 లక్షల రూపాయల నష్టం వచ్చిందని మంత్రిగారికి తెలిసింది. అంతే! గుండెలు బాదుకుంటూ అకస్మాత్తుగా తన వూరు తిరిగొచ్చి కంపెనీల మేనేజర్లనందరినీ సమావేశపరచాడు. మనిషి అసలే దూర్వాసుణ్ని మించిన కోపిష్టి. "నష్టమెందుకొచ్చింది? మీరంతా గాడిదలను కాస్తున్నారా? లేడీ సెక్రటరీల్తో షికార్లు కొడుతున్నారా?" అని మండిపడ్డాడు.

"ప్రభుత్వం గతంలో కొన్ని రాయితీలు ప్రకటించింది.వాటిననుసరించి సరుకు ఎగుమతిచేశాం. కాని సరుకు మార్గమధ్యంలో ఉండగానే మీరు మంత్రి కావటం, మీ ప్రభుత్వం ఆ రాయితీలు రద్దుచేయటం జరిగింది. అందువల్ల నష్టమొచ్చింది. ఇందులో మనవాళ్ళు ఎవరూ ఏ తప్పు చేయలేద"ని కొడుకుగారు నచ్చజెప్పారు.

కాని మంత్రిగారికి కోపం ఆగలేదు. నష్టం తెప్పించింది కాకుండా పైగా సాకులు చెప్తావా అని ఈడ్చి ఓ లెంపకాయ వేశారు కొడుకుని కోపం ఆపుకోలేక. తమ యజమాని అంత ఘోరంగా కొడుకుని తమ ముందే అవమానించేసరికి మిగతా మేనేజర్లంతా నిర్విణ్ణులైపోయారు.



ఎదురుతిరిగి తండ్రి చెంప ఛెళ్ళుమనిపిద్దామా అన్నంత రోషం పెల్లుబికింది కొడుకులో. కానీ కంపెనీలన్నీ తండ్రి పేరనే ఉన్నాయి. పైగా అలా చేస్తే తండ్రి అందరికీ చులకనయిపోతాడు. పెద్ద రభస జరుగుతుంది. అలా కాకుండా తనూ గౌరవం కాపాడుకోవాలి. తండ్రిని ఇరకాటంలో పడెయ్యనూకూడదు.

# కతలు

తీక్షణంగాఆలోచించాడుసుపుత్రుడు. వెంటనే పక్కన కూర్చున్న మేనేజరు చెంప అదరగొట్టాడు. "15 లక్షలు నష్టం తెప్పించినందుకు అందర్నీ శిక్షించ దలచుకున్నాం కాబట్టి నువ్వూ మిగతా వాళ్ళతో పంచుకో" అని ధీమాగా చెప్పాడు.

అంతే! వెంటనే ఆ హాలులో చెంప దెబ్బలు టపటపా మోగాయి. మంత్రిగారు ఆనందంగా ఢిల్లీ ప్లేనెక్కారు.

—రాధారమణి

## పర్వదినం

హిట్లర్‌కు తానో అవతారపురుషుడినని మహానమ్మకం. ఆ నమ్మకంతోనే అతడు జర్మనీని అన్నివిధాలా అపూర్వం అని అందరూ అనాలనే దీక్షతో మార్చివేయ సాగాడు. యుద్ధ పరిశ్రమలు అపారంగా నెలకొల్పాడు. దేశంలోని యువకుల నందరినీ సైన్యంలోకి రిక్రూట్ చేసి ప్రపంచాన్ని జయించమని ఉద్బోధించసాగాడు. జర్మన్ జాతిని అజేయంగా రూపొందించటం కోసం అతను చేయనిపనంటూ లేదు. చివరికి బలిష్ఠులూ, అందగత్తెలూ నైన యువతీయువకుల్ని పోగుచేసి వారి సంపర్కంతో పృథమైన నవజర్మన్ జాతిని సృష్టించేందుకు కూడా ప్రణాళికలు వేశాడు.

అలాంటి హిట్లర్ ప్రపంచ యుద్ధం ప్రారంభమై విజయపరంపరలు సాధించ నారంభించాక అన్ని దేశాల్లోనూ గగ్గోలు మొదలయింది. హిట్లర్‌ను శాపనార్థాలు పెట్టనివారంటూలేరు ఏ దేశంలోనూ.

ఇలాంటి స్థితిలో హిట్లర్‌కు ఓ ఆలోచన వచ్చింది—అవతారపురుషుడినైన నేను ఏదో ఒక పర్వదినంనాడే మరణించాల్సి ఉంటుందిగానీ అందరిలా మామూలు రోజుల్లో కైలాసవాసిని కావటం ఏమిటని.

ఆ ఆలోచన వచ్చిన వెంటనే హిట్లర్ ఆస్థాన జ్యోతిష్యుడుగారిని పిలిపించాడు.

"నేను మామూలుగా అందరిలాగే ఏదో ఓరోజు చనిపోతానా? లేక ఏదైనా పర్వదినంనాడా? లెక్కలు చూసి చెప్పండి" అనడిగేడు.

జ్యోతిష్యుడుగారు గంటల తరబడి లెక్కలుకట్టి గుణించి, తీసివేతలు వేసి చివరికి తేల్చేరు—

"నిస్సందేహంగా మీరు పండుగ దినాన్నే చనిపోతారు. చిల్లరమల్లర పండుగదినాల్లో కూడా కాదు, పెద్ద పండుగనాడే పోతారు" అన్నాడాయన.

హిట్లర్ ఆనందించేడు. జ్యోతిష్యుల వారికి ఘనంగా బహుమతులిచ్చేరు. చివరికి సాగనంపుతూ మెల్లగా అడిగేరు—

"ఇంతకీ నేను ఏ పండుగనాడు చనిపోతానంటారు?"

జ్యోతిష్యుడుగారు క్షణం తటపటాయించేరు.

"అది చెప్పటం కష్టం. కానీ, ఒకటి మాత్రం నిజం. మీరు మామూలురోజే చనిపోయినా ఫర్వాలేదు. ఎందుకంటే మీరు చనిపోయినరోజు ప్రపంచం అంతా పండుగ చేసుకుంటారు గదా" అన్నాడా అసలు సిసలు జ్యోతిష్యుడుగారు.

—రఘుకిరణ్


క్రేజీ
అనుభవం...!

"జీవితంలో ఒక్కసారైనా అమెరికా వెళ్ళివస్తే జన్మ ధన్యమైనట్లే!"

ఈనాటి యువత నోట తరచు వినిపించే కోరిక అది!

అందుకు కారణం–ఆ దేశంపట్ల వారు పెంచుకొన్న మోజే! సినిమాలు, నవలలు, పత్రికలు, టూరిస్టుల ద్వారా అమెరికా గురించి తెలుసుకున్న అనేకానేక సంఘటనలు మన యువతకు ఆ దేశం పట్ల ఆసక్తి కలిగేలా చేస్తున్నాయి.

ఉత్తర అమెరికాలోని అర్కన్‌సాస్ ప్రాంతంలో ఓ వజ్రాల గని ఉంది. దాని పేరు 'క్రేటర్ ఆఫ్ డైమండ్స్'. 72 ఎకరాల మేర విస్తరించి ఉన్న ఆ వజ్రాల గనిలో ఎవరైనాసరే వజ్రాల కోసం గాలించవచ్చు. కాకపోతే, ఆ



గనిలో ప్రవేశించటానికి కేవలం 2 డాలర్లు (సుమారు 20 రూపాయలు) ప్రవేశ రుసుము చెల్లించాలి. చిన్నపిల్లలైతే ఒక్క డాలర్ చెల్లిస్తే సరిపోతుంది. ఎవరికైనా వజ్రాలు దొరికితే వాళ్ళు ఆ వజ్రాలను తమతో కూడా ఇంటికి తీసుకు వెళ్ళవచ్చు. 1951లో హోవార్డ్ మిల్లర్ ఆ వజ్రాల గనిని టూరిస్టుల కోసం ప్రారంభించాడు.

నిజానికి ఆ గని 1906లోనే కనుగొనబడింది. ఓ రైతుకు ఆ ప్రాంతంలో ఓ వజ్రం కనిపించింది. ఆ పొలం అతనిదే. ఆ విషయం తెలిసి 'అర్కాన్‌సాస్ డైమండ్ కంపెనీ' ఆ పొలాన్ని కొనేసింది. 1927 వరకూ ఆ కంపెనీ ఆ గనిలోంచి అనేక వజ్రాలు వెలికి తీసింది. ఆ తరవాత 'ఖర్చు ఎక్కువ, లాభం తక్కువ' కావటంతో గనిని మూసివేశారు. 1951లో హోవార్డ్ మిల్లర్ ఆ గనిని కొని టూరిస్టులకు 'వినోదం' కల్పించటానికి అవసరమైన ఏర్పాట్లు చేశాడు.

టెక్సాస్‌కు చెందిన పార్కర్ అనే ఆవిడకు 1980లో లక్షా 8వేల రూపాయల విలువగల వజ్రం దొరికిందక్కడ. మరో అమెరికన్‌కు 1960లో 6.42 కేరట్ల వజ్రం లభించింది. దాని విలువ సుమారు 45 వేల రూపాయలు. ఆ వజ్రాన్ని అతడు ఉంగరంలో అమర్చుకొన్నాడు.

సెలవు రోజులను సరదాగా గడపాలనుకొనేవాళ్లు పనిలో పనిగా ఆ వజ్రాల గనికి వెళ్తుంటారు. 'అదృష్టం కలిసి వస్తే వజ్రాలు లభిస్తాయి. లేదా మంచి కాలక్షేపం అవుతుంది. కనీసం గొప్ప థ్రిల్ మిగులుతుంది' అనుకొంటూ ఉంటారు అక్కడికి వెళ్ళేవాళ్ళు.

ఇలాంటివాటిపట్ల ఆకర్షితులవటం వల్లనే చాలామంది 'అమెరికా వెళ్ళొస్తే బావుండును' అనుకొంటూ ఉంటారు. మరికొందరు తమ వృత్తికి సంబంధించిన కొత్త కొత్త మెలకువలు తెలుసుకోవాలనే ఉద్దేశంతో అమెరికా వెళ్ళాలనుకొంటారు.

కాలిఫోర్నియాలో 'సిటీ ఆఫ్ హోప్' పేరుతో ఓ ఆసుపత్రి ఉంది. అక్కడ కాన్సర్, క్షయ, గుండెజబ్బులులాంటి భయంకర రోగాలకు ఉచితంగా చికిత్స చేస్తారు. ఆ ఆసుపత్రిలో మొత్తం 300 పడకలు ఉన్నాయి. 85ఎకరాల తోటలో దాదాపు కోటి డాలర్ల ఖర్చుతో ఆ ఆసుపత్రిని నిర్మించారు.

అక్కడకు వచ్చే రోగులను ముందుగా ఓ కమిటీ పరీక్షిస్తుంది. "రోగి నిజంగా బీదవాడేనా? అతని రోగం చికిత్సకు లొంగుతుందా?" లాంటి అంశాలను పరిశీలించిన తరవాతే రోగులకు ఆ ఆసుపత్రిలో ప్రవేశం లభిస్తుంది. 1906లో రష్యా నుంచి అమెరికా వచ్చేసిన 16 ఏళ్ళ శామ్ గోల్డర్ ఆ 'సిటీ ఆఫ్ హోప్'ను 1926లో ప్రారంభించాడు. అమెరికా వచ్చేనాటికి ఆయన చేతిలో కేవలం 4 డాలర్లే ఉన్నాయి. యూదులంతా సాయం చేయటం వల్ల ఆ ఆసుపత్రి నెలకొల్పబడింది. ఇప్పటికీ యూదులే అనేకమంది ఆ ఆసుపత్రికి అధిక మొత్తాలు విరాళంగా ఇస్తారు. అయినప్పటికీ అక్కడ చేరే ప్రతి పదిమంది రోగులలోనూ యూదులు నలుగురికి మించి ఉండరు.

'సిటీ ఆఫ్ హోప్' నిర్వహణకు ఏటా 85 లక్షల డాలర్లు ఖర్చవుతాయి. ఆకాశాన్ని అందుకొనేలా అనేక అంతస్థులతో భవనాలు నిర్మించటం ఫాషన్‌గా మారిన అమెరికాలో, ఆ ఆసుపత్రి ఇప్పటికీ ఒకే




అంతస్థులో ఉండటానికి కారణం-ఆసుపత్రి భవనాలు అనేక అంతస్థులతో నిర్మింపబడకూడదని గోల్డర్ భావించటమే!

ఆ ఆసుపత్రిలో చిన్నపిల్లల కోసం ప్రత్యేక విభాగం వుంది. ఆ వార్డులోని గదులకు వాల్ట్ డిస్నీ చిత్రాల్లోని కామిక్ పాత్రల పేర్లు పెట్టారు. ఆయా గదులలో ఆయా పాత్రల బొమ్మలు ఉంటాయి. ఆసుపత్రిలో చేరిన పిల్లలను చూసుకోవటానికి తల్లిదండ్రులు ఏ సమయంలోనైనా రావచ్చు. అక్కడచేరే రోగులను చాలా గౌరవంగా ఆదరిస్తారు తప్ప అక్కడి సిబ్బంది చీదరించుకోరు.

ఉచిత చికిత్సాలయాలను నెలకొల్పా లనుకునే ధనవంతులు, సేవాసంస్థల ప్రతినిధులు ఆ వంకతో అమెరికా వెళ్ళి అక్కడి 'సిటీ ఆఫ్ హోప్' లాంటి ఆసుపత్రుల నిర్వహణ తీరుతెన్నులను గమనించి వస్తుంటారు.

ఇంజనీర్లకు కూడా అలా అమెరికా వెళ్ళివచ్చే అవకాశం ఉంది. శాస్త్ర, సాంకేతిక రంగాల్లో అమెరికా ఎప్పుడూ ఓ అడుగు ముందు ఉండాలని కోరుకుంటుంది. 1947లో ఇంజనీరింగ్ రంగంలో కొత్త శాఖ ఉద్భవించింది. దాని పేరు 'వేల్యూ ఇంజనీరింగ్'. దానినే 'వేల్యూకంట్రోల్' అని కూడా అంటారు. 'విలువలను అదుపు చేయటం' ఆ ఇంజనీరింగ్ లక్ష్యం. ఏదైనా ఒక ఫ్యాక్టరీ ఒక వస్తువును ఉత్పత్తి చేసినపుడు ఆ వస్తువు ధర సాధ్యమైనంత తక్కువగా ఉండేలా ఏం చేస్తే బావుంటుందో ఆలోచించి, ఆ ఏర్పాట్లను అమలుజరుపుతారు వేల్యూ ఇంజనీర్లు. ఈ శాఖను కనుగొన్న వ్యక్తి లేరీమైల్స్. ఆయన జనరల్ ఎలక్ట్రికల్ కంపెనీలో పనిచేసేవాడు.

రెఫ్రిజిరేటర్‌లో 'ఆటోమేటిక్ కోల్డ్ కంట్రోల్' భాగం చాలా ఖరీదైనది. దాని ఖరీదును తగ్గిస్తే రెఫ్రిజిరేటర్ ఖరీదు బాగా తగ్గుతుంది. అందువల్ల ఆ భాగాన్ని బాగా పరిశీలించి ప్రతి నట్టు, ప్రతి శీల, ప్రతిబోల్టునూ పరీక్షిస్తారు. వాటి బదులు మరో రకం విడిభాగాలు ఏర్పాటు చేయవచ్చునా, అలా చేస్తే ఎంత ఖర్చు తగ్గుతుంది లాంటి అంశాలు గమనించి ఆ భాగాన్ని వేరేపదార్థంతోనో, మరోరకంగానో తయారుచేస్తారు. వాటిని వాడటంవల్ల రెఫ్రిజిరేటరులను ఉత్పత్తి చేసే కంపెనీకి లక్షలలో లాభం వస్తుంది. వినియోగదార్లకు తక్కువ ధరకు రెఫ్రిజిరేటర్లు లభిస్తాయి. అలా ధరలు పెరగటానికి బదులు తగ్గటానికి అవకాశం ఉంటుంది.

అందువల్ల వేల్యూ ఇంజనీరింగ్‌కు ప్రాముఖ్యం పెరిగిపోయిందక్కడ. ఇప్పుడు 'సొసైటీ ఆఫ్ అమెరికన్ వేల్యూ ఇంజనీర్స్' అనే సంస్థ ఏర్పడింది. దానిని ఇంగ్లీషులో పొడిఅక్షరాలలో 'సేవ్' అంటారు. ఆ అక్షరాలను కలిపి చదివితే 'రక్షించటం' అనే అర్థం వస్తుంది. అమెరికాలోని ఉత్పత్తి సంస్థలు విధిగా 'సేవ్'ను సలహా అడుగుతుంటాయి. అక్కడి విశ్వవిద్యాలయాల్లో ఈ శాఖను ప్రవేశపెట్టారు. డాక్టర్లు, న్యాయవాదుల మాదిరిగా అక్కడ వేల్యూఇంజనీర్లు 'ప్రయివేట్ ప్రాక్టీసు' చేస్తున్నారిప్పుడు.

'బిజినెస్ మేనేజ్‌మెంటు'లో ఈనాటి యువకులకు ఆసక్తి పెరుగుతోంది. వ్యవహారాలను సున్నితంగా, త్వరితంగా ఎలా ముగించాలి? ఆ విషయంలో ఎలాంటి విధానాలు ఆచరించాలి లాంటి

అంశాలు తెలుసుకోవటానికి పనికివచ్చే సంస్థకూడా అమెరికాలో ఉంది.

1956లో 'ఇంటర్నేషనల్ ఎగ్జిక్యూటివ్ సర్వీస్ కోర్' అనే ప్రయివేటు సంస్థ న్యూయార్క్‌లో ప్రారంభించబడింది. ఆర్థికంగా వెనుకబడిన దేశాలలోని నష్టాలతో నడుస్తున్న వ్యాపార సంస్థలకు ఆ సంస్థఎగ్జిక్యూటివ్‌లనుపంపిస్తుంది.వారు అక్కడి పరిస్థితులను గమనించి ఎందువల్ల ఆయా కంపెనీలు, సంస్థలకు నష్టాలు



వస్తున్నాయో గ్రహించి ఆ లోటుపాట్లను సరిదిద్ది వెళ్ళారు. ఆ సంస్థలో పనిచేసే వారంతా 60ఏళ్ళు పైబడిన అనుభవజ్ఞులే; అమెరికాలో వివిధ కంపెనీల్లో ఛైర్మన్లుగా, డైరెక్టర్లుగా, మేనేజర్లుగా పనిచేసినవారే;

పనామాలో ఓ సూపర్‌మార్కెట్ నష్టాలలో మునిగిపోయినపుడు ఆ సంస్థ ఓ వ్యక్తిని ఆ వ్యవహారాలు చూడాల్సిందిగా పంపింది. సరుకును ఉత్పత్తిదారుల దగ్గరే కొనుగోలు చేయటం, ఉన్న వస్తువులను



ఆకర్షణీయంగా అమర్చేలా చూడటం, తరచుగా పత్రికలలో ప్రకటనలు గుప్పించటంలాంటి కొన్ని పద్ధతులను అనుసరింపచేసి ఆ సూపర్‌మార్కెట్టుకు మళ్ళీ లాభాలు వచ్చేలా చేశాడాయన. ఒక్క సంవత్సరంలో అప్పటివరకూ వచ్చిన నష్టం భర్తీకావటమేకాక 20శాతం లాభాలు వచ్చాయి ఆ సూపర్ మార్కెట్టుకు!

1968నాటికి ఆ సంస్థ 31దేశాలలోని 305 కంపెనీలకు ఎగ్జిక్యూటివ్‌లను పంపించింది. మనదేశంలో కలకత్తాకు చెందిన ఓ రసాయనాల కంపెనీకికూడా ఆసంస్థ నుంచి ఓ ఎగ్జిక్యూటివ్ వచ్చాడు. అలా ఎక్కడికయినా వచ్చేవారికి రాక పోకలకు, నివాసానికి అయ్యే ఖర్చులు ఎగ్జిక్యూటివ్‌లను రప్పించుకొన్న సంస్థలు భరించాల్సి ఉంటుంది.

ఇతరదేశాలవారిని ఆకర్షించగల ఇంకా అనేక అంశాలు అమెరికాలో ఉన్నాయి. ఆ దేశానికేగర్వకారణం అనదగ్గ మ్యూజియం ఒకటి ఉంది. దానిని హెన్రీఫోర్డ్ మిచిగన్ రాష్ట్రములోని డియర్ బార్న్ సమీపంలోగల గ్రీన్‌ఫీల్డ్ గ్రామంలో 260 ఎకరాల విస్తీర్ణంలో నెలకొల్పాడు.

ప్రముఖులయినవారి ఇళ్ళను, వారికి పేరుతెచ్చిపెట్టిన ప్రదేశాలను, వస్తువులను ఆ మ్యూజియంలో పునః ప్రతిష్ఠిస్తారు. థామస్‌ఆల్వా ఎడిసన్ ఉపయోగించిన ప్రయోగశాలను ఏ భాగానికి ఆ భాగం విప్పేసి దాన్ని యధాతథంగా ఆ మ్యూజియంలో అవేవస్తువులు, పరికరాలతో నిర్మించారు. ఎడిసన్ బతికివున్న రోజుల్లో ఆ ప్రయోగశాల ఎలా ఉండేదో, ఇప్పుడు కూడా అది ఆ మ్యూజియంలో అలాగే వుంది.

అమెరికా పారిశ్రామిక విప్లవం అక్కడ కళ్ళకు కట్టినట్లు కనిపిస్తుంది. అక్కడ ఇప్పటికి 600 టన్నుల బరువు వున్న ఆవిరి రైలుఇంజను వుంది. అది ఇంకా పనిచేయగలదు. కాని దానిచేత పని చేయించరు. అబ్రహాం లింకన్ న్యాయ వాదిగా మొదటిసారి వాదించిన కోర్టు భవనాన్ని పెళ్ళగించి తీసుకువచ్చి ఆ మ్యూజియంలో నెలకొల్పారు. నాటకం చూస్తూ తుపాకీకాల్పులకు గురై మరణిం చాడు అబ్రహాంలింకన్. ఆయన అప్పుడు కూర్చున్న కుర్చీ ఇప్పుడు ఆ మ్యూజియంలో ఉంది. జార్జ్ వాషింగ్టన్ ఉపయోగించిన సూట్‌కేసు, రైట్ సోదరులు విమానం నిర్మించటానికి ఉపయోగించిన రేకుల షెడ్డు, ఫోర్డు మొట్టమొదటిసారిగా నిర్మించిన కారు నమూనా వగైరాలు ఆ మ్యూజియంలో వున్నాయి.

అమెరికాలో మొట్టమొదటి నిఘంటువును రూపొందించిన వెబ్‌స్టర్ ఇల్లును కూడా ఆ మ్యూజియంలో పునః ప్రతిష్ఠించారు. 1776లో అమెరికా స్వాతంత్ర్య ప్రకటనకు సంబంధించి ఫిలడెల్ఫియాలోని 'ఇండిపెండెన్స్ హాలు'లో ప్రముఖులు సంతకాలు చేశారు. ఆ భవనాన్ని అమ్మటానికి ఆ నగర మేయర్ అంగీకరించలేదు. అందువల్ల సరిగ్గా అలాంటి హాలునే ఆ నమూనాలోనే ఆ మ్యూజియంలో నిర్మించారు. ఇంకా అలాంటి అనేక చారిత్రాత్మక భవనాలు, వస్తువులు ఉన్న ఆ మ్యూజియంను 'హెన్రీఫోర్డ్ మ్యూజియం' అనే వ్యవహరిస్తారు. ఏటా ఆ మ్యూజియంను 10 లక్షలమంది దర్శిస్తుంటారు. వారిలో విదేశీయులే ఎక్కువ.

అమెరికా వెళ్ళేవారు తప్పకుండా కాలిఫోర్నియాలోని లాస్‌ఏంజెల్స్ వెళ్తారు.

 

అక్కడకు వెళ్ళిన ప్రతి యాత్రికుడు విధిగా ఓ ప్రదేశాన్ని సందర్శిస్తాడు. ఆ ప్రదేశంపేరు 'నాట్స్ బెర్రీఫార్మ్ అండ్ ఘోస్ట్‌టోన్'. లాస్‌ఏంజిల్స్‌కు 22మైళ్ళ దూరంలో ఉన్న ఆ యాత్రాస్థలం 200 ఎకరాల వైశాల్యంలో ఉంది. అక్కడ 1880 ప్రాంతాల్లో అమెరికన్లు జీవన విధానం ఎలాఉండేదో గమనించవచ్చు.

ఆ స్థలాన్ని ఏర్పాటుచేసిన వ్యక్తి పేరు వాల్టర్ నాట్. 1920లో అతను అక్కడ కోడిమాంసం అమ్మే హోటలును ప్రారంభించాడు. నాట్ భార్య మాంసం వండేది. అతనే అతిథులకు మాంసం సరఫరా చేసేవాడు. అతని నలుగురుపిల్లలూ అతిథులను ఆహ్వానించేవారు. మొదటిరోజున 8 కోళ్లు ఖర్చయ్యాయి. క్రమక్రమంగా ఆ చికెన్ రెస్టారెంట్ అభివృద్ధి చెందింది. 1939 నాటికి 600మంది కూర్చొనటానికి వీలుగా ఆ హోటల్ నిర్మితమయింది.

అప్పటికి నాట్‌కు 50ఏళ్ళు వచ్చాయి. తాను సాధించినదేదీ అతనికి తృప్తి కలిగించలేదు. తనపేరు శాశ్వతంగా నిలిచిపోవాలంటే ఏం చేయాలా అని దీర్ఘంగా ఆలోచించాడు. ఓ సందర్భంలో చిన్నతనంలో అతని అమ్మమ్మ చెప్పిన కథలు గుర్తుకువచ్చాయి. "అప్పటికీ, ఇప్పటికీ ఎంతతేడా!" అనుకొన్నాడు. ఆ భావనే అతని చేత "గత శతాబ్దపు సంస్కృతి కళ్ళకు కట్టేలా చేస్తే బావుంటుంది" అనుకొనేలా చేసింది.

వెంటనే అరిజోనా రాష్ట్రంలోని పాతకాలపు ఓ హోటలును ఏ భాగానికి ఆ భాగం విప్పించి తన హోటలుకు సమీపంలో ఉన్న ఖాళీ స్థలంలో సరిగ్గా అలాగే అమర్చించాడు. దాని లోపల 'సైక్లోరమా'ని ఏర్పాటు చేశాడు. ఆ హోటలు చుట్టూ పాతకాలపు కట్టడాలు, అప్పటి బంగారపు పనివారి దుకాణాల నమూనాల్ను, నాలుగు గుర్రాలతో నడిచే గుర్రపు బగ్గీలు వగైరాలు ఆ 'ఫార్మ్'లో కనిపించే ఏర్పాటు చేశాడు. అక్కడ సంచరించే మనుషులచేత గత శతాబ్దపు దుస్తులను ధరింపచేశాడు.

సైక్లోరమాలో చూస్తే చీకటి పడటం, నక్షత్రాలు రావటం, పాలకోసం పిల్లలు ఏడవటం, గుర్రపుబగ్గీలు వెళ్ళటంలాంటి దృశ్యాలు కనిపిస్తాయి. వీటిని చూస్తున్నంత సేపు ఓ కంఠం ఆనాటి దృశ్యాలను వర్ణించి చెబుతుంది. ఆ 'గత సంస్కృతీ కేంద్రం' వల్ల నాట్స్ హోటలుకు గిరాకీ బాగా పెరిగిపోయింది.

1941లో ఏర్పాటయిన ఆ కేంద్రం ఇప్పటికీ యథా ప్రకారం అనేకమందిని ఆకర్షిస్తూనే ఉంది. ప్రస్తుతం ఆ హోటలులో 1700 మంది కూర్చుని భోజనం చెయ్యవచ్చు. రోజుకు అక్కడ 4వేల భోజనాలు ఖర్చవుతాయి. ఇప్పుడు ఆ హోటలు విలువ దాదాపు కోటి డాలర్లు.

ఇక, రక్షణ వ్యవహారాల దగ్గరకు వస్తే - అమెరికా అనేక ప్రయోగాలు చేస్తూ ఉంటుంది. వియత్నాంతో యుద్ధం చేసే సమయంలో వియత్కాంగ్ సైనికుల బారినుంచి తమ సైనికులను రక్షించటానికి 'ఆర్మీస్ లిమిటెడ్ వార్ లేబొరేటరీ'లో అనేక పరికరాలను రూపొందింపచేసింది అమెరికన్ ప్రభుత్వం. వాటిలో 'సూపర్-ఇయర్' ఒకటి.

సాధారణంగా మనం 20 డెసిబిల్స్ కంటె తక్కువ స్థాయిలో వచ్చే శబ్దాలను వినలేం. కాని కుక్కలు వినగలవు. కుక్కలు కూడా వినలేనంత తక్కువ శబ్దాన్ని గ్రహించి, హెచ్చరించగల

పరికరం 'సూపర్-ఇయర్'. అర్ధరాత్రి వేళ పిల్లిలా, రహస్యంగా ఏమాత్రం శబ్దం చేయకుండా వచ్చి అమెరికన్ సెంట్రీలను, సైనికులను చంపేస్తూ వుండే వారు వియత్కాంగ్ సైనికులు. వారి ఉనికి తెలుసుకోవటానికే సూపర్ ఇయర్ కనిపెట్టబడింది. నిర్ణీతదూరంలో ఏదైనా అలికిడి అయితే, పేకముక్కలు పెట్టుకొనే పెట్టె సైజులో ఉన్న సూపర్ ఇయర్ ఆ అలికిడిని గ్రహించి వెంటనే అలారం మోగిస్తుంది. ఆ శబ్దం 'ఇయర్ ప్లగ్' పెట్టుకున్నవారికే వినిపిస్తుంది. నిద్రపోతున్నవ్యక్తికి కూడా మెలకువ తెప్పించేంత శబ్దం వస్తుంది—ఇయర్ ప్లగ్ పెట్టుకుంటే!

అలాంటి మరో పరికరం పేరు 'మేన్ పేక్ పర్సనల్ డిటెక్టర్'. అది ఒకరసాయనిక ప్రయోగశాలలాంటిది. సైనికులు భుజానికి వేళ్ళాడే సంచీలో దానిని అమర్చుకోవచ్చు. అందులోనికి రబ్బరు గొట్టం



ద్వారా గాలి చేరుకుంటుంది. ఆ గొట్టం చివరిభాగం రైఫిల్‌కు అమర్చబడి ఉంటుంది. మనుషుల శరీరాలనుంచి వెలువడే వాసనను ఆ రబ్బరు గొట్టం గ్రహించి లేబరేటరీలోనికి పంపుతుంది. వెంటనే ఆ సైనికుని చెవికి ఉన్న 'ఇయర్ ప్లగ్' ద్వారా అలారం వినబడుతుంది. ఎక్కువమంది మనుషులు ఆ సైనికుని సమీపంలో ఉంటే అలారం సైతం ఎక్కువగా మోగుతుంది. మనిషి శరీరాలనుంచి వచ్చే వాసనలను 400 రకాలుగా విభజించారు డాక్టర్లు. శత్రువులను గుర్తించటానికి అమెరికన్ సైనికులు ఆ లేబరేటరీలున్న సంచిని భుజానికి తగిలించుకుంటారు. అలాంటి 40 రకాల పరికరాలను 'ఆర్మీస్ లిమిటెడ్ వార్ లేబరేటరీ' కనిపెట్టింది.

'స్టార్‌లైట్ స్కోప్' అనే ఓ పరికరం అడుగు పొడవు ఉంటుంది. దానిని రైఫిల్‌కు అమరుస్తారు. రాత్రివేళ చంద్రుడు లేకపోయినప్పటికీ, నక్షత్రాల కాంతిని గ్రహించి ఆ కాంతిని బాగా పెంచి కొన్ని వందల అడుగుల దూరంలో ఉన్న లక్ష్యాన్నిసైతం చూడటానికి 'స్టార్‌లైట్ స్కోప్' ఉపయోగిస్తుంది.

సామాన్యంగా ప్రయాణికుల విమానాలు 30 వేల అడుగుల ఎత్తున ఎగురుతాయి. యుద్ధవిమానాలు 50 వేల అడుగుల ఎత్తుకుమించి ఎగరవు. కాని యు-2 విమానాలు మాత్రం 80 వేల అడుగుల ఎత్తున ఎగురుతాయి. వాటిని కనిపెట్టినది కూడా అమెరికాయే! మిలటరీ దళాలవారు వాటిని ఉపయోగిస్తారు. ఆ విషయం కూడా చాలా రహస్యంగా దాచబడింది.





1960 వరకూ ఆ విమానాల గురించి ఎవరికీ తెలియదు. రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత రష్యా దేశంమీద ఏ విదేశీ విమానమూ ఎగరలేదు. రష్యా సైనిక, ఆర్థిక బలాలను అంచనా వేయాలంటే గూఢచారి విమానాలు ఆ దేశం మీద ఎగరాలి. అక్కడి సైనిక స్థావరాలను ఫొటో తీయాలి. రష్యా కూడా అణ్వస్త్రాలను పరీక్షించటంతో, రష్యాలో ఎగరటానికి వీలుగా గూఢచారి విమానాలను రూపొందించాల్సిందిగా లాక్‌హెడ్ ఎయిర్‌క్రాఫ్ట్ కార్పొరేషన్‌కు చెందిన జాన్‌సన్‌ను ఆదేశించారు అధికారులు. అతనే మొట్టమొదటి జెట్ విమానం డిజైన్‌ను రూపొందించిన వ్యక్తి.

బాగా ఎత్తు ఎగరగలిగి మధ్యలో ఇంధనం నింపుకొనే అవసరం లేకుండా ఎక్కువసేపు ప్రయాణించగల విమానం తయారుచేయాలని నిశ్చయించాడు జాన్‌సన్. 70 వేల అడుగుల ఎత్తున ఎగిరే విమానాలు రష్యన్‌ల దృష్టిలో పడవు. వాటిని రష్యన్ ఫైటర్ విమానాలు వేటాడలేవు. భూమిమీద నుంచి పేల్చే ఏంటీ ఎయిర్‌క్రాఫ్ట్ తుపాకుల గుళ్ళు కూడా 70 వేల అడుగుల ఎత్తుకు చేరలేవు. అందువల్ల కొందరు ఇంజనీర్ల సాయంతో యు-2 విమానాలను రూపొందించాడతను. అవి ఎక్కడ నిర్మింపబడ్డాయో, ఎవరెవరు అందులో పాల్గొన్నారో ఎవరికీ తెలియదు!

యు-2 విమానాలకు 80 అడుగుల వెడల్పున్న రెక్కలు ఉంటాయి. 50 అడుగుల పొడవున్న పెట్రోలు టాంకవు ఉంటుంది. టిటానియం లాంటి తేలిక లోహంతో నిర్మితమయ్యే యు-2 విమానం బరువు కేవలం 5 టన్నులు. అంటే మామూలు జెట్ విమానాలకంటే అది

తేలికగా ఉంటుందన్నమాట! 70 వేల అడుగుల ఎత్తుకు వెళ్తే, మామూలు ఇంధనం వేడెక్కి ఆవిరయిపోతుంది. అందువల్ల ఆ విమానాల కోసం ప్రత్యేక ఇంధనాన్ని రూపొందించాడు జాన్సన్. అలాంటి 1000 గేలన్ల ఇంధనంతో మూడువేల మైళ్లు ప్రయాణించవచ్చు. 1955 నాటికి యు-2 విమానాలు 50 వరకూ నిర్మితమయ్యాయి. రష్యా భూభాగం మీద ఫ్రాన్సిస్ పవర్స్ అనే పైలట్ నడిపిన యు-2 విమానం కూలిపోయే వరకూ ఆ విమానాలు నిర్విఘ్నంగా గూఢచారి కార్యకలాపాలు కొనసాగించాయి!

ఇలాంటి అనేక అంశాల గురించి పత్రికల్లో చదివి అనేకమంది అమెరికాపై మోజు పెంచుకొంటారు. ఆ మోజే రాను రాను 'క్రేజ్'గా మారుతుంది. ఆ తరవాతి దశ దురభిమానమే! అప్పటి నుంచి "అసలు నేను ఈ దేశంలో పుట్టాల్సినవాడినికాదు! నా అలవాట్లకు, సంస్కారానికి అమెరికాయే సరయిన దేశం" లాంటి అసందర్భ ప్రలాపాలు ప్రారంభమవుతాయి.

అవకాశం ఉన్నవారు ఆ 'పిచ్చి' కుదుర్చుకోగలుగుతారు - ఒకసారో, రెండుసార్లో అమెరికా వెళ్ళి! లేనివారు కూడా రోజుకోసారో, రెండుసార్లో అమెరికా వెళ్ళి వస్తుంటారు - కలల్లో, మాటల్లో!!

— మూర్తి

CHATURA ... Monthly, Hyderabad-500 004. Regd No. H/HD ...02